భారతి JULY. 1931



# చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—అక్రూరుని విభ్రాంతి, కామోద, శ్రీ యడ్ల రామదాసుగారు

సాధారణ చిత్రములు:—తాపుర అగడిత; శ్రీ కృష్ణుని దేవాలయము-పుష్కరిణి; ప్రాచ్యనాట్యకళోజ్జీవన చిత్రములు ౬; ఇతర చిత్రములును.




చెన్నపట్టణము, జూలై ౧౯౩౧

సంపుటము ౮ ప్రజోత్పత్తి సంవత్సరము ఆషాఢమాసము సంఖ్య ౭


# చాటుపద్యములు

వడ్డాది సుబ్బారాయుఁడుగారు

ఆమనిసొమ్ము లైన చివురాకులతోఁ బువుగుత్తిపిందెలతో
మామిడికొనలోనఁ బవమానకిశోరము లాట లాడఁగాఁ
చామెయి సోఁక నామెయి; తదంగకసంకలితాంగరాగపుం
గోమలసౌరభంబు గల గుమ్మన, వేకువ మేలుకాంచితిన్.

కనరాకుండిన నీవు కన్నులకు, నీ కంఠస్వరం బో పికాం
గన! వేఁ బోక సుధాప్రసేక మయి నా కర్ణంబులం జల్లఁగాఁ
దనుకన్, నిద్దుర మేలుకొందును వసంతంబందుఁ గొన్నాళ్లుగా;
మును పేమైతివొ, యెందుఁ బోయితివొ రేపున్ మాపు నిన్ నే వినన్.

తెలవాఱుసమయమున ఱెక్కల రిం గను మ్రోఁత, కాపు కా వనుకూఁతల్
దెలుపుఁ గులాయంబుల కాకులు కొఱఁకుల కొఱకు నరుగు కోలాహలమున్.

8. 7- 1 ౧

# యతిప్రాసములు

కె. వి. యస్. దీక్షితులుగారు

"గణములు ప్రాసముల్ యతులు
కావ్యమునం గుణముల్ ఘటింపఁగా
రణములు పద్యమల్లను దొ
రంకొను నో, వసుకోని భావజృం
భణపదబంధకోటిఁ
బాటిలుఁ దన్ని యమాన సారిత
సృణి కరిణిం బలెం గవిత
నీవు మె మూ నడిపింపుము నింపుగన్."

— కె. సు. రాయని చాటుధార.

గ్రామ్యగ్రాంథికభాషావివాదముతో పాటు వీనిం గూర్చి విద్వత్సార్వభౌములు ప్రొక్కుడు వడ బయలు దేరిన వాదోపవాదధూళి మన్నుమిన్నొక్కటి గావించినది. అప్పట్నుండ నయ్యె వారితో నొకగంతు వేయవలెనను కుతూహల మనివార్య మగుట నీచర్విత చర్వణమునకుం దొరఁకొంటిని.

నేఁటి కీవాదమున మూఁడుపక్షము లేర్పడినవి. యతిప్రాస లుండవలె నను వారు మితవాదులు. అతివాదు లక్కఱలే దందురు. మూఁడవ వారు తటస్థులు (Libarals). సమయానుగుణముగ నుండవలెనని వీరి వాదము.

"ఆద్యప్రకృతి యగు సంస్కృతమున యతిప్రాసలు లేవు. ఆంధ్రమున మాత్ర మవి యెందులకు? ఈ నియమము భావప్రతిబంధకము. అందుచే రసస్ఫూర్తి కాదు సరికదా రసభంగమగును. కావ్య మందుచే సద్యఃపరనిర్వృతిసాధనము కాఁజాలదు. నిరర్గళకవితాచాతురీధురీణుల వాక్స్వాతంత్ర్యము నరికట్టుటకివి 144 శెక్షను ప్రయోగము వంటివి. కనుక నీనియమకంటకముల నూడఁబెరికి, ఆంధ్రసరస్వతికి విశృంఖలవిహారసముచితఘంటాపథ మొకటి నిర్మింపవలె"నని అతివాదుల సిద్ధాంత వాదము.

సంస్కృతమున యతిప్రాసలు లేవా?

ఏ సంస్కృతసారస్వతసుధార్ణవమునుండి మనపూర్వులు లాంధ్రభాషామతల్లి నలంకరించుట కమూల్యాలంకారము లనెడి రత్నముల నేరిరో, అట్టి సంస్కృతమున యతిప్రాసలు లేవనుట హాస్యాస్పదము. యతి-ప్రాసము లనునవి సంస్కృతమున వ్యవహరింపఁబడిన పరిభాషలే కాని యాంధ్రమునఁ బ్రత్యేకముగ నంకురించినవి కావు. లక్ష్యపరంపరలూరక పెరిగి పోవునపుడు సదసద్వివేకమునకై నియమములు పుట్టుచుండును. అందు త్తమమతము లాదర్శకము లగుచుండును. అట్లే కావ్యౌచిత్యంగూర్చి కొన్ని కట్టుబాట్లు బయలుదేరినవి. అలంకారములు, రసములు, రసోచితవృత్తులు, రీతులు మొదలగువానిం గూర్చి చెప్ప నలంకారశాస్త్ర మింగులకుఁ బుట్టినది. దీని కంగముగా ఛందశ్శాస్త్ర ముత్పన్నమైనది.

"సా విద్యా నౌ స్తితీర్షూణాం గంభీరం కావ్యసాగరమ్".
అని ప్రాక్తనులు దీనినే పొగడిరి.

"రసప్రతీతిసేఁ బొసఁగును పద్యంబు, పద్యరాశిని గూర్పఁబడును గావ్యము"

అని కావ్యమునఁ బద్యకవిత ప్రాధాన్యము వహించినది. తొల్త వింతగమనికలతో నలరారు గేయములే వృత్తములుగా మారినవి. అందులకే గణనియమము పుట్టినది. యతిప్రాసలు వానితోపాటుగనే రసోపస్కారహేతువులై ప్రాధాన్యము వహించినవి. సంస్కృతసారస్వతమునందే అవి తొల్త రూపొంది యాంధ్రమున మెఱుఁగుదేరినవి. ఆపరిణామమున నాంధ్ర సంస్కృతములందు కొద్దిభేదము తటస్థించినది. అంతమాత్రమున నవి తజ్జన్యములు కావనుట పొరపాటు. శాస్త్రాన్ననుసరించి యీ భేదము కలిగినది అట్టిభేదము కలుగుటకుఁ గూడ సంస్కృతలక్ష్యములే మూలాధారములు. సంస్కృతలాక్షణికులు వీనిని సార్వత్రికనియమముగా పాటించియుండనికతమున నాభాషయందు విరళప్రచారముకలవయ్యెను. సార్వత్రికనియమము లేకపోయినను, ఇవి సంస్కృతలక్ష్యములందు రసోచితముగ నగపడుట వలన నివి యప్రయత్నసిద్ధములనికూడ చెప్పవీలగుచున్నది. తొల్త సంస్కృతమునందలి యతింగూర్చి విమర్శింతము.—

"శ్లోకేషు నియతస్థానం పదచ్ఛేదం యతిం విదుః,
తదతీతం యతిభ్రష్టం శ్రవణోద్వేజనం యథా."

—కావ్యాదర్శము.

"ఏతం యథాయథం ద్వేగః సుధియాం నోపజాయతే,
తథాతథా మధురతానిమిత్తం యతి రిష్యతే."

—కవికల్పలత.

అని యతిస్వరూపమును నిరూపించుచు, నది శ్రావ్యతకొఱకే యుద్దేశింపఁబడినదనియు, నది లేనిచో యతిభంగ మను కావ్యదోష మమరు ననియుఁ దెలిపిరి. సంస్కృతమున యతిస్థానమున "కి"యున్న మరల "క" యుండవలెనను నక్షరనియమ మిందు లేకపోవుట నిక్కము. అందుచే నది విరతి, విశ్రాంతి, విరామము అను పర్యాయనామములచే సంస్కృతమున వ్యవహరింపఁబడినది. ఆంధ్రలాక్షణికులు లో క్కింత మార్పుతో సిద్ధాని కందము గూర్చిరి. సంస్కృతమునందలి పదవిరామనియమము పోయి తెలుఁగున నక్షరనియమము వచ్చినది ఈనియమమునను సంస్కృతమునందువలె పదవిరామము లేకున్నను శ్రావ్యతకు భంగము కలుగకపోవుటయే గాక ఆంధ్రపద్యగమనిక సంస్కృతమునందుకంటె మిగుల మనోహరముగ నున్నదనుట నిశ్చయము. సంస్కృతసంప్రదాయసిద్ధమగు నీయతి కక్షరనియమ మందముంగూర్చునా? అను ప్రశ్నమునకు లక్ష్యములే జవాబు చెప్పఁగలవు. అదిగాక

"తవ కథామృతం తప్తజీవనమ్
కవిభి రీడితం కల్మషాపహమ్."

"మదోత్కటానాం మదలాలసానామ్
గజోత్తమానాం గతయోఽద్య మందాః"

అను నిట్టిచోట్ల పదవిరామమేగాక అక్షరమైత్రియుం గన్పట్టుచున్నది. ఇట్టి సంస్కృతలక్ష్యములందలి శోభను గమనించి యాంధ్రలాక్షణికు లిట్లంతటఁ బాటించుట సుకరముకాకపోదని

యిద్దానిని నియమబద్ధముం గావించిరి. నిజమున కిది నియమమే కాదు. అద్భుతభావావేశమునం దిది యప్రయత్నముగానే పడును.

ఇంక ప్రాసము

దీనిని సంస్కృతలాక్షణికు లనుప్రాసమని వాడిరి. అది శబ్దప్రధానమగు నొకనియమము. కావ్యమునం దిది రసావహప్రధానోత్తమ సాధనములలో నొకటి.

"వర్ణానా మనువృత్తి ర్యా యతి స్సాంత్యకరస్థితిః
అనుప్రాస స్స తేనైవ సదాథా వ్యాప్యపద్ధతిః."
—కవికల్పలత.

"ఉపకుర్వంతి తం సంతం యేఽంగద్వారేణ సంశ్రితాః,
హారాదివ దలంకారా స్తేఽనుప్రాసోపమాదయః."
—విద్యానాథుడు.

ఆంధ్రలాక్షణికు లిద్దానిని గుర్తించి, శబ్దసామ్య మంతట గ్రహించుటయో నియమ మతి కఠిన మగునని తలంచి, అక్షరమాత్రసామ్యము గ్రహించి, అందును స్వరవైషమ్య మంగీకరించి

"వలక మునుగొన్న వర్ణము కృతులను
బలుమారు నుడిసిన బ్రాసమయ్యె."

ననిరి. ఆపై "అద్యోఽవళి ర్ద్వితీయః ప్రాసః" అని యాంధ్రవాగనుశాసనులు సూత్రీకరించిరి. ఇందు ప్రాసమునకు స్థలనిర్దేశము చేయబడినది. ఈనియమానుసారము నడచినది మొదట భారతము. ఆపై నందరికిని అదేదారి. సూత్రకర్తలు ప్రాసము రెండవయక్షరముగా నుండవలెనని శాసింపగలుగుటకు సంస్కృతసారస్వతమే మూలాధారము.

సంస్కృతభాగవతమున వ్యాసభగవానులు

"జయతి తేఽధికం జన్మనా వ్రజః
శ్రయత ఇందిరా శశ్వదత్ర హి,
దయిత! దృశ్యతాం దిక్షు తావకా
స్త్వయి ధృతాసవ స్త్వాం విచిన్వతే".

అని యీవిధముగ గోపికాగీత ప్రారంభఘట్టమున నద్భుతశక్తితో శృంగారరసాధిదేవత నలంకరించిరి. ఏరెండుమూడు తావులలో తప్ప ప్రాసాక్షరము భేదింపలేదు. యతికూడ జాలవరకు శ్రుతిమనోహరముగ బాటింపబడినది.

ఈఘట్టమునందే:

"విషజలాప్యయాద్ వ్యాళరాక్షసాద్
వర్షమారుతాద్ వైద్యుతానలాత్,
వృషమయాత్మజాద్ విశ్వతోభయాద్
వృషభ! తే వయం రక్షితా ముహుః".

అనుచో, 'ష' కు 'ర్ష' పడినది. అయినను శ్రావ్యతకు భంగము కలుగలేదు. యతిభేదములు పెక్కింటి గమనించునది. ఇట్టి యుదాహరణములు సంస్కృతవాఙ్మయమున ననంతములుగ నెత్తి చూపవచ్చును. వీనింబట్టి యతిప్రాసలు రసప్రధానసాధనము లని స్పష్టపడకమానదు. వర్ణింపబోవు రసస్వరూపమునందు దన్మయుడై కాని కవిత్వము వ్రాయరాదు. వ్రాయునో, అది నిజమగు కవిత్వము కాదు. అకృత్రిమసుందరస్వరూపముతో ననంతభావగంభీరగర్భితమగు నద్భుతకవితాసుధాస్రవంతి పొంగిపారలినప్పుడప్రయత్నముగానే రసోచితపదవిన్యాసమమరుచుండును. అడ్డగింపవలెనన్న నాగదు; రప్పింపవలెనన్న రాదు.

"చంచద్భుజభ్రమితచండగదాభిఘాత
సంచూర్ణితోరుయుగళస్య సుయోధనస్య".

అని వేణీసంహారమున భీముని పాత్రలో నైక్యము నొందిన కవిహృదయాంతరాళమునుండి యద్భుతవీరరసోచితపదవితాన ముద్భవించినది. ఇందు 'చంచత్' అనుటకు సరిగా 'సంచూర్ణిత' అనుప్రాస మప్రయత్నముగానే పడినది. ఇట్లే

"శిశుర్వా శిష్యా వా యదసి మమ తత్తిష్ఠతు తథా
విశుద్ధేరుత్కర్షస్త్వయి తు మమ భక్తిం జనయతి,
శిశుత్వం స్త్రైణం వా భవతు నను వంద్యాసి జగతామ్.
—భవభూతి.

"ఉటజే రామమాసీనం జటామండలధారిణమ్"
—రామాయణము.

"అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవమనాస్వాదితరసమ్"
—కాళిదాసు.

"బాలాయ నీలవపుషే నవకింకిణీక
జాలాభిరామజఘనాయ దిగంబరాయ"
—కృష్ణకర్ణామృతము.

అని యనేకసంస్కృతలక్ష్యములయందుఁ బ్రాస మున్నది. కొన్నిపాదములయందుమాత్రమే యుండుటకు నియమరాహిత్యమే కారణము. అయిన నిది యున్నచోట్లు మిగుల మనోహరములై యున్నవని తెలిసికొనుట కివి చాలును. లీలాశుకుని కృష్ణకర్ణామృతమునందు నాల్గుపాదములయందును బ్రాసముగల శ్లోకము లనేకములు——

"కందర్పప్రతిమల్లకాంతివిభవం కాదంబినీబాంధవం
బృందారణ్యవిలాసినీవ్యసనినం వేషేణ భూషామయమ్,
మందస్మేరముఖాంబుజం మధురిమవ్యాకృష్టబింబాధరం
వందే కందళితార్ద్రయౌవనవనం కైశోరకం శార్ఙ్గిణః."

శ్రవణపేయము లగు నిట్టి శ్లోకములు పెక్కులు సంస్కృతవాఙ్మయమునందుఁగలవు. కేవలలక్షణములంబట్టి లక్ష్యములు పుట్టుననుకొనుట పొరపాటు. "సిద్ధస్లోకాద్ధ్రౌవ్యాత్" అనునది లక్ష్యలక్షణము లన్నిటికి వర్తించును. సంస్కృతమునందు గుర్తింపఁబడి కన్నడకవిత్వమునందుఁ బ్రాస మంతటను బ్రాముఖ్యము వహించినది. అఱవమునందుఁ గూడఁ బ్రాసనియమము కలదు. అదియుఁగాక ద్విప్రాసము, త్రిప్రాసము, ముక్తపదగ్రస్తము మొదలగు శాబ్దికాలంకారము లిందుఁ బెక్కులు కలవు. చూడుఁడు——

"ఆడియాడి యకన్కరైన్దు, ఇశై
పాడిప్పాడి క్కణ్ణీర్ మల్కి, యెంగుమ్
నాడినాడి నరశిఙ్గావెన్ఱు
వాడివాడు మివ్వాణుదలే
పొరుమానీళ్ పడై యాళి కైత్తాయ్
శిఱుమానిడవర్ క్కావాయ్
ఒరుమాణిక్కుఱళాకి నిమిర్న్ద, అక్
కరుమాణిక్క మెన్కణ్ణదువమే."

వివిధభాషాసంప్రదాయములం గమనించియే మనవారీ యతిప్రాసలను నియమించి యాంధ్రమునకు నన్నెఁ దెచ్చిరనుట నిస్సంశయము.

యతిప్రాసములు భావప్రతిబంధకములా ?

కావు భావపోషకము లనవలెను. ఒకొక్కప్పుడు భావావేశమున నప్పటికప్పు

దప్రయత్నముగానే యతిప్రాసలు పడును. ఒక్కొక్కప్పుడు యతిప్రాసముల మూలమున ననుకోనిభావము లంతటఁ దోఁచుచుండును. ఈరెంటికిఁ గల సంబంధ మతిసూక్ష్మము; అవాచ్యము; అనుభవైకవేద్యము.

"భూషణములు చెవులకు బుధ
తోషణము లనేకజన్మదురితౌఘవిని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను గుణభాషణముల్".

అనుపద్యములో యతిప్రాసలంబట్టి భావము మరెనా, భావములంబట్టి యతిప్రాస లమరెనా? ఈప్రశ్న కుత్తర మిచ్చుటెట్లు? కేవలభావములకే ప్రాధాన్య మిచ్చుచో గద్యకవిత్వము వ్రాయుటయే సులభము. అందు నియమములు లేవు. అట్లుగాక, పద్యములు రసోపస్కారహేతువులు. అందిమిడ్చిన భావములు మిగుల రాణించు ననుచోఁ గొన్ని నియమములకుఁ గట్టువడక తప్పదు. నియమ మనున దెప్పుడును ప్రతిబంధకమే. ఆపదమున కర్థమే అంత. ఒక నియమమునకుఁ గట్టువడినప్పుడుగాని యొక వింతయందము రాదు. హారాద్యలంకారములు భారావహములే, అగుగాక! సౌందర్యాపేక్షచే నవి ధరింపఁబడుటలేదా? వివిధకాచపాత్రలందలి విద్యుద్దీపికలవలె వివిధవృత్తబంధములందమరిన భావవిస్తరము వింతయందము నెనయును. మన మాడుమాటలే, మన మూహించు భావములే కవిబ్రహ్మల నూతనసృష్టియందప్రాకృతనూతనస్వరూపమున మూర్తీభవించును. అది విన్యాసవిశేషముంబట్టి జగన్మోహన మగుచుండును. అట్టిశబ్దార్థసంఘటనమే కవిత్వము. అదే కవికిఁగల జగన్మోహనార్థంబగు పరికర మని పెద్ద లనిరి —

"యానేవ శబ్దాన్ వయ మాలపామో
యానేవ చార్థాన్ వయ ముల్లిఖామః,
తైరేవ విన్యాసవిశేషభవ్యైః
సమ్మోహయంతే కవయో జగంతి".

"అడిగెద నని కడువడిఁ జను
నడిగిన దన మగఁడు నుడువఁడని నడ యుడుగున్
వెడవెడ జిడిముడి తడఁబడ
నడుఁగిడు నడుఁ గిడదు జడిమ నడుగిడు నెడలన్."

అనుపద్యముం గమనింపుఁడు. ఇందు యతిప్రాసనియమమే కాదు, శాబ్దికనియమము మతికొంత హెచ్చుగానే కలదు. ఇవి భావముల నరికట్టెనా? లేదు; పోషించెను. ఇందలి వర్ణములు యలజడి లక్ష్మీదేవి హృదయమునం గల యలజడిని వాచికముగా సాక్షాత్కరింపఁ జేసి రసస్ఫూర్తి కెంతయు నుపకరించెను. ఇది యిట్లుండవలెనని యాలోచించి కూర్చుటకు సాధ్యమగునది కాదు. కవీశుని భావనాసరణిం గోచరించు నదృశ్యదృశ్యములు కనువగు రసావహమగు వాక్స్వరూపము తనంతే మూర్తీభవించుచుండును. అది "సహజపూర్ణరసోఽస్మి సోఽహమ్" అని యానందించుచు నద్భుతరసావేశమునం గవిత్వము వ్రాయు పోతనాదికవుల కృతులయందే గోచరించును. అట్టివారి భావావేశము నీనియమము లరికట్టఁజాలకపోవుటయే గాక తామే వారి ననుసరించుచుండును.

"లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే,
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి."

అనేకదా కలదు. దీనింబట్టి మన మొకటి గ్రహింపవచ్చును. పోతనాదులవంటి యుత్తమకవులకివి బాధకములు కాలేదు. అభ్యాసావస్థలోనున్నవారిమాట చెప్పనక్కఱలేదు. మధ్యములకే యివి బాధకములు. వారికి భావావేశ మెప్పుడో కాని కలుగదు. కలిగినపు డందు కనువగు శాబ్దికజ్ఞాన ముండదు. ఇట్టిస్థితిలో యతిప్రాసలు ప్రతిబంధకములు, కంటకములు. మరి యేమన్నన వచ్చును. వీనివల్ల కలిగెడు బాధ వారిదే. కాని అంతమాత్రమున నీనియమములను సడలించు టేటిన్యాయము? ఆంధ్రవాఙ్మయ మనంతము. అనేకభాషల కది విస్తృతి. భావానుగుణ్యముగ పదజాల మందు లభింపక పోదు. ఒకవేళ తగినంత ప్రతిబంధక మెక్కడేని తటస్థింపవచ్చును. అట్టితావులయందు యతిప్రాసలే కాదు, గణములుకూడ తప్పనను తప్పవచ్చును. వ్యాకరణముంబట్టి కుదురని యపశబ్దములే పడవచ్చును. అందుకు సంస్కృతమునం దనేకలక్ష్యము లున్నవి. అందుచే భంగము లేదు. యతిప్రాసలు లేనిచో కవిత్వము బెడిసికొట్టునను నుద్వేగ మెచ్చుటను కానరాదు. కాని దురూహ్యములగు నట్టిసమయము లెక్కడనో, ఎప్పుడో వచ్చునని తలంచి సార్వత్రిక నియమములను సడలించుటవలనఁ బ్రయోజనము కలదా? నియమములు సడలించి నీరస కవిత్వములకుఁ బ్రాముఖ్య మిచ్చుట తగనిపని. అందుచే క్రమముగాఁ బద్యకవిత గేయకవితగా మారి తందానపదాలే మహాకవిత్వమని యానందింపవలసినరోజులు భాషయొక్క యనాది స్వరూపమును బోధించుచు మరల మున్ముందుగాఁ దలయెత్తునేమో! ప్రాక్తనుల నిర్ణయము లతి గంభీరములు. అవి యింతవఱకు శాసనముగానే పనిచేసినవి. కాదనువా రింతటఁ గలుగలేదు. యతిప్రాసముల నెచ్చిపెట్టుటలోఁ గల వారియుద్దేశము చక్కగ ఫలించి తీరె ననుటకు నిత్యపరంపర లాంధ్రసరస్వతి కమూల్యాలంకారములై యలరారుచున్నవి.

భాషాసేవకులారా! భాషామతల్లి సహజసుందరస్వరూపమును గ్రొంగ్రొత్తలగు భావపరిమళముల వెదఁజల్లు సరసములగు చంపకోత్పలాదివృత్తమాలికల నందముగాఁ గైసేసి కృతకృత్యుల మగుదము గాక! "దేశభాషలందు తెలుఁగు లెస్స" యని తెలుఁగువాణి నుతింపఁబడుట మన భాగ్యము కాదా!

"ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే
వందేమహి చ తాం వాణీ మమృతా మాత్మనః కలామ్.

---

ఇంటిగుట్టులు పగతుర కెఱుకపఱిచి, లంకధ్వంసించినట్టి యల్పమతి వీవు
నే ననిష్టుండనైతిఁ గాకేమి, నీకు నంతమాత్ర నరులఁ జేరు టర్హమయ్య !
ఒక్కకంచాన భుజియించి, యొక్కమంచమున నె పండినవారము, మనసుభేద
మైనమాత్రాన పగవాని నాశ్రయించి యిట్టి కుత్సిత మొనరింప హితమటయ్య!
ఇహసంబంధములఁ ద్యజించి యపవర్గేచ్ఛఁ, బురిఁ వీడి, య
మ్మహనీయుండు విభీషణుండు చనె సమ్యగ్బుద్ధి; నేనన్న, న
న్విహమ్ముఁ దౌష్ట్యమె పూనియుంటి నను చింతఁ గుందితిఁ గాని, రా
జ్యహ్వాతిఁ గూరి, యరిఁ భజింతువని నిఁ శంకింపరా దుర్మతీ!
నీవె రాజ్యమ్ము నేలు మోయీ! విభీషణా! రఘూద్వహు దివ్యబాణమున మడిసి
పడసెదను నేన యవ్యయాభవ్యఫలము-చెలఁగు మీవొక్కఁడవె చిరంజీవివగుచు.
అని యంతట నీరాశంసనమున రఘురామబాణజాలకుతి ప్రీ
లిన వక్షముతోడ దశాననుఁ డసువుల వీడి చనియె నాకంబునకున్.

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్న సైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విశీలఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.

---

కులును ఒక్కొక్క మాటయొక్కయు పుట్టుకను చరిత్రమును శోధనచేసి బయలుపఱచి నిఘంటువులను వ్రాసియున్నారు. ఇంకను వ్రాయుచున్నారు. ఇందుల కారణము, వారికి మానావమానములు లేకపోవుటయే. ఇట్టి గ్రంథములు మనభాషలకును కావలసియున్నవి. ఎప్పుడు కలుగగలవు? మనకును మానావమానములు వీడిపోయినపిదప. ఇప్పుడు అనేకపదములు అన్యదేశీయములని మన లాక్షణికులకును, నైఘంటికులకును తెలియుట లేదు. అట్టివాటిని దేశ్యములని చూపి విరమించుచున్నారు. ఈనిఘంటువులలో తెలుగుపదములును దేశ్యములు, అరబ్బీనుండి వచ్చినవియును దేశ్యములే ఇట్టి లక్షణములవలని ప్రయోజనమేమి?

ఈక్రింద వ్రాయబడిన పదములను పరికింతురు గాక.

౭. అంగడి—దేశ్యము=దుకాణము—దేశ్యము.

౮. కిటికీ, దేశ్యము = గవాక్షము—

౯. హాజురు—దేశ్యము—ఆస్థానము—హజారము యొక్క మాఱురూపము.

హజారము—దేశ్యము, అజారము దీని మాఱటి రూపము.

అజారము—దేశ్యము—మొగసాల.

౧౧. పాపోసు } వైకృతము=ముచ్చె.
పాయపోసు }

౧౨. పాదుసా } వైకృతము=రాజు.
పాదుసాహి }

ఈ నైఘంటికులు ప్రయోగించుచున్న దేశ్యము వైకృతము అను సంకేతముల కర్థము వారికే తెలియవలెను. నగువువారికి తెలియదు. 'విధాతా వేత్తి నానవా'.

౬. దుకాణశబ్దము—అరబ్బీనుండి పారసీలో చేరి, భారతఖండములోని మహమ్మదీయుల వాడుకలలో ప్రచురమై, హిందువులు వాడుచుండుమాట. ఇది మాండలికము. విశేషించి విశాఖపట్టణసీమలో దుకాణ మందురు. నెల్లూరుసీమలో అంగడియందురు గాని దుకాణమనుట లేదు. దీనికి పారసీరూపములు దుకాన్—దూకాన్—దుక్కాన్—వీటి యర్థము అంగడియని—ఇది యెట్టి దేశ్యమని ఈనైఘంటికుల యభిప్రాయము?

౮. కిటికీ, దేశ్యము=గవాక్షమని యర్థము.

ఇది తెనుగుమాటకాదు—హిందీ—ఆభాషలో దీని రూపము ఖిడ్కీ—ఇది యెట్టి దేశ్యము ?

౯ హాజురు }
హజారము } దేశ్యములు =ఆస్థానము—
అజారము }

ఈపదములు అరబ్బీశబ్దమునకు తెనుగువారి నాలుకలలో పుట్టిన వికారములు. మహమ్మదీయ ప్రభుత్వములో పుట్టినవి — అరబ్బీరూపములు హాజిర్ — హుజూర్,

ఈహాజిర్ శబ్దమును 'కోర్టుకచ్చేరీల' వాడుకలలో మహమ్మదీయులును, హిందువులును అనుదినము చెప్పుచుందురు. అయితే ఉచ్చారణ తప్పుగ నుండును. హాజిర్ అని హ్రస్వపూర్వమును ఇకారముతో చెప్పక హాజర్ అని అకారముతో చెప్పుదురు. ఇట్లే 'నాజిర్' శబ్దము. 'కోర్టు నాజరుగారు' అందురు. 'నాజిర్' అని చెప్పవలెను. ఈపదము లెట్టి దేశ్యములు ?

౧౧. పాపోసు—పాయపోసు, వైకృతము=ముచ్చె. వైకృతమను సంజ్ఞకు నిర్వచన మిట్లున్నది. 'ప్రాకృతసమము, సంస్కృతప్రాకృతభిన్నము నైనపదము'—దీని యర్థము సులభబోధ్యము కాదు. మొదటివిషయము, ప్రాకృతమన నేమి—సంస్కృతము చెడి హిందుస్థానములో నూరుప్రాకృతము లయియున్నది. ప్రాకృతము అన్నమాత్రన యేప్రాకృతమని అన్వయించునది.—ఏప్రాకృతసమము. ఈపాపోసు, పాయపోసు శబ్దములు ప్రాకృతసమములు కావు, సంస్కృతప్రాకృతభిన్నములును కావు. పారసీమాటలు—'పాయొపోష్' అనునది రూపము. (యకారమును తేలబలుకవలెను). అనగా ముచ్చె అని అర్థము—పాయొ=కాలికి, పోష్=తొడుగు—కాలికితొడుగు అనగా ముచ్చె—పాపోష్ అని పారసీ

ధాతురూపము—అర్థము, తోడుగుట. దీనియందలి వకారము మనవారి వాడుకలో సకారముగ మారినది. ఈశబ్దము మాండలికము—నెల్లూరుసీమలో మద్రాసులో కొంతకాలము క్రింద వాడుకలో నుండినది. ఇప్పుడు—ఈమాటను వాడుట లేదు. 'బూట్సు' క్రింద నలిగిపోయినది. దీనియర్థము ఈకాలములో సాధారణముగ తెలియదు.

౧౧. పాదుసా — పాదుసాహీ — వైకృతము= రాజు—వీటినిగురించి యొకవార్తికము వ్రాసియున్నారు. "పాదుసా, పాదుసాహీ, శబ్దములకు మ్లేచ్ఛభాషయందు తఱుచు వాడుక గలదు."

దీనివలన స్పష్టము. వీరికి మ్లేచ్ఛశబ్దమున కర్థము తెలియలేదు. ఈ తెలియమి మనలో సందేహపూర్వముగ సామాన్యమై యున్నది. మ్లేచ్ఛభాష యనుటలో ఈ భరతఖండములోని మహమ్మదీయుల వాడుకభాష యని వీరిబోధగా తెలియుచున్నది. మఱియు 'తఱుచు' అనుటలో వీరి భావ మేమని తెలియలేదు. ఇట్లయినగాక తఱుచువాడుక గలదనుటచే నేమి ద్యోతితము? ఇది తెనుగుమాట యనియును దీనిని మ్లేచ్ఛులు తమభాషలో చేర్చుకొని వాడుచున్నారనియూ, లేక యిది మ్లేచ్ఛభాషలో రూఢమయిన పదమనియును తెలుగులో చేరియుండుననియా?

ఈ రెండు సందర్భములలో నొకటియును వీరి వైకృతశబ్దనిర్వచనమునకు సరిపడదు. అట్లుండ వైకృతమనుట యెట్టిది. పాదుసా—పాదుసాహీ— ఇవి పారసీభాషమాటలకు వికృతరూపములు. పాద్‌షా—పాద్‌షహ్ (బాద్‌షా అని రూపాంతరము) అనగా, సార్వభౌముడు, చక్రవర్తి, సమ్రాట్ — రారాజు, పాద్‌షాహీ—విశేషణము — విశేష్యముగ గూడ వాడబడును. ౧. చక్రవర్తికి సంబంధించిన, సామ్రాజ్యమునకు సంబంధించిన, ౨. ప్రభుత్వము— ఆర్యావర్తమునందు మహమ్మదీయప్రభుత్వముతో వాడుకలోవచ్చి చేరినవి. మొగలయి ప్రభుత్వములో మిక్కిలి వ్యాపకమును జెందినవి. ఢిల్లీపాదుషా అని వాడుక. సామంతరాజులకు పాదుషా అని చెప్పరు. తఱుచుగ నాంధ్రుల వాడుకలో 'పాచ్ఛా', 'పాచ్ఛావు', 'పాచ్ఛాయి' అని గూడ గలదు. పాపోసు శబ్దమునందు వలె షకారము సకారమగుట.

బొబ్బిలికథలో (బాల్యములో విన్నజ్ఞాపకము.) బుస్సీదొరసరదారీలోని ఫ్రెంచిసైనికులను గురించి కలమాటలు.—

'దేశమెరుగనీ ఫరాసులే మనదేశము కొచ్చినరు. భూము లెరుగనీ ఫరాసులే మనభూములకొచ్చినరు. అంత లేసి మారాట భూములే పాతముచేసినారు. గోలకొండ దర్బారి మీదనే కొట్టె పోరినారు. పాచ్ఛావును సాధించినా ఫరాసులే వీరు'

ఈకథ చెప్పినవారికి ఆకాలమందు పాచ్ఛాశబ్దము యొక్క క్రమమైన యర్థము తెలిసియుండినది. గోలకొండ దర్బారు అన్నాడు. అనగా సామంతప్రభుత్వమని—ఇక్కడ గోలకొండ దర్బారు అనునది నిజాముగారి ప్రభుత్వము.

పాచ్ఛావుఅన్నది ఢిల్లీచక్రవర్తి. మారాట్య అనునది మహారాష్ట్రి అని యర్థము.

పారసీకులు—సాంస్కృతికుల గణములోని వారు. కావున సాంస్కృతికులవంటి మ్లేచ్ఛులే గాని వేఱుకారు. వారి భాషయును సంస్కృతభాషవంటి మ్లేచ్ఛభాషయే గాని ఎక్కువ తక్కువలు లేవు. వివరము వక్ష్యమాణము— మనదేశములోని మహమ్మదీయులు వాడుచుండెడి భాషయును మ్లేచ్ఛభాష కాదు. హిందుస్థానములోని హిందువులు వాడుచుండు భాషయును ఇదియును ఒకభాషయే యని చెప్పవచ్చును.

ఇట్టి సన్నివేశములో అపేక్షణీయ మయిన సాహిత్యపటిమ లేక మనభాషలకు నిఘంటువులను వ్రాయబూనుట సాహసము. కేవలసంస్కృతము నాధారపఱచి సంస్కృతమునకు గాని, సంస్కృతాంధ్రములనుమాత్రి మాధారము చేసికొని తెలుగునకు గాని నిఘంటువులు ఏర్పడవు.

మఱియును, కొన్ని ఆలంకారికవచనములు వాడుకలో నుండును. అవి తెలియనివారికి తెలియుటయెట్లు? 'వాణ్ణి పెద్దవాణ్ణి చేసి పంపినారు.' అనగా గుడ్డలు విప్పి తఱిమినారని యర్థము. 'వాడికి పాదపూజచేసినారు' అనగా చెప్పుతో కొట్టి పంపినారని యర్థము.

కొన్ని పదములు స్వస్వరూపములుగ జెప్పిన నమంగలములుగ నుండు ననియు, అవాచ్యములనియు భావించి విపరీతముగ సవరించి చెప్పుచున్నారు. కుండలో 'బియ్యము నిండుకున్నది' అనగా లేదని యర్థము. 'తాళికంటు పెరిగిపోయినది' అనగా తెగిపోయినదని యర్థము. తెగిపోయినదనుట వైధవ్యసూచకము—'మంగలవారము' ఏకార్యమునకుగాని అమంగలము. అయినను మంగలమని చెప్పబడుచున్నది. అట్లే 'మంగలవాండ్రు', 'భద్రకాళి.' 'శనివారము'ని చెప్పుట ప్రశస్తము కాదు; స్థిరవారము అనవలయును. 'దీపమును ఆర్పుము, ఆర్పివేయి' అని చెప్పరాదు. 'దీపము పెద్దదిచేయి' 'నిలుపు' అని చెప్పవలెను. ఇట్టిమాటలు ఎన్నియో కలవు. ఇవి తెలియనివారికి తెలియుట యెట్లు!

ఇట్టి పదవిశేషముల కంతయు పైన చెప్పిన యూరోపుభాషలలో నిఘంటువులు ఏర్పడియున్నవి. మనభాషలలో నట్టిగ్రంథములు ఏర్పడుటకు సామగ్రి యేమియున్నది. పరిశ్రమ చేయువారెవరు? పూర్వీయసూరులు దేశాభిమానులయి భాషాభిమానులయి, పాటుపడవలయును. అవకాశము కలుగజేసికొని యిట్టి విషయములను నిర్మింపవచ్చును. ఒకదినములో జరుగుపని కాదు. ఒకపురుషాంతరములో నగునది కాదు. ఒక్కనివల్లనే తుదముట్టునది కాదు. ఆలస్యమయినను ఆరంభము చేయవచ్చును. 'అల్పశ్చకాలో బహవశ్చవిఘ్నాః' అయ్యును, కొంతకాలమునకు నిరంతరపరిశ్రమవలన నిట్టిగ్రంథములకు ఆకృతి యేర్పడగలదు. మీమాంసలేని, పృచ్ఛలేని చదువు కాసుకు అక్కఱకు రాదు.

బూరెశబ్దము నెల్లూరుసీమలో అసభ్యమైన మాటయని చెప్పితిమి. అయినను 'బ్రాహ్మణా భోజనప్రియాః' కావున బూరెల, గారెల, లడ్డుకముల, మోదకముల సంగతి విచారింతము.

మనుష్యసృష్టి యేర్పడిన కొంతకాలమువఱకు— మానవకోటికి, దేవుడు — దయ్యము అనే వ్యక్తులుండినట్లు తోచి, వానియందు ఒకవిధమయిన భయముతో కూడిన భక్తి ఉత్పన్నమయినది. ప్రథమమున చెట్లు, చేమలు, రాళ్లు, అప్పలు, అచేతనములు. వీటియందు దేవత్వమును పిశాచత్వమును కల్పితములయి యుండినవి. పర్వతములనుండి గండశిలలు కదలివచ్చినరోజుల వాటినిన్ని, ఆకాశములోని జ్యోతిర్మండలములనుండి భ్రష్టములయి ఊడిపడి పడుచుండు వానిని దైవభావనచే కొలుచుచుండిరి. ఇట్టి యనలంకారములు కాలక్రమమున నితరభూములలో అడుగంటిపోయినవిగాని మన కిప్పటికిని నిలచిన విషయములుగా నున్నవి. తులసిచెట్లు, కంపసిలకలు, ఉసిరికచెట్లు, కేదారము, అశ్వత్థము, నింబము ఇత్యాదులను ఆరాధనము చేయుచున్నారము.

అక్కడక్కడ కొన్ని చెట్లు, కొన్ని రాళ్లు వాయుచేష్టితమువలనగాక సూక్ష్మమయిన కారణములచే కదలును, తిరుగ యథాపూర్వముండుట అగపడుచుండును. ఇట్టివి నిస్సందేహముగా దేవతలే యని భావించి వానిని పూజించుచుండిరి. ఈ సందర్భములో ఒకమాటను ఉదాహరింతము.

౧. వేతాళ—బేతాళ—భేతాళ— ఈ శబ్దమును మొదటి రెండు రూపములను సంస్కృతమని భావించియున్నారు. ఆంధ్రదేశమున వాడుకలో వర్ణవ్యత్యాసముగా చెప్పుట కలదు. గ్రంథములలో వర్ణవ్యత్యయాదిక ముండును. సంస్కృతరూపములు 'వబయోరభేదః' అని చెప్పినవి. వానిలో 'వేతాళ' అనునదియే సరియయిన రూపమని భావించియున్నారు. అట్లుకాదు, 'భేతాళ' అనునది సరి. ఈపదమునకు అర్థము శబ్దరత్నాకరములో నిట్లు చెప్పబడినది. భేతాళము — "సంస్కృతము. విశేష్యము—౧ పిశాచము—౨ భూతావిష్టమృతశరీరము; భేతాళుడు—యక్షుకింకరుడు." శ్మశానభూములయందును, రణరంగములయందును రాత్రివేళల కొఱవిపిశాచములును, భూతావిష్టములయి లేచి ఆడు కబంధములును, మృతకశరీరములును ఉండునని నమ్ముచుండిరి. అమర

౨. యావిప్పనగ్ం హాశిరిషినగ్ం.

3 జద్గాశ గరిన్ గన్ యజుష్ దధాఇతి.

౪. యావిస్పాహా ఇరిష్క్షిపాలజామిత్రో యజుష్ దధాఇతి.

౫. యావిస్పవగ్ంహాఇరిషినగ్ం.

౬. దాశతీం రత్న్యంపవిను అనబరఇతి.

గీనియర్థము.

౧ వి (అ) అనాహితాదేవి పురుషునియొక్క శుక్లమును లెస్సగ శుద్ధచేసిపెట్టును. ౨. అంబు స్త్రీల యొక్కయు, 3. గర్భగోళములను గర్భము లకటకుగా కడిగి శుభ్రము చేయుచుండును, ౪. అందలు స్త్రీలను సుఖప్రసవముగునట్లు జాగ్రతపెట్టును, ౫. అందలు స్త్రీల కును, ౬. వారి పయోధరములయందు న్యాయముగ, నుచితముగ, నుండవలసిన గుణములను ఉంచుచుండును.

కనుక ఈసందర్భములను గురించి అమ్మవారు చేయవలసిన పనులవిషయములో సందేహముండనేరదు.

ఈఅనాహితానామము లలితాసహస్రములో అనాహతా అని కనబడును. అనిస్త్రశుతిలోని రూపమే సరియని చెప్పతగియున్నది. అక్కడయోని అని తెలుపుకు కాబోలు అనాహతా అని మార్చినారు. ఈశబ్దము గ్రీకులో అనైటిస్—అనైతిస్ [అనయితిస్] అనియును, అరబ్బీలో నాహీన్ అనియును ఉన్నది గనుక ‘అంకార ఇకార’ రూపమే ప్రశస్తమని చెప్పతగును.

మతియు అమ్మవారు తానుగా గర్భమును ధరించి సృష్టిచేయువలసియున్నది. కావున గీబూ తేలు ఉభయ త్రాపి ఈస్త్రీగర్భసూచకముగ నమ్మవారికి నివేదన.

గారెలు లేక వడలు స్త్రీవిషయిక ప్రకృతిరూపము; బూరెలు గర్భిణీరూపము. బూరెలలోపల చెనక బీజముల ‘పూర్ణ’ముంచుదు. అది గర్భములోని ‘భ్రూణ’ ద్యోతకము. ఒకగ్రామీణుడు సుగియుడు ప్రథమము చూచినపుడు సరియైన నిర్వచనము చెప్పినాడు.—‘లోనపప్పు, మెయిడొల్లు’.

మన్మథునికి ఇక్షుచాపుడని యొక పేరు గలదు దేశమంతయు తెలిసియున్నది. దీనియర్థము ప్రాచీనుల నాటకములలో నేర్పరచియున్నది. అదియును మన్మథునికి సరిపడియున్నది. స్త్రీపురుషప్రకృతులు రెండును రతిపతి అధికారమునకు లోబడినవి. చెఱకుగడ దీర్ఘమయి నిలుచుటచే పురుషవ్యక్తికి సంబంధించి ఉత్థానసూచకము నాటియు నీదేశమున విరుగనియ్యకుండ వంగవచ్చును. విల్లుకు కావలసిన వంపుతో నుండునపుడు ఇది గర్భిణి స్త్రీయొక్క ప్రవృద్ధమయిన యుదరమును సూచించునని అనగా పురుషునకు ఉత్థిసిత విశేషమును స్త్రీకు తద్ద్వారా ఇట్టిసితివిశేషమును కలుగజేయు వాడని యర్థము.

## 15. మోదకము—16. లడ్డు, ఉండ్రాలు

ఇవి పురుషాకృతిని అనుసరించి పురుషదేవతకు ముఖ్యమయిన భక్ష్యములు. ఇందులో మోదకము [కుడుము] నిడుపుగ నుండునది. ఇది ప్రధానరూపము. లడ్డు-ఉండ్రాలరూపము, గుండ్రము — సుబోధ్యము. మోదకశబ్దమును ‘మోదము’ అనగా ‘సంతోషము’ అనుమాట నుండి నిష్పన్నమయినట్లు భావించుచున్నారు. సంతోషము కలుగచేయునది యని యర్థము. అయినను చెప్పవలసినమాట చెప్పలేనందువి.

మహారాష్ట్రిభాషలో ‘మోధ’ శబ్దమునకు అర్థము, ‘పుట్టించును’, ‘పుట్టుట’. ప్రథమాక్షరములోని దీర్ఘము హ్రస్వమయిన యెడల నంబడియుండు హల్లు ద్విరుక్తమగును. ఇది అనేకభాషలయందును ఆంధ్రము నందును కలదు. ఆప్రకారము మోఢశబ్దమునుండి వాడుకలోని తెలుగుపద మొకటి కలిగియున్నది. మోఢకమును నన అవాచ్యముగ నందునని మోదకముగ మారినది.

లడ్డుశబ్దమును, హిందుస్థానీభాషలోనిలకారాదిగల యొకశబ్దమును రెండును ఒకటియే. అనేకభాషలలో అనుస్వారమును తీసివేసినపుడు వెంబడిగలహల్లు ద్విరుక్తమగును. ఇట్టిదే యొకవిశేషముకలదు. కొన్ని భాషలలో అనుస్వారము వ్రాయుటలేదు. ఉచ్చారణలో

వమ్ము తదీయయత్నము! లవమ్ము శిరోవ్యథ మాన" దంచు త
ల్పమ్మున వెన్న వాల్ప వ్రజభామిని యోర్తుక యార్తి గృష్ణుతో—
"ఔషధసేవ నిష్ఫలమెమైన మ రెట్టులు మాను నీ శిరో
దోషము కృష్ణ? ఏమియును దోచదు మాకు ద్వపేయబాధ ని
శ్శేషము కానిచో!" ననగ, చెంగట నున్న ఘటంబు వ్రేల నా
యోషకు జూపి, "దాన యమునోదకముం గొనివచ్చి యెవ్వరేన్—
నేటుపుత్తోడ నాయుని సిరికణంబును రాలనీక ము
మ్మాగి ఘటమ్ము ద్రిప్పనెడ మాను శిరోవ్యథ" యన్న మోహనా
కారుని భాషణమ్ములకు గాటపువిస్మయ మావహిల్ల నా
వారిజనేత్ర యిట్టు లను వారిలగాంచి దరస్మితాస్యయై.
"చూచితిరే నవీన మగు చోద్యము! ఛిద్రఘటంబు సూర్యజా
వీచికలందు ముంచినను వేగమె తోయము నింప, దింటికిన్
చే చనుచెంతు మన్న పదవీముఖమందె స్రవించు బిందువుల్;
ఆగుచుట లేదు నాకిపుడు తోయ్యలులార, యుపాయమేమియున్.
సిపె విధానముం దెలుపనేర్చిన మే లగు నందనందనా!"
నాపుడు కృష్ణు డిట్టు లను: "నాపయి ప్రేమ నిమేషమేనియున్
భావములోన నెవ్వ రెడబాయక యుందురొ వారు తెచ్చుచో
గోవదు బిందువేని జలపూర్ణముగా ఘటముండు నెచ్చెలీ!
అల్లన నింతలోన పునరాగతయూచు కవాటసన్నిధిం
దల్లి తనూజు పల్కులను తత్పరత న్విని, "ఎన్న జేని నా
యుల్లమునందు నేమరిక నొక్కనిమేషము పాటు ప్రేమ సం
ధిల్లక యున్నదేమొ" యని తేకువ తక్కి యనిశ్చితాత్మయై.
అంగణభూమి నింపెసగు నామ్రమహీజముపంక గ్రుక్కిళుల్
మ్రింగుచు జూచుచు న్నిలిచె మిక్కిలి తత్తరపాటుతోడ గో
పాంగనయుం బరస్పరముఖాబ్జవిలోకన మాచరించుచున్
చెంగులు వ్రేళ్లద్రిప్పుచును సిగ్గున పానము పూని రయ్యెడన్.

---

# శ్రీ ప్రతాప వీరరుద్ర దేవుఁడు

ప్రాచీనాంధ్రక్షత్రియకులములఁ గాకతీయాన్వయము మిగులఁ బ్రఖ్యాతమైనది. ఈవంశము రాజులు శౌర్యౌదార్యములందును, దానధర్మములందును బురాణక్షత్రియులను సమానులై వెలసిరి. ఈవంశమునఁ బుట్టిన రాజుల చరిత్రము లిదివరకనేకు లనేకవిధముల వర్ణించియున్నారు. సుప్రసిద్ధవిమర్శకు లిదివఱకెఁ దెలిపినదానికంటె నావ్యాసమున విశేషము లుండవుగాని మనపూర్వులను మరల నొకపరి స్మరించికొని మనము తరించుటకు నావ్యాసము బాగుగ నుపకరించును.

కాకతీయుల కాకులనామ మేర్పడినవిధము భిన్నముగనున్నది. సోమదేవరాజను నొకరాజు కంధారమును పట్టణమున రాజ్యము చేయుచు కటకపు గజపతులచే నోడింపఁబడి దానధర్మముల ప్రాభవాయున నొక్కకుమారుఁ గనియెను. ఆకుమారుఁడు గర్భమందున్నపుడు గజపతులు సోమదేవరాజుం జంపి యాతని భార్య గర్భమందున్న శిశువునుగూడం బరిమార్పఁ బ్రయత్నించిరి. ఆమెను బురోహితుఁడగు మాధవశర్మ తనకూఁతురని చెప్పి శత్రువుల బారిఁబడకుండఁ గాపాడె. కుమారుఁడు జనించినంత వానికి మాధవవర్మయను నామముంచి విద్యాభ్యాసము చేయించుచుండెను. ఆపురమున కించుకదూరమునఁ బద్మాక్షీదేవి యాలయముండెను. ఒకనాఁడు రాత్రిపడిన పిదప నాబాలుఁడా యాలయమున నిర్భయముగఁ బ్రవేశించెను. దేవి వానిధైర్యము ననేకవిధములఁ బరీక్షించి, సంతసించి వానికి దివ్యాయుధములను శస్త్రశాస్త్రంబులును, జతురంగసైన్యంబును నొసఁగెను. దానిచే నాతండు కటకగజపతులఁ బరిమార్చి దిగ్విజయము గావించి చక్రవర్తియై యాయిల నేల కాకతీయవంశమునకు మూలపురుషుండయ్యెను. ఈతనికి వరము లిచ్చిన పద్మాక్షీదేవికి కాకతియను నామాంతరముండెను. దానివలన మాధవవర్మ దొట్టె యావంశమువకుఁ గాకతీయవంశమను వ్యవహారము గల్గెను.



కాకతి యను గుమ్మడితీఁగ యఁట! ఒక మున శత్రువులు రాజమందిరము ప్రవేశించి పురుషుల నింగు స్త్రీలను, శిశువులనుగూడఁ జంపివైచిరి. ఆసమయమున నొక రాజశిశువు వెల్లో ప్రాకుచుఁ బెరటిలోనున్న గుమ్మడితీఁగలో నున్న కాయలతో నాడుకొనుచుండెను. శత్రువులు గుమ్మడిపందిరి నడుమ నున్న శిశువును బోల్పలేక విడిచిపోయిరి. అనంతర మాతండు పెరిగి వంశకర్తయయ్యెను. తన్నుఁ గాపాడిన గుమ్మడితీఁగకుఁ గృతజ్ఞతతోనాయఁ గవవంశమును కాకతీయుని యాతఁ డేర్పఱించెను.

ఈరెండువిధములు మాత్రము ప్రసిద్ధములై యున్నవి. ఈరాజవంశము మొదట చంద్రవంశమునది. పిదపఁ గాకతీయవంశమని మాఱినది. కందారము (గాంధారము)ను మాధవవర్మయును జాల రాజవంశముల చరిత్రము లందుఁ బ్రసక్తములగుచుండును. వాస్తవముగ నీపురమునకు నీరాజునకు నాయా రాజవంశములతో సంబంధము కలదో లేక ప్రాచీనతకొఱకు మత్కర్షకొఱకును సంబద్ధమగుచుండునో తెలియదు. ఈమాధవవర్మ శ్రీరాముని పెద్దకుమారుఁడగు కుశుని సంతతిలోనివాఁడనియు, నాకారణమున సూర్యవంశమువాఁడనియుఁ గొన్ని చరిత్రములందుఁ గలదు. కొన్నింట చంద్రవంశమువాఁడనికలదు. కాకతీయవంశచరిత్రమునఁ జంద్రవంశమువాఁడనియే తెలియఁబడుచున్నాఁడు. ప్రాచీనకాలము నుండియుఁ గాకతీయుల రాజధాని యేకశిలానగరము. అది యిపుడు నైజాము రాజ్యమున వరంగల్లు అను పేరఁగలదు. తొలుతటినుండియుఁ గాకతీయులకును, కళింగగజపతులకును మిగుల విరోధము. ఉభయరాజ్యములవారు నెల్లప్పుడును యుద్ధములు చేయుచునే యుండువారు. ఈకాకతీయవంశమున రుద్రదేవుఁడను నొకరాజు మిగుల శివభక్తిగలవాఁడు. అనుదినము కాళింగలో స్నానముచేసి శివు నభిషేకింపనిదే

# కతియవారు ట్రేడింగుకంపెనీ యొక్క—

## సర్వజనాదరణీయమైన తలనూనెలు అందు వివిధపరిమళములుగల అత్తరులు

## కుసుమాల్ హెయిరాయిల్ (రిజిస్టర్డు)

శిరోజములకు, మెదడుకు, తగినటువంటి తలనూనె. సువాసనద్రవ్యములతోను, హీనాపుష్పములతో చేయబడి, సాటిలేనిదై తనరుచున్నది. సంపన్నులు మెచ్చినది. సీసా 1-కి రు. 1. వి. పి. చార్జీ 6 అణాలు ప్రత్యేకము.

## కెటి వైట్‌రోజ్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

సంపూర్ణకలవృద్ధికిని, కాంతికిని తోడ్పడునట్టి తలనూనె. గులాబీపువ్వుల నిజసౌరభ మిందు గలదు. ఒకసారి పరీక్షించిన మీకే తెలియగలదు.

వెల సీసా 1-కి 14 అణాలు. వి. పి. చార్జీ 6 అణాలు.

## కెటి కోకోనట్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

కొబ్బరినూనె తల కుపయోగించుటను ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధము చేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ నెం. 777 రు (రిజిస్టర్డు) చేసిన ఈ కొబ్బరి నూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగాను సూక్ష్మసువాసనాసంకలితముగాను గావింపబడినది. అందుచే సామాన్యగృహస్థు లందరి మెప్పు నొందినది.

6 ఔన్సులు గల సీసా 1-కి 14 అణాలు. వి. పి. చార్జీలు 10 అణాలు ప్రత్యేకము.

మరియు జ్ఞప్తియం దుంచుకొనుడు.



## కెటి ఒట్టో రోజ్ నెం. 777 రు (రిజిస్టర్డు)

దీనికి సరిసమానమగునది లేదు. రోజాపుష్పములచే చేయబడినది. పుష్పవనమునం దున్న తాజా గులాబీపుష్పము లెంతటి పరిమళము నొసగునో యంతటి సౌరభము నింపు బడయగలరు.

అరఔన్సు బుడ్డి 1-కి రు. 1-12-0, పావు ఔన్సు బుడ్డి 1-కి రు. 1-0-0.

## కెటి ఒట్టో జాస్మిన్ నెం. 777 రు (రిజిస్టర్డు)

మల్లెపుష్పములను తెలియనివా రుండరు. కెటి ఒట్టో జాస్మిన్ (నెం. 777 రు) మల్లెపువ్వులు లేని కాలము లందుకూడ మల్లెపూలవాసన నిచ్చుచు ఆశ్చర్యమును ఆనందమును కలిగించును. ఈ పరిమళము నొక్కసారి యాఘ్రాణించిన, అదిలేక మీ రొక్కక్షణమైన యుండజాలరు.

అరఔన్సు బుడ్డి రు. 1-12-0, పావుఔన్సు బుడ్డి రు. 1-0-0.

## ఒట్టో మధుకర్ (రిజిస్టర్డు):—

ఒకసారి యీ అత్తరు నుపయోగించినవారు, సర్వదా దీనిని విడనాడలేకున్నారు. మేలైన పుష్పసౌరభమే యిందులకు కారణము. అరఔన్సు బుడ్డి 1-కి రు. 1-12-0. పావుఔన్సు బుడ్డి 1-కి రు. 1-0-0.

వి. పి. చార్జీలు 5 అణాలు ప్రత్యేకము. (ఒక్కొక్కదానికి)

షరా:—మీ గ్రామములందున్న దుకాణములలో కొనునప్పుడు కెటి మరియు నెం. 777 రు అనుపదములను గమనించుడు. అట్లుచేసిననే శుద్ధమైనవి మీకు దొరకగలవు.

పరీక్షార్థమై రెండు అణాస్టాంపుల నంపి యే రెండు తలనూనెల నమూనాలుగాని, లేక అత్తరునమూనా యొకటిగాని తెప్పించుకొనుడు.

సోల్ ఏజంట్లు:—**ది కతియవారు ట్రేడింగు కంపెనీ,**

ఖెట్వాడి మెయిన్‌రోడ్, బొంబాయి, నెం. 4

ఈవాక్యము లన్నియు విద్యానాథుని చేతనే రచింపఁబడినవి. ఈతఁడు ప్రతాపరుద్రునకు సమకాలమువాఁడే యని చారిత్రకులు వచించుచున్నారు. కావున నితఁ డిట్లన్యోన్యవిరుద్ధముగా వ్రాయుటకు హేతువేమై యుండునో వీనికి సమన్వయ మెట్లో తెలియకున్నది.

ఈవిషయమున నామనంబునకు రెండువిధముల సమాధానములు తోఁచుచున్నవి. మొదటిది-గణపతిదేవుని కూఁతురు ముమ్మడమ్మకుఁగూడ రుద్రాంబయను నామాంతరము గలదు. గణపతిదేవుఁ డీమెను పుత్త్రినిగాఁ బ్రకటించి తన యవసానసమయమున నామెకు రాజ్య మిచ్చెను. ఆమె యనంతరము రాజ్యార్హుఁడగు తనకుమారునకు రాజ్య మిచ్చెను. గణపతిదేవుని యనంతరము అతనిదేవి రుద్రాంబ కొంతకాలము రాజ్య మేలి పిదపఁగూఁతునకును మనుమనికిని వరుసగా రాజ్యమిచ్చెను అనునది. అయినచోఁ బ్రతాపరుద్రునిఁ బట్టాభిషిక్తునిఁ గావించినవారు మాతామహియా లేక జననియా యని శంక వచ్చును. 8-వ వాక్యమున దౌహిత్రునకు రాజ్య మొసఁగినట్లు కలదు. ఈ దౌహిత్రపదమునకు రుద్రాంబ దౌహిత్రుఁ డనికాని గణపతిదేవుని దౌహిత్రుఁ డనికాని యర్థము చెప్పవచ్చును. అట్లే కానున్న నీ సందర్భమునఁ బలుమాఱులు రుద్రాంబ కాకతీయకులమున జన్మించినట్లు స్పష్టముగఁ జెప్పఁబడినది. కాకతికులమున జన్మించిన రుద్రాంబయే దౌహిత్రుని పుత్త్రినిగాఁ దీసికొనెనని యున్న పక్షమున దౌహిత్రుఁడైన నా రుద్రాంబకే ప్రతాపుఁడు దౌహిత్రుఁడు కాఁజాలఁడు కదా? పోనీ, గణపతిదేవుని పుత్త్రియగు రుద్రాంబకే ప్రతాపరుద్రుఁడు దౌహిత్రుఁడందమా? 8-వ వాక్య మిందుకుఁ బ్రబలవిరుద్ధముగా నున్నది. కావున మొదటి రుద్రాంబకు దౌహిత్రుఁడు దత్తపుత్త్రుఁడు నగు ప్రతాపుని కాతని గన్నతల్లి ముమ్మక్క యను రుద్రాంబ రాజ్య మర్పించె ననుట యుక్తము. ఇది కొంచెము క్లిష్టమార్గమున నున్నను వాస్తవమునకు సమీపమున నున్నదేమో యని నా యూహ. కాని యీపక్షమున రుద్రమదేవి యనంతర మామెకూఁతురు రుద్రాంబ రాజ్య మేలిన ట్లూహింపవలసినదే కాని ప్రబలాధారము లేవియును లేవు.

రెండవ సమాధాన మెట్లన; గణపతిదేవుని భార్యయగు రుద్రాంబ తండ్రిపేరు గణపతిరాజనియుఁ దల్లిపేరు ఉమ (ముమ్మక్క) యనియు నూహింపవలయును. 6-వ వాక్యము దీనికిఁ బ్రమాణము. కావుననే యామె తనకూఁతునకుఁ దనతల్లి పేరు పెట్టియుండవచ్చును. గణపతి యనఁగా సామాన్యముగా లోకులు వ్యవహరించు విఘ్నేశ్వరుఁడు కాక ప్రమథగణములకుఁ బతియగు శివుఁడని యర్థ మీసందర్భమునఁ దెలియఁదగును. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత యీయర్థమునే పేర్కొనెను. కాకతీయులు పరమశివభక్తులు. కావున వారు శివుఁడనునర్థముననే యీ యర్థము నుపయోగించిరి. రుద్రమదేవి జనకుఁడగు గణపతిమహారాజు తనకు పుత్త్రసంతానము లేమి నీమెనే పుత్త్రుఁడుగా వ్యవహరించెను. దాని కనుగుణముగా నామె రాజ్యపాలన మొనరించినట్లు 7-వ వాక్యమునఁ దెలుపఁబడినది. రుద్రమదేవికూఁతురు ముమ్మక్కకు రుద్రాంబ యను నామ మున్న ట్లూహింపవచ్చును. 6-వ ప్రమాణమునఁగల యుమాసోమానామములు రెండును రుద్రమదేవి తల్లికిఁ గలవని తెలియునుగదా? ఆమె తన కూఁతునకు నా రెండునామములు వ్యవహరించెను. గణపతి యన శివుఁడను నర్థమున్నట్లే సోమశబ్దమునకు రుద్రయను నర్థము స్వీకరింపఁబడినది. కావుననే ప్రతాపరుద్రునకుఁ దండ్రి మహాదేవుఁ డనియుఁ దల్లి రుద్రాంబ యనియు మాతృకపితరులు కూడ రుద్రాంబాగణపతిదేవులనియుఁ దెలియనగును. అయిన నీపక్షమున కాకతిగణపతిదేవుని మామయగు నొకగణపతిరాజు మన కూహాపాత్రుఁ డగుచున్నాఁడు. అం దెంత వాస్తవమో నిర్ణయింప నాధారములుమాత్రము దృశ్యములే. మొత్తముమీఁదఁ బ్రతాపరుద్రుని తల్లివంశమువారును, తండ్రివంశమువారు నొక్క మూలపురుషునుండి విడివడిన స్త్రీపురుషశాఖలలోనివారనియు, వారు మేనరికములు పెదుకు మేనరికములు గావించుచుఁ దమలోఁ దామే రెండువంశములవారే సంబంధబాంధవములు చేయుచుండెడివారనియు, దానివలననే యీరెండుతెగలవారి నామము లన్యోన్యసాదృశ్యము గలవిగా నున్నవనియుఁ దెలియనగును.

పాఠకమహాశయులారా! ఒక్క ప్రతాపరుద్రీయమును బట్టిచూచిన నీ యిన్ని వికల్పములచే నీచరిత్ర మెఱుంగుట దుష్కరముగా నున్నదికదా? ఇంకను శిలాతామ్రశాసనాది ప్రమాణము లన్నింటినిఁ జూచిన నెన్ని చిక్కులు సంభవించునో? సుప్రసిద్ధవిమర్శకులు బాగుగ నీవిషయమున శోధించి, వాస్తవచరిత్రము ప్రకటించి లోకమున కుపకరింతురుగాక. ఈకాకతీయ వంశమువారగు క్షత్రియు లిపు డాంధ్రదేశమున మంచపాటివారను నింటిపేరు గలవారుగా నున్నారు.

---

# శాంతిపాఠము

కవితావినోద, అల్లంశెట్టి అప్పయ్యగారు

ఒనుదినంబును తనభర్త చనువునెరప
కన్నివిధముల బాధించి యడరు వెట్టఁ
దాళఁజాలమి నాపె సంతాపమంది
వృద్ధసతి నొక్క తెంగని యిట్టులనియె.

అవ్వ! నానాథుఁ డాగ్రహాయత్తుఁ డగుచు
నిర్నిమిత్తంబ నామీఁద నేఁడు రేపు
లేనినిందల నొడగట్టి పూసపూని
గొడ్డునుంబోలె నిరతంబుఁ గొట్టుచుండు.

ఇంటిలో నిట్టిపోరాట మెందు కనుము
బుజ్జగించినజనముల బుద్ధిదిట్టు
నేగడియ కేమొనర్చునో యెఱుకపడమి
గుండియల్ బిగ్గబట్టుమఁ గుందుచుందు.

అన్న మిముడమనోటఁ గృశాంగి నైతి
నామయంబెచ్చె నొడలిగాయముల కతన
నింక నేనెట్లు సహియించి యింటనుందు
నకట! నిర్భాగ్యనగు నను నరయు మమ్మ!

ఎన్నినాళ్లోర్చిమనియుండు నిట్టిపోరు?
ప్రియుఁడు నాపయి నెనరుంచి పిలుచునట్టు
లెట్టిఁగెదేని యుపాయ మూహింపు మనిన
హర్ష పులకితగాత్రయై యవ్వ యనియె.

తఱచు నాదరి కీరీతిఁ దగవులాడి
వచ్చువారల కొక మందు నిచ్చుచుందు
నిదిగొ కొమ్మని యుస్సు నీ రింటిదెచ్చి
పాత్ర మందిడి మెల్లనఁ బల్కె నిట్లు.

ఆగ్రహావిష్టుఁడై యున్నయట్టినీదు
భర్తపై దీనిఁజల్లి నిర్భయత నోరు
మెదప కొకవోట నుండుము మెలఁత! దీన
నీకు మేలగు ననిన నంగీకరించి.

ముదుసలి వచించురీతి నమ్ముదిత జేయఁ
గలహమడుగంట సౌఖ్యంబుఁ గలిగి; మరల
నొపథంబునకై వచ్చి యడుగుచుండ
వెలఁదిభావంబుఁ గనుఁగొని వృద్ధయనియె.

సిన్ను నీభర్త కోపించు చున్నవేళ
మారు మాటాడకునికి జూ మగువమీఁకుఁ
గలహ మంతరింపఁగఁ దగు కారణమ్ము
గాని; యాపథమహిమంబు కాదు కాదు.

శాంతతవహించి నీవు నిశ్చలత నుండ
చిట్టుబుట్టుల నాదునే వెట్టిదాన?
ఆరెంబోత్రుటిలో నదే యణఁగిపోవు
మాటకున్ మాట జగడాల మూట గాదె!

సత్త్వగుణము ప్రధానమ్ము చర్చ సేయు
మదిపొసంగఁ దమంతఁ దా మణఁగునెట్టి
కలుషచిత్తుని కోపాగ్ని కణములైన
సత్త్వమున కీడు జోడును జగతిఁగలదె?

కష్టమేని సుఖంబేని కలుగవచ్చు
శాంతులు పరీక్షఁ బొందెదు సమయమందుఁ
జివరకుఁ బ్రశాంతహృదయులు సిద్ధిఁగాంతు
రిది గ్రహింపుమనుచు నాపె నింటి కంచె.

---

## చిత్రకారుడు—విమర్శకులు




(ఒక ఆంగ్ల చిత్రము ననుసరించి)

# ఊహాగానము

శ్రీ కాళహస్తీశ్వరరావు ఓలేటి సీతారామమూర్తిగార్లు

> "ఏను తెచ్చిన మృదుసూక్తిలోని జాతి
> ముత్యములను లోకముముందుఁ బోయుచుంటి
> హృద్యమై యొప్పువానిని నేరికొనుఁడు
> అభిరుచి కొలంది—"
>
> —రాయప్రోలు సుబ్బారావు.

"రుచిరకితమైన హృదయసరోజగర్భమందు కందళించిన" భావ మందమొంది నవ్యవాసనాపలసితమై అభినవపుష్పసురభితమై వెలువడినది అబ్బూరి రామకృష్ణరాయని "ఊహాగానము". గ్రంథకర్త వచించినట్లు "ఈగ్రంథస్థకవిత్వ మంతయుఁ బ్రత్యేకశైలీవిధానమునఁ" జేరియున్నది. "ఈయల్పసంఖ్య ఇటువంటి పద్యముల సంపూర్ణసార్థకతను నిరూపింపఁజాలవని కవి భయపడినను అవి మొగ్గ పువలె దాని సార్థకతను బ్రదర్శింప మొనర్పఁజాలును.

ఆంధ్రకోమలిముందఁ దాను పాడవలసిన యార్ద్రహైందవగీతులఁగూర్చి కవియే

> "ఆలింపు పాడెద నాంధ్రకోమలి!
> యార్ద్రహైందవ గీతులన్
> బాలింతు నెల్లెడ భావపుష్పిత
> నవ్యశయ్యా రీతులన్."

అని యున్మత్తకంఠముతో, నుచ్చరించినాఁడు. ఈవాగ్దానమును గ్రంథమునందు సంపూర్ణముగా కవి తీర్చుకొనినాఁడు. కూర్పులో సున్నితము, చాతుర్యము, అభినవభావవిలసనము, అపూర్వసంఘటనము ఇమిడి యున్నవి.

పరిసరప్రకృతిచే నావేశితుఁడై కవి తానుచ్చరింపవలసిన గీతములఁ గూర్చి

> "లతాంతార్ద్రగాఢముగ్గంధ మోదు మేలుల్
> పరంతమ్ము కాంతిప్రవాహమ్ములంగున్
> నిసర్గస్ఫురత్ప్రాణినితిన్ బ్రియమ్ముల్
> కనుగ్గెట్టు చందాల గావించు పూపుల్
> కనుంగొన్నచో వేడికన్నీళ్లు రాలున్
> అలంకారముల్ లేని యనాఘ్రాణసుగ్గ-
> క్తులన్ లీనమై పోయెదనో సాధుగీతీ!"

అని తనకుఁదానే పల్కుకొనుచున్నాఁడు.

ప్రకృతిని స్మృతపని యనేకదృష్టులతో నీతఁడు చూడఁగలిగి

"నిన్ను ప్రశ్నింపఁగాఁ జాల, నీనాఁటి ప్రోగ్రటిపురాఁట గంభీరమై ప్రవహించె నీగుసొంపైక్యంపుపాట.

> ఓ విశాలాంగనీ!
> శోభాతిశయనీ!"

అని నిశ్చరించోయి "ఆరంభపుణ్యక్షణము సీతఁడు సంచరినాఁటిసిందాదనోభగ్య మటులు వెల్గెనో" యని పాడుకొనుచున్నాఁడు. అప్పుడే భోగాదుల విసర్జించుటకు త్యాగశక్తిమైన కవి హృదయము ఉచ్చైస్స్వరమున నిట్లు పేడుకొనుచున్నాఁడు:—

> "బంగారు తోరమ్ములన్
> నాణ్య హారమ్ములన్
> పైకొని నాకిమ్ము జననీ! నీపృథ్వీకాంతాకృతము
> శాంతముగోత్రి వికసించు పచ్చప్రాంగణము
> హే నవమోహినీ!
> హే దయావాహినీ!"

ప్రకృతిప్రశంసనుగూర్చి యీతఁడు రచించిన దిది యొక్కటే.

నిత్యనూతనత్వము, శాశ్వతత్వమును బహువిధరూపితమును అగు ప్రణయమును గూర్చి యీతని కవితావిహంచినుండి యమృతమయగీతములు ఆలపింపఁబడినవి. ప్రేమశాంతి-భంగమునకు వెరచిన యొకభావము

"నీవుపాడిన కృష్ణవేణీ స్తవమ్ము
హృదయపదమున నొక కెలయేఱు వోలె
నల్లనల ఘంఘురులు వెలఁజల్లుచేళ
పలుకరాని గీతిక కంకల మునర్చు—
ప్రణయుణి! ప్రేమశాంతి భంగమునకో?"

అని కవిచేఁ బల్కించినది. "జానకీ యొనర్చు సాంగత్యసౌఖ్యమునకుఁ దలపు లేకాగ్రతావ్యాప్తి" కలియు రాముఁడు సీతనుండి యెడఁబడి వియోగక్షీణ్నుఁడై పాడిన గీతములు పౌరాణికపావిత్ర్యప్రేమమును సరిగా నగపర్చినవి. ఇది యుదాహరణీయమాత్రము—

"లక్ష్మణా! గూఁడ వేలకిలిలు వ్రాసె
నాసనల నింపుకొను మాఘళీసుమములు
సీతకన్నులనోలె విచ్చె నొకకొంతి
వేసనలు వచ్చె నామనోవీథయందు."

నాగరికచిహ్నములచే ననేకవిధముల రంగుల మార్చుకొను నూసరవల్లివలె ప్రేమముగల పౌరజన బాహ్యాస్నేహముగాక సహజమార్దవము కలిగి ప్రకృతిసిద్ధపవిత్రత గల్గి వెలయు పల్లెవలుపుపదాలు కాపుపాటయను శీర్షిక క్రింద ముద్దుగాలికించినవి. అందలి భావసౌందర్యము ప్రేమోపాసకుల విశుద్ధహృదయమగుటకు నవ్యవర్ణముఁ గల్పింపఁగలదు.

"పాడుట కొప్పవేని పడి
　వల్లడింపంచెదు యేటిస్రోవలే
మాఁడగవద్దు, లేతమన
　సుల్ తడిసేసెడు చెల్లచాటునన్
గూడిన మేనులాను కొన
　కొమ్మల కాకులవోలె నొక్కటూ
టాడకఁగూరుచుండ మను
　వైన పొలమ్ముల గట్టునీడలన్."

అనిన కాపువానిలో నభేదరాగము సూచికము. అనాగరికుఁడైన కాపువాని వాక్యములలో ప్రణయనాగరికత సంపూర్ణత్వము వహించుచున్నది. "వెరచింతసలఁ మరపించు రాగము ల్దియుచు వాసనల్ పరిమళించెడు చోటులయందు" ప్రియురాలితోఁ బోవఁగ వానికి మనసయ్యెను. అంతిగాక వేడుకకొరకు

"గ్రాలినసంజల స్మరలిచ్చెడు గోవులఁ బాలుతీయఁగాఁ బోలెదుదాక, త్రాడులను దుత్తలు నాపలఁబెట్టి సిగ్గులన్ సోలెదు చిన్నదాన! యెటుచూచిన నెవ్వరు లేని కోటను యాత్రాలల నెక్కి యూఁగ మనసయ్యెను నీవును నేను—"

అని ఏకాంతప్రేమను అభిలషించు కాపుబిడ్డ వాక్యములు అతని యనురాగశీలమును వెలువరింపుచున్నవి.

అప్రాప్తప్రేమకై విలపించు కవివాక్యములు కేవలైహికవాంఛాపరిపూర్ణములు గాక స్వర్గీయమును పవిత్రవంతమును అగు కోరికను దెలుపుచున్నవి. అప్పుడీతఁడు ఒక యపూర్వమగు వలపుఁబాటతో లీనమైనాఁడు.

"చీఁకటిదారులందు విక
సించిన వెన్నెలవోలె, తీవ్రవా
ధాతువులైనవాగులు సు
ధాసరసిన్ గొనుస్నాన మట్లు శ్యా
మాకృతిఁ దాల్చి నాదుహృద
యమ్మున నిల్చిన దివ్యరాజ్ఞి! నా
కై కరుణించి నీ తెనుఁగు
గానము నింపుము నామనమ్మునన్."

ఆ 'యాలరింపునెచ్చెలి'ని ప్రేమతోఁ దారిఁ జూపఁగ వరించిన కవి కోరిక తీరని కోనల ప్రణయముకొరకుఁ గొంత వాపోయును.

"నైజరుచిరమ్ములగు ప్రసంతీజలమ్ము
లారిపోయిన రాతిబయళ్లవోలె
రిత్తయయిపోఁ దలంపుల మాత్రదినము
గిల్లుకొనిపోయి యేమి దాఁగికొనె దపుడు?"

ఆంగ్ల మహాకవి వచించిన

'Thy dewly looks sink in my breast,
Thy gentle words stir poison there.'

అను వాక్యములు కూడ పైగీతము నెంచుచున్నవి. అనురాగము ఎందరి కవులనో యున్మత్తావేశితులఁ జేసినది. ఆ యావేశములో ననుభవైకవేద్యము లగు నపురూపపు సంగతులు నర్థవంతములైన యాబద్ధప్రణయసూత్రము లల్లఁజాలును. సమకాలికు లగు కవుల యందు నింతకన్న మించి వ్రాయఁగలవారు చాల నరుదు.

యౌవనవీథులందు "పడవలను గట్టికి చీఁకటి నడుమఁ జేయఁ గీర్తిదేహుల ప్రణయ సంకీర్తనములఁ బుస్తకంపుఁ జైతన్యసంపుటము లెల్ల విప్పి" పఠించు కవిహృదయమునందుఁ గవులకొరకు వందనమాల కూర్పఁబడినది. మహాకవి తిక్కన యుద్ధోపరచనమునందు నీతనికిఁ గాంతిపుంజము గన్పించినది. హైందవ-కోకిల సరోజినీదేవి పాటలయందు నీతనికి నమృతమాధుర్యము పొడసూపినది. అరవిందుని అనాసక్తయోగపదములయందు నీతనికి యోగధోరణి పన్పించినది. వారలం దరకు నమోవాక మర్పించిన కవి ధన్యుఁడు. "లోల మృణ్మయకాయశోభాద్భుతమాధురియు, నవపుష్పరాగ సుందరపత్రికతయు, కృష్ణవేణా తరంగిత మున్న ధ్ఘరియు, తుంగభద్రానదీస్తన సోగ హేలయు" కల్గిన తిక్కన తెలుఁగుఁబల్కులకు వినయోచి తవందన మందికొమ్మని తిక్కనవలె "స్పృశించు నుదాత్తమనమ్ము లేమిచేఁ" "గవకులపుత్రులతో యిల గానము సేతునో" యనుచున్నాఁడు.

"నీకవితాప్రపంచమున
నిల్చి చరిత్ర వ్రతిరించ, విస్మయా
వ్యాకులలీల నా మనస్స
భావమనోజ్ఞసస్యసంపదం
జేకొని వెల్గు పర్వతపు
సీమలు నిల్చినయట్లు తోఁచు, నీ
నీకలనాదముల్ గడుఁ ర
మ్యమ్మధురంబుగ సంచలింపఁగన్."

అని యాంధ్రబాలకు కళాజగతీస్థలి దారిఁ జూపఁ వేఁడుచున్నాఁడు.

"ఎలుఁగెత్తి రాక మాటికి స్ఫు
రించి తెనూలత నాఁడు భావబం
ధురవాఁగు శక్తికిన్ వరదు
లోఁపఁగఁ జక్కని గాయకాళిపై
తరుణుల నూతనంపుఁ
గవితాహృదయంబుల దివ్యగీతముల్

పాతువుచు; దారిఁజూపుచు క
ళా జగతీస్థలి నాంధ్రబాలకున్."

ఇఁక సరోజినీదేవీప్రశంస. ఆమెగానకళలములు 'తొలిపొద్దు పేకలు', 'పులుగుల కేకలు', 'తెలుసూపు మోకలు', 'కసులేని బంగారు గనులు'—మరియు 'జ్ఞానాన్నము నేలు నానందపుఁ బదాలు', 'చినుల చుక్కాలు', 'శాంతమనస్సీతలములు.' సరోజినీస్నిగ్ధగీతములకుఁ జేజులు 'దారి తెన్ను దోటఁ జేరిన సోగ చేటఁ బోలు పెల్లని పాటఁ జిరంతిమ్యావిదనాలు" అని ముచ్చటగా నుచ్చరించినాఁడు కవి.

ఇఁక అరవిందుని. అరవిందుఁడు ఆంగ్లమునందు పలువిధములగు భావకావ్యముల రచించినాఁడు. అతని ధోరణులు 'గుమ్మడిపండు తేనియలకున్ సరిపోవును'. 'ఘాఢ చందమ్మున విచ్చు జన్మమరణాక్షుభితాధికజీవితావధులు 'Love and Death' అను నొక మనోహరకావ్యమున విన్పించినాఁడు. "కొండల దండశోభ కనుఁగొని లువఁబడ్డ శ్రావణాంబువుల్ నిండఁగఁ బొంగి బిట్టుఱుచు నిర్ఝరిణి శ్రేయదూర్మి కింకిణీ తాండవములు". ఈతనికవితయందు విన్పించు కావున నే 'భవద్గభీరకవనమ్ముది నేఁడును గ్రొత్త' అని రామకృష్ణరావు పల్కినాఁడు. కవితాకోమలికి చరణచామరములు వీచిన యీకవులు మనకవిహృదయమున భాషాధులలో శాశ్వతత్వముఁ జెందరి.

కవిహృదయము మధురమై, సున్నితమై, మృదులమై యుండును. అతని యూహావీథికి తగలని చరిత్రము కాని, యతనిభావమున కందని పూర్వసౌభాగ్యము కాని యుండదు. విజయప్రబోధనవిద్యాసుతుల వాసముల సంబరము నుండి కవిలోకమునకు కనఁబడును. విజయదుందుభుల మ్రోయించును. అయినను విశ్వకల్యాణ మందె దావిష్కృతము. పురావిభవముల పొలిమేరలో స్వచ్ఛందప్రయాణమొనర్చిన మనకవి ఉజ్జ్వలయువతీసంభాషణమూలమున దేశకల్యాణమునకుఁ బసుపుపగ్గులు దేరు తోరణముల గట్టినాఁడు.

"చేసిన రాజకృత్యములు
సింధునదీతటములందు నెన్నఁడో
మాసియు నేఁటికిన్ స్మరణ
మాత్రపు సంగరలక్ష్మి కంపెలన్
దోసిలు లొగ్గఁగాఁ గయి కోల
దుల్లల; నావిజయప్రబోధవి
ద్యాసుతు లున్నవాసములు
నల్లవిగో! హిమవంతుచేరువన్"

'వీరప్రసూకంకణము'లని పేరువడసిన 'భారతపుత్రికులే హిందూరమ తలఁదాల్పఁదగు మణులు' అని కవి గ్రహించినాఁడు. అందాంధ్రభూమి రామకృష్ణరాయుని చైతన్యతంత్రిని మీటఁజాలినది.

"అల్లదె! యాంధ్రభూమి! సమా
రావములన్ జయశంఖ మెత్తు రా
ట్పల్లవులందుఁ గల్గిన స్వ
తంత్రులు వోయెడు నేల; శేముషీ
పల్లవితమ్ముతో సరళభావము
లం దొక క్రొత్తకీర్తిగా
నల్లిన సీమ భారత మ
హోజ్జ్వలమండలి జీవగీతులన్."

# ప్రాచ్య నాట్యకళోజ్జీవనము

(సి. యస్. వాసుదేవన్‌గారి నాట్యచిత్రములు)



చిత్రము ౧


లోధ్ర

హైందవసౌభాగ్యాన్నత్యంబుల నెన్ను కొని 'స్వేచ్ఛాపురంధ్రీమతల్లి' యగు భారతాంబ పవిత్రశక్తికి కవిహృదయము నీరాజన మొసంగినది. 'జన్మభూమికిన్ సేవకు'లైన వారు ప్రబోధసరళమ్ముగ పాడిరి. వారికి దేశీయుల నమస్కృతులు.

బాల్యస్మృతియను కావ్యములో విషాద రేఖలు రేకెత్తుచున్నవి. కవి వయోవిరహ భారశ్రాంతి ప్రోయుచున్నాఁడు. 'చేయికి చేఁ దగిల్చికొని చిత్తమునం దొకవంత లేక యీతమా యెడలందు' తనతో విహరించిన స్నేహితుని గూర్చి కవి జ్ఞప్తసీమల కెగురుచున్నాఁడు. అప్పుడే 'నీవులేక నేనేమియొ ద్రాక్షపందిళుల నెక్కివరింతు దురాశ రాగముల్'అని దుఃఖసాగరకుహరముల కుములుటకూడ కల్గినది.

కావేరియను శీర్షికయందు దగస్త్యకుమారుని వియోగరాగము రామకృష్ణరావు కవిత్వ కౌశల్యమును జూపుచున్నది. మఱియు మంజులభావసమన్వితమై యొప్పుచున్నది. 'నా మెద కానందము గూర్చు లక్ష్మి విడిపోయె న్నేఁటికిఁ నాఁటికిఁ' అని యగస్త్యకుమారుఁడు నిట్టూర్చుచు

"త్రోపుడు వెట్టిపాఱెడు ఝరుల్ పులకింపఁగఁ బాడ చంద్రికా
స్నాపితరాత్రులందు తరుణమ్మగు నీమృదుపాణి నాచెయిన్
దోపికొనంగ మేమెయి నొదుంగుచు, నా యనురాగమూర్తి మ
దీపిక వోలె నెన్నఁడరు
దెంచెదవో! ననుఁ గూడి తోడుగన్."

'నూత్నకర్ణాటపుణ్యభూమి' నావరించిన విద్యాశుభాంకురములఁ గూర్చి పొగడుచు విద్యార్థిబృందమును కవి యిట్లు హెచ్చరించుచున్నాఁడు—

"పూవులు పుష్పించుపోలిక, జగుపులు
విప్పిచూపెడు మురిపెములు గలిగి
అలతిత్రోవలలోన నడఁగిన యప్పటి
సౌందర్యరుచుల వికాసములు గలిగి
అలజడి నొందు ప్రాణుల కష్టగతులకుఁ
దాపోపశమనవృత్తములు గలిగి
లోకపరిణామగీతు లల్లుకొనియున్న
భారతీసుందరకుటీరపరిసరముల
ప్రొద్దుపుచ్చుటకన్న నేపుణ్యకృతులు
వేఱుకలిగెడు విద్యాకుమారకులకు?"

కవిహృదయము పారములేనిదై యుండును. ఆకసముకన్న దాని వైశాల్య మత్యధికము. కావుననే యది సంపూర్ణలిఖితము కాఁజాలదు. తాను పల్కుచున్న వాక్యములతో కవి యవినాభావసిద్ధిఁ జెందివచ్చుటచే నా యూహట్లు పాఠకులముందుచిత్రితములై పోవును; భావఫలకము న్యాక్రమించును; నొఱయును; లేదా ఊహ కందును. అప్పుడే కవి మానవ సమాజప్రకృతినుండి దాఁటి స్వర్గీయసీమలకుఁ బాఠకులసైతము తోడ్కొని పోవును.

రామకృష్ణరాయఁడు రచించిన పద్యములన్నియు సంపూర్ణభావవిలసితములు, సరళచైతన్యవృత్తములు. వానిలో జీవశక్తి ప్రతిఫలితము. పల్లెవాని పదుచుందనపు వలపుపాటలు,

మహర్షి యగస్త్యుని వియోగగీతియుఁ గవి చిత్రకారుఁడై సరియగు రంగు లద్ది ప్రసారితము చేసినాఁడు. అకలుషమును, అమ్లానమును అగు పవిత్రప్రేమ సృష్టింపఁజాలినాఁడు.

రాయప్రోలు సుబ్బరాయని శిల్పచాతుర్యము మనకవి కవితయందు జోడువడుచున్నది. శైలి యంతకు మించి పోవుచున్నది. కాని యీతని రచనము చాల మందముగాఁ గాన్పించుచున్నది. ఈతఁడు రచించినది మల్లికాంబయను చిన్న కావ్యసంపుటి యొకటికూడ నున్నది.

“ఊహాగానము”, “పూర్వప్రేమ” కలిపి యొకపుస్తకముగాఁ బ్రచురితమైనది. “పూర్వప్రేమ”ను మున్ముందు విమర్శింతుము.

అపారమైన కవిహృదయమును జూపించుటకు విమర్శనము ఆదర్శమాత్రము. ‘పుస్తకసాంగత్యము’లో కవి వచించిన పల్కులతోడనే ప్రకృతవ్యాసమునకు ముగింపు.

“శిఖరశిఖరమునుండి వచ్చెదు వినూత
నోదయం బొద్దిమయ్యె జ్ఞానోదయమున
తారకలకన్న కడు నశ్రుతంపు నుసుల
మంచిచదువులు సమ్మార్గరించు నిపుడు”

---

## శిలాదృశ్యము

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

బలిమిని సహించి వర్షాతపముల శైల
శిఖరమునఁ గూరుచుండి నిశ్శిథిలమైన
మానముద్రనుగొని తపోమగ్నుఁడైన
గండశిల పేరి శమివతంసుండు పోలుచు

తరుల కొమ్మలు దన్నంతఁ దారసిల్లి
యాకుఁబైట చెఱంగులఁ దాఁకుచున్నఁ
పతగరవముల గీతముల్ పాడుచున్న
స్వల్పమేనిఁ జలింపఁ డాశమధనుండు.

గడ్డకట్టిన జ్ఞానంపుఁ గలిమియొక్కొ!
పండిపోయిన మూఢంపుభక్తియొక్కొ!
ఒడలెఱుంగని యీవేళ మొక్కొ? నాఁగఁ
బెలుచనెల్లప్డు డాశమిపుంగవుండు.

తన్మహత్త్వతద్యోగసాధనలు వడయఁ
దదుపదేశంబుఁ గాంచి నిత్యమువసించు
డాసి ప్రాయోపవేశంబుఁ జేసి చావ
చుట్టలుగఁబడి పెక్కురాల్ చుట్టుపట్ల.

ఆతఁ డెన్నండు యోగసమాధినుండి
మేలుకాంచునో? యని నిర్నిమేషదృష్టిఁ
బ్రేక్షకుల్ తదనుగ్రహాపేక్షఁ బోలెఁ
గాంచుచుందురు కౌతుకోత్కంఠులగుచు.

# వేంకటశబ్ద విచారము

వంగోలు వెంకటరంగయ్యగారు B.A., B.L.

1927 వ సంవత్సరం జూలై నెల "భారతి"యందు "సుబ్బ"శబ్దమునుగూర్చి కొలదిగ ప్రసంగము జరుపబడి యుండెను. "వేంకటు"నికి కాలాంతరాపేక్ష సమర్పింపబడిరి. సుబ్బని కేవివరమయిన నోదుగును. వెంకటుడు గడుసువాడుగ నున్నాడు. ప్రాతిపదికమే కుదుటబడుట కష్టముగ నున్నది. వాడుకలో వేంకట, వేంగడ, వేంగళ, వెంకట, వెంగడ, వెంగళ, వెంక, వెంగ రూపము లగపడుచున్నవి. అంక, యెంక, అంకి, యెంకి, అంకాలు లోనగునవిగూడ ఈశీర్షిక క్రింద జేరునటులున్నవి.

వేంకటశబ్దము తత్సమమా, తద్భవమా, దేశ్యమా? వేంకటాచలమాహాత్మ్యప్రశంసగల బ్రహ్మాండవారాహాది పురాణములందు "వేంకట"శబ్దప్రయోగము గలదు. కాలామృతకారుని మంగళశ్లోకమున నీశబ్దమున్నది. సంస్కృత గ్రంథములనున్న మాత్రమున నిది సంస్కృతశబ్దమని సాధింపవలనుగాదు. అన్యదేశీయము లనేకములు సంస్కృతమున గలవు. జ్యోతిషమునందలి కేంద్రద్రేక్కాణాదులును, కావ్యనాటకాదులందు చీనాదిదేశనామములును గలవు. వీని కాభాషయందు నిష్పత్తి జూపబడలేదు. ఆధునికకవిపండితులు ఆంగ్ల-జార్జిలోనగు పదములజేర్చి శ్లోకముల రచించుచున్నారు. అంతమాత్రమున నివి సంస్కృతశబ్దము లని సాధింపనగునా?

"కట"ధాతువు వేదముల నుండునుగాని "వేంకట" యను నక్షరసముచ్చయము వేదభాషయం దున్నటుల గానరాదు. ఏకాక్షరప్రాయమయిన "వేం" అయినను కలదా? లేదనియె తెలియుచున్నది. మంత్రబీజములలో "వేం" యున్నదని కొందరు చెప్పెదరు. ఇందు కాకరము మృగ్యముగ నున్నది.

"సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే। సర్వపాపదహో యస్మాద్ వేంకటాచల ఇత్యభూత్" అను నీశ్లోకము బ్రహ్మాండపురాణాంతర్గతవేంకటాచల మాహాత్మ్యమున గలదు. దీనివలన "వేం" = సర్వపాపములు" అని అర్థమగుచున్నది.

వారాహపురాణాంతర్గతవేంకటాచలమాహాత్మ్యమున:—

వేంకారోఽమృతబీజశ్చ కట మైశ్వర్య ముచ్యతే
అమృతైశ్వర్యసంఘత్వాత్ వేంకటాద్రిరితి స్మృతః.

ఈరెండుపురాణప్రమాణములును విరుద్ధార్థద్యోతకములుగ నున్నవి. సర్వపాపపర్యాయ మొకచోట, అమృతైశ్వర్యము లింకొకచోట చెప్పబడియున్నవి. ఇట్టి నిష్పత్తుల ప్రామాణ్య మెంతవరకు గ్రాహ్యమగునో విచారింపవలసియున్నది. శబ్దముల కనేకార్థము లుండుట ప్రసిద్ధముగ నున్నది. కాబట్టి "వేం" శబ్దమునకు పై రెండు పురాణములలోని యర్థము లుండవచ్చు ననువాదము చేయదగును. ఈశబ్దమున కితరత్ర ప్రయోగము లగపడుట లేదు.

వైజయంతి అను సంస్కృతనిఘంటువునందు "వేంకట" శబ్ద మున్నది. దాని పర్యాయపదము లిటులున్నవి—"వేంకటో వృషభ స్సింహః కేసరః కేశవప్రియః". ఉదాహృతపురాణప్రయోగముల కిందు ఆధారమగపడలేదు.

"కట" ధాతువు సంకట, వికట, ప్రకట, ఉత్కట, నికట ఇత్యాదులం దగపడుచున్నది. "వేంకట"ను గూడ నీగణమున జేర్పవలయునా? "కట" వలన కష్టము లేదు; "వేం" కటకట లాడించుచున్నది.

"వేం" అనునది యొకటి యున్నదని గ్రహింతము. ఇది "స్వః"వలె నవ్యయమా లేక సుబంతపదమా? పదమగునెడల ప్రథమైకవచనము "వేం" అనుకొనినయెడల ద్విబహువచనరూపములు, ద్వితీయాదివిభక్తిరూపములం నెటులుండునో? "వేం—వేంనౌ—వేంనాని, శేషం జ్ఞాన

శబ్దవత్" అందురా? "వేం" అవ్యయము కానియెడల నపుంసకముగ నుంచవలెనుగదా?

నానార్థరత్నమాలాకారుడు ఏకాక్షరకాండలో అచ్చు "ఏ" అచ్చు "ఐ"ఇత్యాదిశబ్దముల జెప్పినాడుగాని "వే"నుగాని "వేం"నుగాని చెప్పలేదు.

"వే" పాపము లేక అజ్ఞానమును ద = తెగగొట్టునది. అని "వేద" శబ్దమునకొక వ్యుత్పత్తి చెప్పుట గలదు. విచారప్రసక్తమయినది "వేం" గాని "వే" కాదు. ఛాందస మడ్డువడి "వేం" "వే" లకు భేదమును సాధించును కాబోలును.

స్మృత=స్మరింపబడిన, ఇః*=మన్మథుడుగలవాడు (శివుడు) అనువిగ్రహముతో "స్మృతేః" అను ఏకారాంత పుంలింగశబ్ద మొకటి సాధ్యమని తెలియుచున్నది. ఇటులనే "వేం" యేల యుండగూడ దను వాదము చేయవచ్చును. "స్మృతేః" వలె "వేం" నకును విగ్రహము కలదా లేక ఇటులని నిఘంటుమయినదా?

ఈ సంస్కృతపు చిక్కు లిటులుండగా మన తెలుగు వెనుకబడునది గాదు. పెరుమాళ్లు "వేం" చేయుచున్నా రనగానే పెరుమాళ్లు "వేం" అను కార్యమును జేయుచున్నారని యూహయా? తెలుగునేట కనుక "విజయం" చేయుచున్నా రనుటకు సంక్షేపరూపముగ "వేంచేయుట" యేర్పడినదని సమర్పకము కుదిరినది. ఆర్యావర్తపు "విజయం" కొండల బండలపైనుండి దొరలినదనదీప్రవాహములబడి యెట్లెట్లో, తెలుగునాడు జేరి పరుల కలవిగాని పెరుమాళ్ల సన్నిధిం జేరినది.

వేంకటశబ్దములోని ప్రథమాక్షరము హ్రస్వమా? దీర్ఘమా? సంస్కృతవర్ణసమామ్నాయమున హ్రస్వ-ఎకార-ఒకారములు లేవు. రాణాయణీయశాఖాఛందోగులు ఎవ్వరో కొన్ని సామములను పఠించునపుడు ఎ, ఒ లను హ్రస్వస్వరములతో బలుకుదురట.

కాని యీయుచ్చారణమును మహాభాష్యకర్తృభిమతమును బొందినటుల లేదు. (మహాభాష్యప్రథమాధ్యాయప్రథమపాదద్వితీయాహ్నికము జూడుడు) సంస్కృతమున నిది 'వేంకట' యని దీర్ఘకారముగనే ప్రయోగింపబడునట్లు గ్రహింపవచ్చును.

'వేంగడ'శబ్దమనాదిగ యరవభాషలోనున్నది. శిలప్పదికారం[1], నన్నూల్[2]అను ప్రాచీనగ్రంథములలో యరవభాషవ్యాపించియుండు భూప్రదేశమునకు సీమనిర్ణయము జేయుచు 'వేంగడ'ము త్తరపుటెల్లగా జెప్పబడినది. అందీశబ్దము దీర్ఘ 'వే' కారముతోటియే ఛందోబద్ధమయియున్నది.

వాడుకలో మాత్రము తెనుగువారికిని యరవవారికిని కర్నాటకులకును హ్రస్వదీర్ఘములు వివక్షాధీనములుగ గన్పడుచున్నవి. పాండిత్యప్రసక్తివచ్చినపుడు 'వేం'క అని దీర్ఘమునుజూపుదురుగాని వాడుకలో వెంకయ్య, వెంకటరామయ్యర్, వెంకటరమణాచార్యులు అని హ్రస్వరూపములనె జూచుచున్నారము. వెంకట (వెంగడ) శబ్దము తత్సమముగాని యెడల దేశ్యముగనుండును. దేశ్యమగునెడల సవర్ణకమగు 'వేగి' శబ్దము బుద్ధిస్థమగుచున్నది. 'వేగి'యె వేంగి, వెంగియను రూపాంతరముల బొందుచున్నది. అరవవారి యక్షరసమామ్నాయమున 'కగ'లకు భిన్నసంజ్ఞలు లేకున్నను ఉచ్చారణలో 'వేంగడం'అనియె వారు పలుకుచున్నారు. శబ్దసిద్ధికి కడపటి ప్రమాణము లోకవ్యవహారమే కదా.[4]

---

*ఇకారః ఫణి రత్నార్చి ర్వ్యగ్రతో ర్దగువార్థయోః । హారేక కేశౌకత్వాస్తే నిశాకరకరే స్మరే."

— నానార్థరత్నమాల, ఏకాక్షరకాండము.

1. మేర్కుడల్ కీర్పుకడల్ వేంగడం కువరి ఆకియరెల్లయుల్ =తూర్పుసముద్రము - పడమట సముద్రము-దక్షిణమున కన్యాకుమారి-ఉత్తరమున వేంగడం.

2. కుణకడల్ కుమరికుడహం వేంగడం etc, etc. తూర్పుసముద్రము-కన్యాకుమారి-కొడగు-వేంగడము.

3. ప్రబంధరాజ వేంకటేశ్వరవిలాసము చూచునది.

4. సిద్ధిర్లోకాద్ధరశ్యా— నన్నయభట్టీయము.

వేఁగియనగనే ఆంధ్రలోకప్రసిద్ధమగు 'వేఁగినాడు' స్ఫురించుచున్నది. ఇందలి 'వేఁగి'కి పెద్దపులియని యొకయర్థమును, వేఁగినది=అగ్నితప్తమయినది, కాలినది' ఇత్యాది అగ్నిసంబంధమగునొక అర్థమును చెప్పబడుచున్నవి. అగ్నిసంబంధమువలననె వేఁగినాటికి 1 దగ్ధరాష్ట్రమను పేరు వచ్చినటు లున్నది. వేఁగినాడు దండకారణ్యభాగమగుటచే దానిమనుష్య నివేశనయోగ్యముజేయుటకై యడవియందుండిన పెద్దపులులు ధ్వంసముచేయబడియుండుటయూ,అడవులు తగులబెట్టబడి నేల నదరము చేయబడియుండుటయూ రెండును జరిగియేయుండవచ్చును. ఇందువలన వైయాఘ్రాగ్నేయాన్వయములు రెండును యొప్పదగినవి కాగలవు. మరియు షేక్స్పియరుజెప్పినటుల'What is there in a name'

"వాచారంభణం వికారో నామధేయంమృత్తికేత్యేవసత్యం"[2]. మలదకరూశదేశనామోత్పత్తినిగూర్చి

ఇమాజనపదౌస్ఫీతౌ ఖ్యాతిం లోకేగమిష్యతః,
మలదాశ్చకరూశాశ్చ మమాంగమలధారిణౌ.[3]

అని వాల్మీకి జెప్పియున్నాడు. ఈప్రాచేతసుడే వసిష్ఠవిశ్వామిత్రసంగ్రామవర్ణన ప్రసక్తముగ శకుల పుట్టుక "శకృద్దేశాత్"[4] అనియు జెప్పియున్నాడు. ఇట్టి పూర్వగాథ లనేకము లున్నవి. పూర్వగాథల వదలి ఆధునికముగజూచిన జార్జిచక్రవర్తి యౌవరాజ్యదశలో చెన్నపట్టణమునకు విజయముచేయుదనుక ఆపట్టణము నల్లపట్టణముగ (Black Town) నుండుట యందరకు దెలియును. ఇప్పటికి తెలుగుజిల్లాలలో "పాచి పెంట", "రావులకొల్లు" ఇత్యాద గ్రామనామము లున్నవి. నరిత్రాంకితముగ దగ్ధరాష్ట్రమయినను ఆంధ్రవైదగ్ధ్యము నకు హాని లేదు.

వేఁగి వ్యాఘ్రపర్యాప్తమైనను దగ్ధప్రాగ్వ మయినను వర్ణక్రమమున నొక్కటిగనె యున్నది. రెంటను అర్ధానుస్వార మున్నది[5]. వ్యాఘ్రపర్యాయమగువేఁగి వ్యాఘ్రశబ్దభవముగ నుండవచ్చును. అటులయిన నర్ధానుస్వారమునకు గతి గల్పింపవలసియుండును. అగ్నిపర్యాయమగు వేఁగితోటి సామానాధికరణ్యమున నెబ్బెట్టులో యరసున్న జొచ్చెనోని యుండును. కొన్ని తత్సమశబ్దములు తద్భవములగునపుడు యరసున్న వచ్చునటు లున్నది. సంస్కృతశబ్దమగు "కాండ" తెలుగున "కాఁడ"యగును. పూర్ణానుస్వారస్థానమున అర్ధానుస్వారము వచ్చినది. అనుస్వారము లేని సంస్కృతశబ్దములకు కూడ వికృతియం దర్ధానుస్వారము సామాన్యముగ వచ్చునా యనుట విచారణీయాంశమే!

అగ్నిసంబంధముగల "వేఁగి" అంగారశబ్దభవమో లేక దేశ్యమో నిర్ణయింప వలసి గాకున్నది వేఁగుట-తెలుగువారి వడియాలు లోనగునవి వేఁగించుటలో (వేయించుటయని వాడుక మాట) నున్నది. అరవవారి యన్నము పప్పుమొదలగు నివి యుడుకుటలో వారు 'వేగురదు' అను ధాతువు నుపయోగించుచున్నారు. ఇక కర్నాటకలన, ప్రత్యక్షముగు నగ్నికి వారి పేరు "బెంకి" యని తెలియుచున్నది. 'బెంకి'కి 'వెంకి'కి అభ్యంతరమున నేమియు లేదు. "వెంకి"లోని "వె" దీర్ఘముకాగా నిండుసున్న యరసున్న కాగలదు. మరియు పరుషమును సరళము కాగలను. సులభోచ్చారణ యొక్కయూ, శ్రవణ

1. దగ్ధత్వమున యశ్లీలము దోచి సుశ్లీకముగ వీర్యశౌర్యప్రతాపద్యోతకమగు పెద్దపులి పర్యాయమగునర్థమునే చిలుకూరు వీరభద్రరావుగారు యాంధ్రులచరిత్రము సంపుటము ౧. ప్రకరణము ౧౨ సం అభిమానించినారు.

2. ఛాందోగ్యోపనిషత్తు ౬. ౧.

3. వాల్మీకిరామాయణము బాలకాండ సర్గ ౫౪.

4. ,, .. సర్గ ౨౪.

5. సీతారామాచార్యుల వారి శబ్దరత్నాకరము చూడుడు.

6. పెద్దపులియర్థమున వేఁగి అరవమునను, కన్నడమునను గలదు.

ముఖోచ్చారణముయొక్కయు నియమము లిట్టివిగనే యుండగలవు. సంధిసూత్రము లన్నియు ముఖసులభోచ్చారణలకొరకేర్పడినవియెగదా! వాక్ + హరిః = వాక్హరిః అని యెంత ప్రయత్నించినను సాధ్యము కాజాలదు. "వాగ్ఘరిః" సులభసాధ్యము. ఇందు ప్రయత్నక్లేశమును లేదు.

వేగి కగ్ని సంబంధము జూపుట కింకొక నిదర్శనమును గలదు. తెలుగునాట వెలసిన శ్రీకన్యకాపరమేశ్వరితోకూడ అగ్నిం బ్రవేశించిన వైశ్యసందోహమునకు "వేగినవారు"[1] అనునొక సంకేతము గలదు. తదితర వైశ్యులు (బేరివారు లోనగువారు) వేగిన సమ్మెలోని వారు కారు.

వేంగి (వెఁగి) కడ నందుకొని "వెంగడము" పేరుట దూరాన్వయము కాదు; క్లిష్టాన్వయమును కాదు. అక్కడ, ఇక్కడ, ముంగడ ఇత్యాదు లిందుకు సాహచర్యమొనర్పగలవు. ఇదియొక ఆకృతిగణమనదగదా? "వేంగడ" "వేంకట" శబ్దములు భిన్నజాతులు గావు. రెంటికిని ప్రాతిపదిక మొక్కటియె. పరస్పరశబ్దైక్యము తెనుగుతల్లి కనభ్యస్తపూర్వము కాదు.

ఆంధ్రభాష కుదీచీనసీమ వేంగడమగుటయు ఆంధ్రదేశమునకు వేగినాడుత్తరమున నుండుటయు వేగివేంగడముల యైక్యసాధనకు గొప్పఆధార మగుచున్నది. నిగమనము సిద్ధించుచున్నది.

శిలప్పదికారాదులు పాడిన "వేంగడం" తమిళదేశములో నున్నదందురేమో! అటుల కాజాలదు. ఒక భూప్రదేశమున కెల్లల నిర్ణయించునపుడు అందులోని భాగమె దానికొక యెల్లగ జెప్పుట వ్యవహారసంప్రదాయము గాదు. స్వాశ్రయదోష మగును. ఇంగిలీషులో జెప్పునటుల (Views circle) అగును. కాబట్టి వెంగడము తమిళనాటిలోనిది కాదనుట సుస్పష్టము.

ఇట్లు వేంగడమగు వేగినాటి కధిష్ఠానదేవతయే శ్రీవేంకటేశ్వరమూర్తి. ఈమూర్తిని నలుదిశల నావరించియుండునది నాటికి నేటికి నేనాటికి తెనుగునాడగు గాని మరియొండుగాదు.— అఖిలాంధ్రవ్యాప్తిగల ఈ పరమద్రవ్యము తద్దేశస్థులది గాక జన్మద్వైవిధ్యము పాటించుకొను పౌరాణికులది కావలయునా?

ఇక అంకి, అంకమ్మ, అంకాళమ్మ, అంకయ్యలోనగునవియు వీనిరూపభేదములును వేగికి సాజాత్యములుగను తోచుచున్నవి. పసిబిడ్డలు వానవస్తున్నదనుటకు 'ఆనత్తుందమ్మో'యని కేకలువేయుదురు. నోరుతిరుగని పెద్దవారుసైతము కొందరు వెంకయ్యను యెంకయ్య అనియు, వెంకటగిరిని 'యెంకటగిరి' అనియు అనుట వినుచుందుము. మీరు యెప్పుడువచ్చినారు అనుటకు మీరు 'ఎపుడు'వచ్చినారు అని విపరీతోచ్చారణమును గలదు గాని యట్టిది అరిది. మొదటిది సామాన్యముగ నున్నది. ఈ న్యాయము ననుసరించిన వేంగి, వెంకి ఇత్యాదులు అంకిలోనగు వైరూప్యములను బొందుట విపరీతము గాదు. ఈరూపములకు సాజాత్యము జెప్ప సాహసించుటకు ముఖ్యకారణమేమనగ ఈ అంకి, అంకమ్మ, అంకాళమ్మ లోనగు దేవతావ్యక్తులు అగ్నిస్వరూపమగు వ్యక్తులని వాడుక గలదు. అంకమ్మ నిప్పులు చెరుగుచు గ్రామాలు కుప్పలు తగులబెట్టుచు ప్రవేశించునట. రవధూళి అంకమ్మ నిప్పుతోకూడ ప్రచండమారుతిమును దుమ్మునుగూడ తెచ్చునట. ఇవన్నియు అత్యుగ్రశక్తి భావనలుగ నున్నవి. బహుశః 'వేగి'తోపాటు యివియు అనాదిగ తెలుగునాటవర్ధిల్లుచున్నవి కాబోలు. దాహపర్యాయమగు 'వేగి' 'అంకి' లోనగునవన్నియు అంగారశబ్దవికారములుగ నుండునా? అంకిశబ్దము అరవమున నున్నది. ఆభాషయందుదానికి నిప్పు అని అర్థమున్న

---

1. వీరు "వేగినవారు" కారు, శ్రీకన్యకా పరమేశ్వరితో కూడ "వేగినవారు" అని ఛలము జేయవచ్చును గాని అది సరికాదు. అమహోవ్యక్తితోకూడ "వేగుట" అభిమానాతిశయమును ధైర్యస్థైర్యశౌర్యములను దెలుపును. ఆమెతోకూడ వేగుటయన నెక్కడిదో?

టుల దెలియుచున్నది. అగ్ని దేవతాక[1]మగు కృత్తికా నక్షత్రమునకుగూడ ఆభావమయం పది యొక పేరట.

నిప్పులుకురిపించు నీయంకమ్మ మనకేగాక ప్రాచీనగ్రీకులకును జ్వాలాస్వరూపిణియగు 'ఓంకా'[2] యను దేవతారూపమున నుండినదట. 'ఓంకా' యనగ మండుటయని యర్థమట.

బహుశః మనుష్యచరిత్రమునందు ఆగ్నేయతత్త్వముగల దేవతావ్యక్తులన్నియు ప్రత్యక్షదైవమని కొనియాడబడు సూర్యునుండి యంకురించి యుండవచ్చును. అట్టియాదిత్యునికి పూర్వరూప మగ్ని[3].

'వేంకట' తిరుమలనుండి వేఁగినాటి కవతరించి 'అంకాళమ్మ'శక్తిగ పరిణమించి గ్రీసుదనుకపోయి 'ఓంకా' పదవి నంది విజృంభించి తుదకు సర్వమయమగు నోంకారమున[4] లయమగునా, అతి చనవుచేత, పాపము! ఆంధ్రదేశమున వెట్టిలొట్టి వెంగళప్ప[5] కావలసివచ్చినాడు.

ఇంతవరకు ఈదీర్ఘప్రసంగమున సాధింపనెంచిన దేమనగ:—'వేంకట' శబ్దము 'వేం' పూర్వకకటోద్భవమా లేక 'వేఁగి' సాజాత్యమా? పౌరాణికపక్షము సాగలేదు. 'వేంగి' పక్షములోకానుభవమునకు సరిపోవుచున్నది. ఇదమిత్థమని రాద్ధాంతముజేయ నేశక్తుడనుగాను. దేశచరిత్రజ్ఞులు పరిశోధించి స్వారాజ్యయుగమగు నీకాలమున వెంకటుఁడు వేఁగినాటనుండి దూసిపోకుండ భద్రాయితమూర్తి వర్ధిల్లునటుల జేయవలయును.

౧౮౯౦ ప్రాంతముల మద్రాసున స్థాపింపబడి ఆవల కొలదికాలమున కంతరించిన మెయిన్ హిస్టారికల్ సొసైటి (Maine Historical Soceity) సన్నిధానమున మద్రాసు ప్రెసిడెన్సికాలేజి సంస్కృతోపాధ్యాయులును ప్రాచ్యభాషాభిజ్ఞులును నగు డాక్టరు ఆపర్టుగారు ప్రతిపాదించిన ఒకానొక వ్యాసము ఈ వ్రాతకు కొలది సహాయమైనది.



1. కృత్తిక యగ్ని దేవతాకమనుటకు 'ఋక్షేశా అథదస్రకాలవహ్నితభుగిత్యాది'—కాలామృతం శ్లో 3.

2. Brown's Saintic Influence on Hillenic Mythology p. 143) గ్రీకువారు 'Onka"ను ఓంకాయని బలికిరో లేక అంకాయని బలికిరో తెలియదు.

3. అగ్నిః పూర్వరూపం ఆదిత్య ఉత్తరరూపం—తైత్తిరీయశిక్షావల్లి 3.

4. ఓమితీదగ్ం సర్వ—తైత్తిరీయశిక్షావల్లి 8.

5. ప్రతాపరుద్రనాటకము—సర్వతంత్ర స్వతంత్ర వేంకటరాయశాస్త్రికృతి.

## తల్లి బిడ్డలు



చిత్రకారుడు: జి. హనుమంతరావుగారు.




## ౧

సుదర్శనం—నాన్నా! అవి ఎవరూ? పెద నాన్నగారి అక్కయ్యా?

లక్ష్మణరావు—కాదురా బాబూ! మీ అమ్మ.

సుదర్శనం—అబ్బే! ఇదేమిటి నాన్నా? మా అమ్మ ఇలాగుం దేమిటి? ఇంతకంటె పెద్దదిగా ఉండేది. ఎప్పుడూ నవ్వుతూ ఉండేది. మా అమ్మ చెవులు కిలాటివి లేవే! ఆఁ! కాదు! ఎవరో చెప్పరూ?

లక్ష్మణరావు కన్నులు కొంచెం చెమ్మగిల్లేయి. శుభం చేసికొని యింటికి వచ్చినతరువాత కంటతడిపెట్టకూడదని దుఃఖం మ్రింగుకొన్నాడు.

"సుదర్శనం! ఇది మీ పినతల్లి. మీ అమ్మ కాశీ వెళ్లిపోయింద కాదూ! నీవొక్కడవూ ఉండలే వని దీనిని తీసికొనివచ్చాను." అన్నాడు.

సుదర్శనం— అయితే మరి మా అమ్మ రాదూ?

లక్ష్మణరావు—(గడగడా వణుకుతూన్న కంఠంతో) ఎందుకూ? మీ అమ్మ రాకపోతే నీకేమిటి? చక్కెర మధురం అన్నీ వండిపెడుతుంది. తల దువ్వుతుంది. ఒళ్లు కడుగుతుంది. చాకంటిబట్టలు తొడుగుతుంది. నీవు శ్రద్ధగా బడికి వెళ్లి చదువుకుంటావు. నీకు కావలసినన్ని రూపాయిలు నేనిస్తాను. కొంచెం పెద్దవాడవగానే సరికి ఇంకా బాగా చదువుకుంటావు. నీకు మంచిపిల్లను పెళ్లి చేస్తాను.

సుదర్శనం—అయితే కర్పూరపు పేరులూ అవీ కొంటావా? ముత్యాలపల్లకీ ఉంటుందా?

లక్ష్మణరావు—అన్నీ ఉంటాయి.

పాపం సుదర్శనం ఏడేండ్లవాడూ. వాని తల్లి క్రొత్తగా పోయింది. వెంటనే లక్ష్మణరావు మధురాన్ని వివాహం చేసుకొన్నాడు. ఆనాడామె సారె వచ్చింది. లక్ష్మణరావుకు మొగటి భార్యవల్ల ఒక్కడే సుదర్శనం కొడుకూ. తాతల నాటి ఆస్తులేమీ లేకపోయినా సంస్థానంలో లక్ష్మణరావుకు నూరురూపాయిలిస్తారు. సొంత యిల్లు కట్టుకొన్నాడు. ఇంతో అంతో

పాతరసామానూ వెండిసామానూ ఉంది. మధురం ఒంటిసి యేబదితులాల బంగారం పెట్టేడు. అన్నీ బాగానే ఉన్నాయి. భగవంతుడు చేసిన లోపానికి లక్ష్మణరావేం చేస్తాడు! కంఠంలో జీవుడున్నంత కాలం ఎలాగో ఒకలాగు సంసారం సాగించాలా? మొదటి భార్య పోగానే వివాహం మానేద్దామనుకున్నాడు గాని తనకూ బిడ్డడుకూ త్రాగడానికి గంజి ఉండదని అధైర్యపడి చేసుకున్నాడు.

లక్ష్మణ—మధురం! ఇదిగో వీణ్ణిచూచేవా? వీడు నీకొడుకన్న మాట.

మధురం వానినిచూచి తనశరీరసౌష్ఠవం చూచుకుంది. లలితంగా మాలతీతీగలాగు ఇప్పుడిప్పుడే కొనసాగుతూన్న యౌవనంతకిది కత్తివేటులాగు తగిలింది. ఆమెమనస్సు చివుక్కుమంది. "ఆఁ! అంటే మీకొడుకు కాదూ?"

లక్ష్మణరావు—ఔనే, వాడిని సరిగా పరీక్షించిచూచేవా? (ఇట్లనుటలో సుదర్శనంలో తనముఖలక్షణాలు ఉన్నాయనీ, అవిచూచి వానిమీదకూడా తనమీదవలెనే ఆమెకు ప్రేమకలుగుతుందనీ లక్ష్మణరావు ఊహ)

మధురం—ఆఁ! చూచేను. కన్నులూ చెక్కులూ అవీ ఆడుతనాన్ని సూచిస్తున్నాయి.

లక్ష్మణరావు—అదికాదే. లేతవాడవడం చేతా మీసాలు లేకపోవడంచేతా అలా అనుకున్నావుగాని, ఆముక్కూ, కన్నులూ, నోరూ, ముఖంకూడనా అవన్నీ నావిలాగే ఉన్నాయి కావూ?

మధురం— అయితే ఔనుగాబోలు. నాకేం తెలుస్తుంది?

లక్ష్మణరావు—చూడూ! నీవు కాస్త వీణ్ణి కనిపెడుతూ ఉండాలిసుమా! నీవు చిన్నదానవయినా బుద్ధిమంతురాలివి. నీకు పదేపదే చెప్పనక్కరలేదు.

మధురం—అయ్యో! అలాగే నండీ! నాకలాటి అలక్ష్యం యెప్పుడూ ఉండదనుకోండి. మీవస్తువయితే చాలునా, అది యెలాటిదయినా సరే; ఇలా నాకనురెప్పలలో పెట్టి సంరక్షిస్తాను.

సుదర్శనం—అయితే పిన్నీ! మీవూళ్లో ముత్యాలపల్లకీ ఉందీ? బ్యాండు మేళం ఉందీ?

మధురం—(క్రీగంటనే నిరసనంగా వానివైపుచూస్తూ తలత్రిప్పుతూ) ఆఁ! అన్నీ ఉన్నాయి. అ వేలా యిప్పుడూ?

లక్ష్మణరావు — కుఱ్ఱాడు కాడుటే? అలాటివాళ్లకివన్నీ అంటే సరదాకాదూ? అందు కలా అడుగుతాడు. (కొడుకుతో) ఉన్నాయిరా బాబూ! చూడూ, ఇప్పుడు నీకేలా ఆవూసులన్నీనీ? ఆవేళ కెన్ని తెస్తానో చూడు.

అని సుదర్శనాన్ని దగ్గరా తీసికొని వెచ్చగా కౌగలించుకొని తల ముద్దుపెట్టుకొన్నాడు.

మధురం అదిచూచి తెల్లబోయింది.

"రాత్రివిడితేనేమిటి! ఇంకావాడిపోలేదు. రమారమి యిప్పుడు విచ్చిట్టేఉందని ఈ అడవి గులాబిపువ్వును చూచి కోసుకుందామను కొన్నాను. నలుగనీయకుండా తలమీద పెట్టుకుందామనుకున్నాను. సువాసినినయి కాంతాలోకంలో కలకలలాడుదాం అనుకున్నాను. అయ్యో ఈ రెక్కలలో అప్పుడే గండుతుమ్మెద యిమిడిపోయిందే! ఇగురగా మిగిలిన కాస్త తేనే యిది త్రాగేస్తుంది కాబోలు! అది రెక్కలు గలిగినది కాబట్టి యెక్కడికేనా యెగిరిపోతుంది. నేనేం చేసేది? పువ్వు వాడిపోయిన శాఖనుపట్టుకొని వలవలాయేడ్చేదా? అప్పుడు నాయేడుపెవరు వింటారు? ఈ మధురసం నేనెలా గ్రహించడం? నా అనుభవమైన వెనుక గదా యితరులకు జారపెట్టాలి!...... ఈ యువస్థలో అది నాకు సాధ్యమా?...... ఎలా అవుతుంది? ఇప్పుడప్పుడే నేనేమీ తొందరపడి అనకూడదు. ఏమో! కాల మెలా మారుతుందో! నేనింతకంటే గండుతుమ్మెద నా పువ్వుదగ్గర కాపుంచితే యీతుమ్మెద యేం చేస్తుంది?... సరే కానీ! దేవుడే ఉన్నాడు!"

అని మధురం అలోచించుకుంది.

౨

సుదర్శనం—నాన్నా! దసరాకుఱ్ఱవాళ్ళందరూ వెళ్లిపోతున్నారు. ఈ లాల్చీబొత్తాయిలుపెట్టవూ! నాకు పెట్టబడలేదూ... వేగంరా నాన్నా! అదిగో అందరూ వెళ్లిపోతున్నారు!

లక్ష్మణరావు—అబ్బ! ఉండ్రా బాబూ! తమ్ముడేడుస్తున్నాడు వినబడలేదూ! వాడినెత్తుకున్నాను కనబడలేదూ? పదేండ్లపిల్లాడివి; లాల్చీకి బొత్తాయీలు పెట్టుకోలేవ్రా?

సుదర్శనం—(ఏడుపు మొగంతో) క్రొత్త లాల్చీ నాన్నా! కాజాలు చిన్నవి!

లక్ష్మణరావు—అబ్బ! ఏదో ఒక



"అవతలెవళ్లైనా ఉంటారు......చిన్నవవ్వు నవ్వుకుంటూంది"

లోపం. అవతలెవళ్లైనా ఉంటారు పెట్టమందూ.

అంటూ ఆ చేతులలో యేడుస్తూన్న పిల్లాణ్ని గుండె కదుముకొని ముద్దుపెట్టుకొని

"ఓ! ఓ!" అంటూ చేతులలో ఇటూ అటూ ఊస్తున్నాడు. వంటయింటి కిటికీలోంచి మధురం ఇదంతా చూచి చిన్న నవ్వు నవ్వుకుంటూంది.

సుదర్శనం లాల్చీ బొత్తాయీలు పెట్టుకోకుండానే గబగబా దసరాపిల్లలతో వెళ్లిపోతున్నాడు. బొత్తాయిలేక లాల్చీ మెడ యెడం భుజంమీదకి వ్రేలాడిపోయింది. సవరింపు లేక షరాయికాళ్లు ఒకటి క్రిందికీ ఒకటి మీదికీ తొట్రుకుంటున్నాయి. తిరిగీ దువ్వకపోవడంచేత, లాల్చీతొడుక్కుంటూన్నప్పుడు చింకిరయిపోయిన జుట్టు చెదరిపోయి మొగాన రెండు మూడు పొడుగుపాయలు వ్రేలాడుతున్నాయి. చేతిలో విల్లు పెద్దదవడంచేత, జారిపోతున్న షరాయి నడుంకట్టుమీదికి సవరించుకొన్నప్పుడల్లా వింటికొన కాళ్లలో బడి ముందుకు పడిపోబోయి ఆచుకుంటూ కన్నీరూ చెమటా కలసిపోతూన్న మొగంతో అలిసిపోవడంచేత చిగురాకుకొనలలాగు ఎగురుతూన్న ముక్కుపుటాలతో ముద్దునోరుతో దసరాతిరుగుతున్నాడు సుదర్శనం.

పైని స్వర్గంనుండిగానీ సుదర్శనం తల్లి విజయలక్ష్మి ఆ సమయంలో సుదర్శనాన్ని చూస్తే నిలువుపాటున కిందపడిపోదూ?

## 3

లక్ష్మణరావు చిన్నకొడుకు శ్యామలరావుకు ఒళ్లుకడిగి తుడుస్తున్నాడు— చింపిరి జుట్టు సవరిస్తున్నాడు— ప్రక్కను చిఱునవ్వు మొగంతో మధురం నిలబడి "శామ్‌కి పట్టు సూటు కుట్టించాలండీ. చూచేరా? ఆపులిగోరు పతకం వాడిమెడలో ఎలా వెలవెలపోతూందో! మాయవైనా సరే నాలుగురంగురాళ్ళైనా ఆ పతకంలో వేయించారుకారు.

లక్ష్మణరావు—మాయరాళ్ల గ్రహచారమేమే? మంచిరాళ్ళే వేయిద్దాం. పెద్దవాడయిదాకా దీన్ని శామ్ పెట్టుకుంటే తరువాత కనకం పెట్టుకుంటుంది. ఇవాళే ఉమ్మిడియార్‌కి వ్రాస్తూ పతకం పంపుతాను.

మధురం—అఁ! వచ్చే! ...... అడుగోనండీ, వచ్చేడు అడగండి. అట్టే కోప్పడకండీ, ఏమనుస్తాడు.

అని పరుగున వెళ్లి వీధి తలుపు తీసింది.

సహజంగా మెత్తగా నల్లగా నిగనిగలాడేదయినా సంరక్షణ లేక సుదర్శనం జుట్టు ధూళిపడి కొంచెం యెఱ్ఱవాకుగాను చిక్కుపడి కొంచెం బిరుసుగానూ కనబడుతూంది. అక్కడక్కడ చినిగిపోయిన తెల్లని లాల్చీ తొడుక్కున్నాడు. బొత్తాయీలవంతు చిన్న దారపుపోచలు కట్టుకున్నాడు. పంచెకు కూడా చింకులున్నాయి శాబోలు, అటునుండీ యిటునుండీ ముందుకు కొంగులు మళ్లించి కట్టుకున్నాడు. చేతిలో యేదో ఇంగ్లీషుపుస్తకం ఉంది. తొమ్మిదిన్నరగంట లయింది. ఏదో యింత తినేసి బడికి పోదామని వచ్చేడు. వస్తూనే చీడీమీద కిటికీలో లాల్చీ పుస్తకం పెట్టి పెరట్లో నూతివద్దకు నీళ్లుపోసుకుందామని

వెళుతున్నాడు. లక్ష్మణరావు క్రీగంటను వానిని చూచేడు. మధురం ముఖం కోపంగా పెట్టింది.

లక్ష్మణరావు—ఓరా! ఏమిటి నీ వేషం? ఆపూట కీపూట హోటేలుకు వచ్చినట్టు తిండికి వస్తున్నావు! మరి యిక తిరిగి చూడవు! వంగివాలవు! నీ వవతల చదువుతున్నావో సాముచేస్తున్నావో యెవరికి తెలుస్తుంది? అది కాక ఒకనాడు రాత్రి ఎనిమిది గంటల కొస్తావు, ఒకనా డారుగంటలకే వస్తావు. నాకంటపడనే పడవూ! ఇంట్లో ఉన్న మనమిద్దరమూ రెండు సార్లు భోజనం చెయ్యడమా? వడ్డించేవాళ్లె లా యేడుస్తారు? ఏదో వేళ నిర్ణయించుకో లేవూ? పగలుకుపగలూ రాత్రికిరాత్రీఅలాగే?

సుదర్శనం—(బామముడితో) నాకు సొంతపుస్తకాలు లేవా, తోడికుఱ్ఱవాళ్ల నడిగి చదువుకోవాలి. వాళ్ళసమయం కనిపెట్టక పోతే పుస్తకంకావలసినప్పుడు దొరకదేమోనని కనిపెట్టుకుంటాను. అందువల్ల ఒక్కొక్క నా డాలస్యం అవుతుంది.

లక్ష్మణరావు—అబ్బ! ఎంతదరిద్రం పెళ్ల బోసేవురా! నాయనా! ఊరుకో! ఊరుకో! ఎవళ్లయినా వింటే నిజమనుకుంటారు. ఆగోసా యీ వెధవలనుకూడి బాగా తయారచేశావు. నీలాటి వాణ్ణి కన్నందు కబ్బకు రెండూ, అమ్మకు రెండున్నూ!

"అమ్మకు రెండు" అనేసరికి సుదర్శనం తండ్రివైపు చుఱచుఱాచూచేడు.

లక్ష్మణరావు—ఏమిట్రా అలా చూస్తున్నావు? నన్ను భయపెస్తున్నా వేమిటి? గ్రుడ్డు వచ్చి పిల్లను భ్రమించిందట! అబ్బో! వ్యవహారం శ్రుతిమించి రాగాన్నపడుతూందే! నే నింతా అనుకున్నాను. నీ వోయింటివాడవయి పనికివస్తావన్న నమ్మకం నాకు మొదటినుండీ లేదు. ఆ దౌర్భాగ్యుడు మేనమామను పోలేవు.

సుదర్శ—నేనిప్పు డేం చేసేను?

లక్ష్మణరావు—నే నేం చెప్పేనో అది తప్ప అన్నీ చేసేవు.

సుదర్శనం—నీవేం చెప్పేవు?

లక్ష్మణరావు—ఏమి టీ ప్రశ్నోత్తర రత్నమాల? నీ వలా అడుగుతూ ఉంటే ఇలా సమాధానాలు చెపుతూఉండడమే పనా యేమిటి నాకు?

సుదర్శనం "ఊఁ" అని పెరట్లోకివెళ్ల బోయేడు. లక్ష్మణరావుకు కన్నులు మొయ్యా కోపం వచ్చేసింది. "ఏమిట్రా ఆ నిర్లక్ష్యం! ఎక్కడి కలా నను దలపరించుకొని వెళ్లిపోతు న్నావు! నీకింత నిర్లక్ష్యంగా ఉందా? (తల పంకించి) అబ్బీ! సుదర్శనం! నీకు మైనారిటీ తీరింది. ఇన్నాళ్లూ యేదో నా శక్తివంచన లేకుండా నిన్ను పెంచి పెద్దవాణ్ణిచేసి ఇంతో అంతో చదువు చెప్పించేను. నీకు భయ భక్తులు మానిపోయెను. విశ్వాసమేనా లేక పోయిన తరువాత నా కెందుకూ ఈ దేవు

లాట? ఇక నే నేమీ నీకు చేయలేను. తెలిసిందా? మీ మామగారింటికి వెళ్లు. వాడూ పట్నంలోనే కాపురమున్నాడు. నీకు కడతేరా చదువుచెప్పించి పెండ్లి అదీ చేస్తాడు.

సుదర్శనం—వాళ్లకే తిండికిలేక యిబ్బంది బడుతుఉంటె నాకేం పెడతారు?

లక్ష్మణరావు—అయితే చిన్నవాడవా యేమిటి? పద్దెనిమిదేండ్లు దాటేయి. స్కూలు ఫైనలు దాటేవు. ఇంటర్మీడియేటు చదువుతున్నానంటున్నావు. ఈచదువు చాలును నీ పొట్టపోసుకోడానికి. ఇంట్లోసొమ్మంతా ఖర్చుపెట్టి బి. ఏ. పాసయిమాత్రం ఏం చెయ్యాలి? ఎంతచదివినా ఒకటే. నే నేం పాసయినాను. మా మేనేజరేం పేసయినాడు? గడుసువాడవయి యజమానికి నచ్చేటట్టు పనిచేస్తే యీ చదువే చాలును. ఆతాసీల్దారు కచేరీలోనో దేల్లోనో రోజూవెళ్లి పని నేర్చుకోకూడదూ? ఎద్దునచ్చిన దాసరిలా గెందుకూ యీతిరగడం?

సుదర్శనం—ఇప్పుడు పనేమిటి? ఈ ఆరు నెలలూ యెలాగో యీడ్చేస్తే పరీక్షలయిపోతాయి. తరువా తేదో చూచుకోవచ్చును.

లక్ష్మణరావు—ఆరునెల లంటే నీ కంత సులువుగా ఉంద కాబోలు! సొమ్మిచ్చేవాడి కష్టం నీకేం తెలుస్తుంది? ఇంతకీ ఆపరీక్ష పాసయితేమాత్రం ఏమిటి తేటు? లేనిపోని వేషాలు వేసి నన్ను ఫకీరుని వేయక ఏదో నౌఖరీలో ప్రవేశించు. నీకు కావాలంటే సిరస్తాదారుతో నేను మాట్లాడుతాను. అతడు నా మాట కాదనడు.

సుదర్శనం కళ్లనిండా నీళ్లునిండేయి. గాలిలో రెల్లులాగు గడగడలాడేడు. చదువు


"సుదర్శనం కళ్లనిండా......గడగడలాడేడు"

మానివేయడం తనకిష్టం లేదు. మానకతీరదేమో! సరేకానీ, యెలాఉంటే అలాగే ఉంటుందనుకొని తిండితినకుండా లాల్చీ తొడిగేసుకొని పైకి వెళ్లిపోతున్నాడు. అతడు వెళ్లిపోయీదాకా ఊరుకొని మధురం-'అయ్యో! అదేమిటండీ! బొట్టెడలా తిండితినకుండా వెళ్లిపోతున్నాడూ? తిన్నాకేనా పెట్టరుకారూ యీ చీవాట్లేవోనూ? జ్ఞానంవచ్చిన పిల్లాడు. శౌర్యపడడూ? అందులోనూ ఈరోజుల్లో పిల్లలు

చెప్పినట్టు పెద్దవాళ్లే వినాలి......ఏమి ఆలా చూస్తున్నారు? ఇక నామీద కోపపడడం ఉండిపోయిందేమిటి? ఇక బాగుంది! నాకేలా! మీకంటె నాకెక్కువ తెలుసునా యేమిటి? ఆడుదాన్నవడంచేత ఉండబట్టక అలా అన్నాను. మ రారోసరోనలు మానేసిలెండి. కచేరీకి వేళకాలేదూ? వంటకాలేదని ఊరికే తొందరపెట్టేరూ?' అంది.

లక్ష్మణరావు—లేస్తానుగాని మధురం! ఈ వెధవని మరి గుమ్మంత్రొక్కనీయకు. వీడి తలతిరుగేదో చూద్దాం. పెద్ద యెట్టేటున్న వాడిలాగు పెసమొగం పెట్టుకొని వెళ్లిపోయాడు. ఆ చదువేదో ఎలా సాగుతుందో నేనూ చూస్తాను.

౪

కొంతకాల మయింది. సుదర్శనం మరి తండ్రికంట పడలేదు. కలకత్తాలో రైల్వేలో నౌఖరీ సంపాదించుకొని కాలక్షేపం చేస్తున్నాడు. మేనమామ కూతురును పెండ్లి చేసుకున్నాడు. జీవితం సుఖంగానే గడుస్తూంది.

తండ్రికీ కొడుక్కీ ఉత్తరప్రత్యుత్తరాలయినా లేవు.

ఆనాడు మధ్యాహ్నం చాలా జబ్బుగా ఉండి లక్ష్మణరావు చావడిలో మంచంమీద పడుక్కొని ఉన్నాడు. మెల్లగా జారుతూన్న వాని కన్నీళ్లు మధురం పైటచెరగుతో తుడుస్తూంది. శ్యామలరావూ, కనకం ఏడుపుమొగాలతో మంచందగ్గర కూర్చున్నారు. పొరుగు భీమారావుగారు వచ్చి "అయ్యా! లక్ష్మణరావుగారూ, కీడెంచి మేలెంచమన్నాడు-ఎందుకయినా మంచిది ఒకవీలు వ్రాసేరు కారూ?" అన్నాడు.

లక్ష్మణరావు—వ్రాసేను బాబూ! వెనుక వ్రాసేను. మధురం! ఆవీలు తీసికొని వచ్చి భీమారావు బాబుకు చూపించు.

భీమారావు—వ్రాస్తే సరే, చూపించడమేలా? మీకిలా సుస్తీకా ఉన్నట్టు మీ పెద్దబ్బాయికి వ్రాయించేరా?

లక్ష్మణరావు త్రుళ్లిపడి ప్రక్కకు ఒత్తిగిల్లి పెకవివశకించేశాడు. కన్నీళ్లు వలవలా కారేయి. అతనిముఖం మరింత పాలిపోయింది. వణుకుతూన్న కంఠంతో "వాడెందాకూ? వీళ్లు నాకు సంరక్షణ చేస్తున్నారు కారూ? ఇంతకంటె వాడేంచేయగలడు?" అన్నాడు.

భీమా—అదికాదు. మీరొక మాటు చూస్తారని.

లక్ష్మణ—నన్ను నిర్మోహుడుగా చేసేశాడు బాబూ, వాడు. వానిని చూడాలని నాకెన్నడూ లేదు సరిగదా, వానిని చూస్తే నాకు దుఃఖంకూడా వస్తుంది. వాడికర్మం! నేనేం చేస్తాను.

భీమా—అదికాదు లక్ష్మణరావుగారూ, మీరు మరోలా అనుకోకండి-మీరింతజబ్బుగా ఉన్నారా? ఒకవేళ ఎటులుండి ఎటువచ్చినా పనికివస్తాడని.

లక్ష్మణరావు—ఆఁ! పనికి వస్తాడా?
(అని మరింత పాలిపోయేడు.)

భీమారావు—పనికి రావద్దా మరీ? మనము హిందువులము కామూ?

లక్ష్మణరావు—ఔను లెండి!

అని కన్నీళ్ళు ఒలికించేశాడు. మధురం మొగం తెరిచూచేడు. ఏదో చెప్పబోయి గడ గడా వడికికన్నులు మూసుకున్నాడు.

భీమారావు నిదానించి అతని ముఖం చూచేడు. ఆ ముఖంలో అప్పుడే మృత్యు చిహ్నాలు కనబడుతున్నాయి. "లక్ష్మణరావు గారూ" అన్నాడు. లక్ష్మణరావు మెల్లగా కన్నులువిప్పేడు. వానిలో తళుకుతగ్గిపోతూంది.

భీమారావు—ఏమిటి చెప్పబోయేరు?

లక్ష్మణరావు—ఏమిటా! (కన్నీరు జారి పోతూంది).

భీమారావు—చెప్పండి. సంకోచం యెందుకూ? వీలయితే మీ రెలా చెపితే అలాగే చేస్తాం.



"చెప్పండి. సంకోచం యెందుకూ?
మీ రెలా చెపితే అలాగే చేస్తాం"

లక్ష్మణరావు—ఆపెద్దబ్బా...యి...చేసే ...పనేదో...శ్యామ్...చెయ్యకూడదూ!

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందా దారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందా దారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము

—మేనేజరు, 'భారతి.'

శ్చింతస్వాంతత వారి వీడఁదగునే; చేకొంద నీకుండ త్మా
కాంతావల్లభ! వారిమొందఁ గడువీఁకన్ వారి రక్షింపుమా!

అయ్యాసంబునఁ బడియురెండబ్దములు వ-నంబునం దొక్క-వర్ష మజ్ఞాతచర్యఁ
జరిపితిమి; నీవాఁడ నర్ధరాజ్యంబుఁ బడసి-సుఖులమై యుందమని వారు చూచుచుండ్రు.

తండ్రియుఁ జెలింగుగలిగినఁ దత్తనయులు-నవరు గొఱగానివారయ్యు నేమికొఱంత ?
కులము పాడియు ధర్మంబు గొనలుసాఁగు-నంచుఁ బాండవేయులు వచియించుచుండ్రు.

కొడుకువాఁ డెట్టు మాతండ్రి నడరి మమ్ముఁ-గనికరం బేద వనముల కనుచుఁగాక
ధర్మమూర్తులు భీష్ముండు ధర్మగురుఁడు-తన్ను బోధించి మమ్ముఁ దేర్పఁదగదొ యండ్రు.

గానముఁ గని ధర్మజుఁ డా-తని యనుజులు నట్టివార ధర్మం బెన్నం
దను విడువరు దయ నీమెఱుఁ-గని యదిగో తలఁపు మింత కౌరవనాథా!

విను మింద్రప్రస్థపురం-బున ధర్మజుఁ డుండి నిన్ను భూపవితానం
బును గొల్వఁగఁ జేయుటకని-జనను ప్రెం డాలింపు దగ్విజయ మొనరించెన్.

ఉన్నతి నీగతి నటవా-డున్న సహింపకయ యాల సుయోధనముఖ్యుల్
పన్నరె జూదము సిరిగొని-యన్నా! పాంచాలి నీడ్వరా కొలుపునకున్.

ఒడఁబడితి వీవు దానికి-నొడయఁడ! ధర్మజుఁడు సత్యమూని యనుజులన్
దొడికొని వని నడలియు ని-ష్కుడు ప్రానికఁ బ్రిసీదు పొత్తాసించున్.

వినయము గౌరవమ్మును వివేకము సత్యము శాంతి దాంతియున్
ఘనతరధర్మవర్తనము గల్గిన ధర్మసుతుం డపేయశో
ధనగుణశాలిగాఁడె జనవల్లభ! తాఁ దనుఁబోలుఁగాక యే
జనహితుఁడుందుఁ దాదృశలసద్గుణరాజి ప్రకాశమొందెనే!
కౌరవపాండవేయుల కఖండశుభావహమైన మార్గ మీ
దారి వచించితిన్ దమ హితంబునుగోరి భవత్సుతుండు ధా
త్రీరమణాగ్రగణ్య! కడుఁ దేఁకువమాలినవాఁడు లోభి యే
నేరుపుచేతనైన నతనిన్ దగనోరిచి వారిఁ జేఁగదే.

పాండవు లేగతినైనం-భండన మదికోకయుండ మది నెంతురు నీ
నిండుమనంబునఁ గొల్వఁగ-నుండుదు రది లెస్సతలఁపు ముర్వీనాథా!

# సువర్ణమేఖల

జనమంచి రామేశ్వరరావుగారు

నేనూ మా రాజీ ఎప్పుడూ యిల్లాగే వున్నామా! అనిపిస్తోంది. గతించిన విషకాలం, రాబోవు నిషాకాలం, మాతో నిలిచివున్న ఈ నిమేషకాలంతో మేళవించి చుక్కలకూ వాళ్ల రాజుకుకూడా ఆనందసందేశాల నంపుతున్నాయి.

ఎన్ని నిశలో! గతించిన నిద్ర మొన్న మొన్నటిదాకా ఆవలించి కలవరిస్తూనే వుంది.

ఎన్ని నిశలో! విడచిన వేడినిట్టూర్పులూ, కళ్లల్లో మెరుగుతూండే దుస్స్వప్నాలూ నికుబంతాలు కనల్చి, సరసవృష్టిని దిగజారి విశ్వాన్ని వివశం చేశాయి.

విధివిరామం లేక జపించిన మా రాజి రాగరేఖ మొన్ననే నాదబ్రహ్మాని ఓంకారంలో కలసి వినిపించింది.

నేను ప్రేమబాధలు పొగిలి, సోలి, త్రిభంగసఖవి తూర్పుకొని ఆశాప్రతీక్షలో కుంచుకొని పోతూంటే, ఆమె మహారాజ్ఞియై చిరునవ్వు చిలుకు తొలకరి మబ్బులా దైవతపథాలనుండి నా కెదురుగా నవతరించి తన హృదయమలయ మారుతాల ప్రసరించేది. అంత నాహృదయం మిసిమించి కుసుమించి పరిమళించేది.

ఎవరో నింగిపీలాల చాందినీ చీల్చికొని వచ్చి నిశ్శబ్దరజనీజీమూతరాగప్రశస్తి నాలపింపక గుసగుసలుపోతూ మమ్మే తిలకించేవారు. శశిరాజును కళ్లెమూయ మని శాసించేవారు. వెన్నెలచిన్నిపువ్వులు మామీద జలజల రాల్చేవారు. పాపం! ఆలోకులకు నేనూ మా రాజీ అంటేఎంతో యిష్టం. మాది అతిలోక సాంద్రతృష్ణ యని వారికి తెలుసు.

నా రాజి ఆమె సుధాపూరితనిశితదృక్కులతో నాలౌకికభావాల నన్నిటినీ దహనం చేసింది. తన దరహాసవల్లిక నా హృదయంలో నాటి, అంటుకట్టి విరులతోట పెంచింది. నా చూపు మేరదూరంలో వుండి మా యిద్దరి మధ్యనూ విశ్వాన్ని యిమిడ్చింది. నాకు మా రాజికి విశ్వమే విడని కౌగిలైంది.

నేను రాజికౌగిల్లో విశ్వ మంటూంటే వెర్రిగా పొగిలి కనలిపోయేవాణ్ణి. నన్ను విశ్వంలో వాణ్ణిగా చూసేది కాదు. నన్ను తన కౌగిల్లోనికి చోటిచ్చేది కాదు. నన్ను విశ్వంలోను చివేరుచేసేది.

ఎందుకిల్లా చేస్తావంటే?

విశ్వాన్ని తన అనంత బాహువులూ సాచి కౌగిలించుకుంటూంటే నేను పైనుంచి చూడాలట! చూసి మా రాజి శక్తిసంపద లెంత! అని మెచ్చుకోవాలట!

నేను విశ్వాన్ని కౌగిలిస్తూంటే తనేమో దూరదూరాలకు తక్కుచూ తారిపోయి విశ్వాన్ని నాకౌగిల్లో యిమిడాక నాయెదుట నిలిచి పకపకా నవ్వుతుంది.

ఏమి నవ్వుతావు రాజీ! అంటే విశ్వాన్ని కౌగిలించుకుంటూన్నా నేను ద్విబాహినేయనిట... ఆ రేయి విశ్వమంతా అవశమై నిశ్చలసుషుప్తిలో మునిగిపోయింది. నేనంత చేతులు దొప్ప గట్టి నాముఖానికి దోయిలుంచుకొని నాలో కూడ అనంతబాహువు లెప్పుడు విరిసికొని పోతాయి రాజీ! అని అడిగాను.

"ఎప్పుడు నీవు నన్ను చూడగా ప్రేమపొంగలు చిమ్ముకుండా, త్రిభంగపదవికూర్చకుండా అవలోకితేశ్వరస్వామిలా నిల్చుంటావో అప్పుడు" అని సన్నగా నాసందేహానికి సందేశం పంపింది రాజి.

అయ్యో! నేనింకా అల్పమర్త్యుడనే! అని నేను వెరగుతో నైస్పృహ్యాం పొందాను.

అంతలో విశ్వమోహసుందర్శనం నాదృష్టినుండి మాసిపోయింది. చీకటి క్రమ్మింది నన్నూ, మా రాజినీకూడ.

ఆమె కొంతసేపు నభోలక్ష్మి నీలిచెరగులో దాగుంది తరువాత వాలుజడెనల్లకుంచె చేత పట్టుకొని అల్లా అల్లా తరలిపోయింది—స్వర్గపేటిలో దాచుకున్న కిరీటంమీద చిత్రితమైన నారూపం చెరిపెయ్యాలని—

ఒకసారి తారామోహనమూర్తి నన్ను ఎర్రగా చూచి, రెండు కరుణాశ్రుపుష్పలురాల్చి 'పిచ్చిబతుకింతే!' అని తన నీలిసౌధంలోని మధుమందిరం చేరుకున్నాడు. తారలన్నీ రాజుగారి అరుణదృక్కులు పోల్చుకొనలేక కోపాతిరేకముచేతనే అనుకొని గబగబా భువికి రాలిపోయినాయి. నేనంతే అల్లా నిల్చిపోయినాను.

చీకట్లు క్రమ్మినై. నారాజి మళ్లీ నావైపుకే యాత్రసాగించింది. వెక్కి వెక్కి పసిగోలగా ఏడుస్తూన్న నన్ను చూసింది. ప్రసన్నత దొరకించుకొన్న హృదయ మవడంచే నన్ను కామించింది. నన్ను చేరి నవ్వుతూ తన కరాలింగనాల్లో భూగ్యపర్లోకదృశ్యాలు చూపింది. జలజలస్రవిస్తూన్న నాసెలజాలు తనలోనికి పారించుకుంది. దివిజగంగ తనలో యిముడ్చుకున్న ట్లేనవ్వుతెరగల చిమ్మింది. * * * * ఇంతలో ప్రళయం క్రమ్మసాగింది. వియత్తైలపు నీలిపరుపుటాకాలన్నీ తెగిపోయినై. ఫేనగాసులన్నీ ప్రళయఝంఝానిలంలో కలసి ఆశాంతాల కెగిరిపోయినై. నభోలక్ష్మి కార్మొయిలు పెదవులువిప్పి, దంష్ట్రాగ్ని చిమ్మి ప్రళయభీకరంగా మృత్యుకేళి సలిపింది.

ఒక మెరపు సువర్ణమేఖలై మమ్ము ఆవరించింది. మరొకటి మమ్ము స్వర్గపుద్యానాల్లో దింపింది.

ఆ సువర్ణమేఖల మమ్మింకా కౌగిలిస్తూనే వుంటుంది. మేము చేతులుపట్టుకొని "ఒప్పుల కుప్పా! ఒయ్యారిభామా" అంటూ తాండవనృత్యకేళి చేస్తాం మామధ్యనే విశ్వం ఆడుతూ పాడుతూ, హాయిగా తేలుతూంటుంది. అప్పుడు మేఖల కరగి చిన్న చిన్న గీతులై మాకు ప్రేమసంగీతం వినిపిస్తుంది

విశ్వం అవశమై వుంటే మేఖల మమ్ము కుదించుకుంటుంది. మేమంత అనంతంలోనికి సాగిపోయి కేరుకుంటాం. మళ్లీ విశ్వం మేల్కొనగానే దాన్ని మా విడని కౌగిల్లో యిముడ్చుకొని శ్రావ్యగీతుల లాలించి తేలిస్తాం. ఇదే మా ఎడలేని ఆట; తేటిపాట.

నిముసము నిన్ను వాయకనె నెయ్యముఁ జూపి యొకింత సోఁకు లో
పముఁ గలుగంగ నీయక శోకభాగమునందును, ముద్దుఁ గొంచు నం
కమున వసింపఁ జేసి నిజనందనుఁ డీవ యనంగఁ జెల్లు సం
భ్రమముఁ గని నిన్నుఁ బెంచును, మమత్వముఁ జెందును సీమకుక్కరో!

పుసుపుఁ గ్షాళనంచు నరుణోదయమున నిత్యస్నానమున నిన్నుఁ దనుపువారు
గొలుసులు కంఠమాలలుగ వైచి భూషించి పేర్వెట్టి ముద్దుగాఁ బిలుచువారు
వండినమాంసముం బాలు న్వాలు మేఁపి బిసకట్లు సంజులం బెట్టువారు
తమ పిల్లలకుఁబోలె నెమకుమఁ దగినట్టి దాంపత్యమును గూర్పఁదలఁచువారు
"ఆత్మవత్సర్వభూతాని" యనెడిసుద్ది యొక్క నీపోషకునియందె నిక్కమయ్యె
నహహా! నినుఁబోలు సుకవాసి మహినిఁ గలఁడె?-అభిజాత్యగౌరవము సొమ్మురయ నీకు!

సీమఁబుట్టువారె చిత్రపు మర్యాదలందువా రటంచు పెందరఁగాని
సీమఁబుట్టకున్న, సీమసంకరజాతిఁ-బుట్టియుకఁ బదెంతో బెట్టునేయు.

పోలేవా నీదారినిఁ-జూలలిని నీడ కిందు పోలెడివాపై
నేలా టొలన్ దుష్వదు-బాలా! నీచెయ్యి యుండఁబట్టునదర? ఖలా!

గతభవంబున దారుణం గాచి కాచి-దద్దుసం బంధులం జంపి దోఁచి సొమ్ము
లపహరించితి మేము సుఖ్మపుడు మాకు-దాగుణపుచావుఁ దిరిచి ధాత వ్రాసె.

ఇల మమ్ముఁ బోలువా రెవ్వగున్నారు?-మనుభక్తుకుఁడ! నీవ మమ్ముఁ బోలెదవో?
కానంత భేదంబు కలదయ్య మనకు-నీనుఁ జెందఁగఁబోకు మెఱ్ఱఁగింతు వినుమ
ఉంచియుంగ దండిగా నొకనాఁడుఁ దినవు-యొండుచు నుంటి మొక్క్యాడఁ దిండి లేక
మాటాడఁగలనంచు మనుఁజుఁడా నీవు-గోఁటు నేనెదవు, తక్కువ సుమ్మీ మాకు
నరసింహులముగాము, నరులముఁగాము-శరిచైగులముఁగాము గ్రామసింహులము
పలయుఁ "కృతజ్ఞ"మన్ పే రొక్కమాకె-యిల సంస్కృతనిఘంటువే ప్రమాణంబు
ఘనతరవిశ్వాసఖనులము మేము- కనరాని విశ్వాసఘాతుకులు మీరు
"ఛీ" యన్న మెండుగా సిగ్గుండు మాకు-"నీ" యన్న నేమన్న సిగ్గున్నె మీకు ?
వినుఁడీ మా మొఱ, నీనులఁ-గనుఁడీ, యికనైన మాకుఁ గరుణానిధులై
"మెనుతుము, సుఖముంతుఁడు మీ"-రని యభయ మ్మిదుఁడు కడు రయమ్మున మీరల్,

...చూస్తున్నాను నీతో మాట్లాడాలనీ.
...రా చద్దన్నం తింటారు కనక నువ్వు పొ
...వుకదా అని నేనూ అలాగే వొస్తున్నాను;
నువ్వెప్పుడూ తారసపడలేదు. ఎప్పుడేనా యిద్దరమూ వొక్కమాటే రావడం తటస్థించినా యెవరో వుంటూ వుండడం చేత మాట్లాడకుండా వూరుకుంటూ వెళ్ళిపోతూవచ్చాను. ఇవాళ లేచిన ముహూర్తం మంచిది."

"వొక్కమాటేనా చెప్పారు—"

"మళ్ళీ మీ రంటున్నావే"

"ఇంకా నలగలేదు కాదుటే?"

"ఎప్పుడేనా వొంటిగా దొరక్కపోతావా అని వూరుకుంటూ వచ్చాను. ఇవాళ దొరికావు."

"నిన్ను చూసినప్పుడల్లా మాట్లాడాలని నాకు కూడా తోస్తూ వచ్చింది. ఏమిటో సాహసించలేక పోతూ వచ్చాను. నీ మొగం చూశాటప్పటికి యెక్కడో చూసినట్టూ, కొన్నాళ్ళు కలిసి వున్నట్టూ,— యేమిటో మనస్సు వురకలు వేసుకువచ్చేది."

"దృఢమైన ఋణానుబంధం యేదో వుంటే మనకి. వెనకటి జన్మలో యిద్దరమూ వొక్క కడుపున పుట్టి వుంటాం."

"అలాగే తోస్తోంది."

"అదిగో ఆ బ్రాహ్మడు వెళ్ళిపోతున్నాడు నీళ్ళు పోసుకుందాం రా మరి."

"పద."

## ౨

ఏనుగున్నలాగ ముందు రంగనాయికమ్మా, హంసపిట్టలాగ వెనకాల జానకమ్మా బిందెలు బుజాల మీద వేలాడవేసుకుని బయలుదేరారు. హఠాత్తుగా కలిసిన యీ స్నేహానికి ఆశ్చర్యమూ, యెక్కడా వనుకు లేకుండా వొక్కమాటే — వొక్క క్షణంలోనే పెనవేసుకుపోయిన యీ చుట్టరికానికి ఆనందమూ, యీ రెండూ సమానంగా మిళితం అవడంచేత కొత్తగా పుట్టిన సునుసిగ్గుదొంతరలూ — యీ మూడూ కలిసి ఆయిద్దరి మొగాలమీదా నృత్యం మొదలుపెట్టాయి. అంచేత చివరి పావంచామీదకి వెళ్ళేదాకా రంగనాయికమ్మ వెనక్కి తిరిగి చూడలేకపోయింది. జానకమ్మ పలకరించలేకపోయింది. అప్పుడేనా అవి మూడూ యింకా గుబగుబ పొంగిపోతూ వుండడంచేత అతిప్రయత్నంమీద అడచుకుంటూ, అటూ యిటూ చూస్తూనే బిందెలు పావంచాల మీద పెట్టి, చెర్లో దిగి, గుండెల లోతుకి వెళ్ళి, కంఠాలదాకా నీళ్ళలో మునిగి, మళ్ళీ కబుర్లందుకున్నారు.

"వొక్కమాటు కౌగలించుకోనివ్వవుటే చెల్లీ?"

"ఊఁ."

జానకమ్మ యిలా అంటూ చేతులు చాపగా రంగనాయికమ్మ బ్రహ్మానందపడిపోయి, "యెవరేనా చూస్తున్నారేమో బాబూ" అని నాలుగువేపులా చూసి జంకుతూనే గభీమని ఆమె కౌగిటిలో చేరి గట్టిగా—ఆత్మలు పూర్తిగా కలిసిపోయేటంత బింకంగా నొక్కింది. జానకమ్మకూడా అలాగే చేసింది.

ఆ స్థితిలో వారిద్దరూ కామమూ ప్రణయమూ కలిసిపోయినట్లూ, సౌఖ్యమూ ఆనందమూ ఏకావు అయిపోయినట్లూ, స్వర్గమూ మర్త్యలోకమూ మిళితమైపోయినట్లూ, జీవాత్మ పరమాత్మ ఐక్యం అయిపోయినట్లూ వున్నారు. ఇలాగ వొక్క—కేవలమూ వొక్క క్షణకాలం మాత్రమే వున్నారు. వుద్రేకక్షణంయొక్క ప్రారంభంలోనే విడిపోయి వొకరికొకరు గజం దూరంలో నిలుచున్నారు. ఇద్దరికళ్ళల్లోనుంచీ ఆనందబాష్పాలు జాలువారి ఆపల్లెటూరి చెరువులో అంతర్భూతమై త్రివేణీసంగమస్థానం కంటే దానికి పావిత్ర్యం సమకూర్చాయి.

తరువాత "యేడుపు వస్తోందే చెల్లీ!" అంటూ రంగనాయికమ్మ కళ్ళల్లో నీళ్ళు పెట్టుకుంది. మాట్లాడలేక—బాష్పవిస్ఫురణంచేత చూపుకూడా సరిగ్గా చూడలేక జానకమ్మ తలవూపింది. ఇద్దరి పెదవులూ

రావిరేకల్లాగ అల్లల్లాడిపోయాయి. ఇద్దరికంఠాలు రుద్ధస్వరా లయిపోయి శరీరాలు గరిపొడిచాయి.

"చెల్లీ ..."

"...ఏం...అక్కయ్యా?"

"ఈ దయ...యీ...అనుగ్రహం......బతికి ఉన్నంత...కాలమూ..."

"అదేమి...టే...అ...క్కయ్యా...అలా.... అంటావు?"

"ఏదీ చేతిలో చెయ్యివెయ్యి"

మాట్లాడకుండా జానకమ్మ చెయ్యి చాపింది. ఇద్దరూ వొకరిచెయ్యి వొకరు గట్టిగా పట్టుకున్నారు.

ఈసమయంలో వొక శూద్రస్త్రీ యెవరిమీదో రుంజుకుంటూ వచ్చి గబగబా బిందె ముంచుకుని వెళ్ళిపోయింది.

"నీతో మాట్లాడా లనీ, నీతో స్నేహం చెయ్యా లనీ, నిన్ను 'చెల్లీ' అని పిలిచి, నీచేత 'వొసే అక్కయ్యా' అని పిలిపించుకోవా లనీ నేను తల్లడిల్లిపోతున్నాను. నువ్వు తారసపడినన్నీ నీతో మాట్లాడ్డానికి వీలు లేకపోయినప్పుడల్లా నాహృదయం దహించుకుని పోయేది. తల తిరిగిపోయేది. కాళ్లు వణికిపోయేవి. ఈజన్మకి యీసుఖం — యీ ఆనందం — యీ సౌభాగ్య మేనా కలగ దేమో నని యింటికి వెళ్లాక తల నొప్పి వచ్చిం దని వంక పెట్టి వొక్కత్తినీ గదిలో కింద పడుకుని కుమిలికుమిలి యేడ్చేదాన్ని"

"......................"

"ఎవరితో చేనా యీ దుఃఖం వెళ్లబోసుకుంటే కొంత భారం తగ్గివుండును; గాని నోరు విప్పడానికి యిష్టం లేకపోయేది. విప్పలేకే పోయేదాన్ని"

"......................"

"ఇలాగ వున్నదుఃఖం వున్నట్లే వుండగా కొత్తదుఃఖం వచ్చి గుండెలకి యెగతన్నింది...చెల్లీ! చెబితే నువ్వు నమ్మవు. నటన అని కూడా అనిపిస్తుంది; కాని నేనొక్కొక్కప్పుడు తలుచుకుని తలుచుకుని మరణవేదన—జ్ఞాపకం వస్తే...ఏమవు..."

"................."

"నువ్వు గూడా యేడుస్తున్నావే. యేడవకమ్మ! యెవరేనా చూస్తే—యేది యే మైనా నువ్వు నాకు చెల్లెలివైనావు. నన్ను అక్కగా అంగీకరించావు. ఇలాగేనా దుఃఖం మరిచిపోవడానికి—నీ సుఖమూ, నీ ఆనందమూ—నువ్వే నే నని తృప్తిపడడానికి ఈశ్వరుడు మార్గం చూపించాడు."

ఈ సమయంలో మళ్లీ ఒక దేవాంగియువతివచ్చి "వేసంకాలం అయితే మాత్రం వలివెయ్యాడం లేదుటండీ మీకూ?" అంటూ బిందె ముంచుకుని జవాబుకోసం చెవులు వెనక్కి వొరచేసుకునే కాళ్లీడ్చుకుంటూ వెళ్ళిపోయింది.

"ఇవాళ యేకాదశి" అంటూ రంగనాయికమ్మా, "నిన్ననే స్నానం" అంటూ జానకమ్మా జారుముడులు విప్పేసి పల్లెవాడు వల వేసినట్లు కేశపాశాలు నీటిమీదికి విసిరేశారు. దానితో చెరువంతా నాచు కమ్మేసినట్లయిపోయింది. అంత లోతులో వుండినన్నీ యిద్దరూ చేతులతో నీళ్లు చల్లుకునే స్నానాలు చేసి అతికష్టం మీద మళ్లు వేసుకున్నారు.

"అసలు ముదట నన్ను నీ మొగుడికి యివ్వడానికి నిశ్చయం అయింది."

"యెందుకు తప్పిపోయిందీ మరీ?"

"నా అదృష్టం మంచిది కనకా"

"అంటే?"

"నేను మోడునై పోయినా అతన్ని కళ్లతో చూసుకుని ఆనందించడానికేనా పెట్టిపుట్టాను కనకా. పెద్దదాన్ని కాకుండానే నాకు ముగుడు చచ్చిపోయే యోగం వుంది. పై సమ్మంధం అయింది కనక అతను బతికాడు. దుఃఖం బాగా యెరగనప్పుడే నేనిలా అయిపోయినా పక్కపాపిడి తీసుకుని కండువా జందెప్పెట్టుగా వేసుకుని అత నలా నడుస్తూవుంటే

"అదృష్టవంతుడు కనక నేను తప్పిపోయాను" అనుకుని ఆనందిస్తూ వుంటాను."

"ఆసమ్మంధం వొల్లకా దనలేకపోయావా?"

"రెండు రోజులు మా అమ్మదగ్గిర యేడ్చాను. 'నే చెబుతా కాదూ? వూరుకో అమ్మా' అనేది మా అమ్మ. ఇంతకీ యోగం లేకపోయింది."

"........................"

"నువ్వు గృహప్రవేశానికి వచ్చి వూరేగుతూ—పల్లకీ మావీథిలో ఆగినప్పుడు అమాంతంగా పల్లకీలోకి దూకి నీపక్కని కూచోవాలన్నంత సరదా వేసింది నాకు."

"........................"

"నువ్వు తొలీమాటు కాపరానికి వచ్చినప్పుడు ఎన్నో విధాల ప్రయత్నించాను; కాని కనపడ్డావు కావు."

"........................"

"నెల్లాళ్లకిందటే నువ్వు మలిమాటు వచ్చినా యిప్పటి—యీక్షణంగాకా యోగం లేకపోయింది చూశావా?"

"అవు నవును"

ఇలా చెబుతూ చెబుతూ రంగనాయి [illegible] ప్రాప్తుగా వాకిలికేసి చూసి, వులిక్కిపడి, "అదిగో మా పెద్దన్నయ్య కాబోలు వస్తున్నాడు" అని లేచి, "దయ వుంచవే చెల్లాయీ" అంటూ వొసంచాల మీద వున్న బిందె తెచ్చుకుని నీళ్లు ముంచుకుని "మళ్లీ రేపూ కాస్త ఆలస్యమైనా వుండాలి సుమా" అంటూ మాట వినిపించుకోకుండా చక్కా పోయింది. అది చూసి అప్రతిభమై "వెళ్లిన్నయ్య వాస్తే నేమిటా?" అని తర్కించుకుంటూ జానకమ్మ నిలబడగా—రంగనాయి కన్నఅన్నగారిని బెదిరి బెదిరి చూస్తూ వెళ్లిపోతుంది.

## 3

ముందువా వాకిట్లో పడకకుర్చీలో పడుకుని పార్వతీశం యేదో ఆలోచించుకుంటూ వుండగా చెరువు నుంచి తడిబట్టలతో వచ్చిన జానకమ్మ బిందె బుజమ్మీదే వుంచుకొని చిరునవ్వు నవ్వుతూ యెదుట నుంచుంది. యోచనాన్యగ్రుడై వుండడంచేత అతను మొదట, ఆమె అలా నించునివుండడం గమనించలేదు; గాని హఠాత్తుగా చూసి కుర్చీలో సరిగ్గా కూచున్నాడు. పదిహేడేళ్ల పిల్లయినా సలాకలాగ బక్కపలచని మనిషి కనక కుంచెడు తప్పేలా బరువుకే ఆమె వూగిసలాడిపోతోంది. అది చూసి అతను మందహాసం చేస్తూ "చాలా బరువులు కలిగాయి పాపం. బిందె యింట్లో దింపి రారాదూ అంత పని వుందేమూ?" అని అడిగాడు. ఈ మాటతో ఆమె ముఖానికి కొత్త అందం వచ్చింది; గాని దానికి జవాబు చెప్పక అలాగే నుంచుని, అలాగే మందహాసం చేస్తూ "మీ కెన్ని సమ్మంధాలు వచ్చాయండీ మొదటా?" అని బదులడిగింది.

"అ దేమిటి?"

"చెబుదురూ."

"అంటే?"

"వినపడలేదూ?"

"అర్థం కాలేదు."

"[illegible]"

"అర్థ[illegible]"

"[illegible] పిల్లనిస్తా [illegible]?"

"[illegible] వచ్చినా వచ్చినవ [illegible]ందరూ వొక్కొక్క పిల్లనే యిస్తామన్నారు; కాని—"

"కాని మాట అడగలేను నేను."

"అయిన మాటే చెబుతున్నాను. అయితే—"

"అయితే గియితేల [illegible] అవసరం వచ్చిందీ యిప్పుడేనా?"

"నేనూ అదే అనుకుంటున్నాను. ఏంపని—"

"పనుంది."

"ఏమిటో?"

"అదంతా మీ కెందుకూ ?"

"......................"

"చెప్పరూ ?"

"నువ్వు చెప్పావా యేమిటి ?"

"దాచుకోండి"

"......వెళ్లిపోతా నేం ! చెబుతా రా పాపం."

"అ-క్క-ర్లే-దు."

ఇలా అంటూ ఆమె వూసలాగ యింటోకి జారిపోయింది. వెనక్కి తిరిగి చూడ నేనా చూడ లేదు.

ముఖంమీద అంకిత మైన అసంతృప్తి, నడకలో ప్రత్యక్ష మైన మనస్సూ చూసి పార్వతీశం గాభరా పడ్డాడు. "కోపం తెప్పించాను" అని అతను కించ పడ్డాడుకూడాను. నిజానికి జానకమ్మ మాటకారే; గాని వుపసంహారంలో కలసిన మాటలెప్పుడూ వాడదు. అసలు సంగతి దేనేనా పూటే సూటిగానూ, స్పష్టంగానూ, మృదువుగానూ, మితంగానూ అడుగుతుంది; గాని అదే పని గా పట్టుకుని వేళ్లాడదు. కోరింది చెయ్యక పోయినా ధుమధుమ లాడదు.

ఈ సంగతి అతనికి బాగా తెలుసు. అయినా పాపం అ దేదో అర్థం చేసుకోలేకుంటాడు; కనక అతను ధోరణి అలా ... ఉంటుంది. ఇప్పుడూ అలాగే జరిగింది. తీరా జరగవలసిన తరవాత యిక నేను ఉంటే మాత్రం యేం లాభమూ ? ఒక్క క్షణం అతను ప్రతిభుడై అలాగే కూచున్నాడు. వుత్తరక్షణంలో గభీ మని లేచి "ఈ కోపాన్ని బలపడనివ్వకూడ" దంటూ వంటింట్లోకి బయలుదేరాడు.

మూడగా తలుపు వేసివుంది. పిలవగా "పొత్తు పంచె కట్టుకుంటున్నానండీ" అని బదులు వచ్చింది. అది విని మాట్లాడకుండా మస్యమస్య గోళ్లం కదుపుతూ అత నలాగే నుంచున్నాడు.

మళ్లీ అతను కత్తు కలపడానికి వచ్చాడని ఆమెకి తెలుసు. అయినా బతిమాలినకొద్దీ బిర్రబిగిసే రకం కాదు. కనక పనికాగానే ఆమె తలుపు తీసి "యేం!" అంది.

"నువ్వడిగింది చెప్పడానికి."

"నేనే మడిగానూ ?"

"సోది అడుగుదామా ?"

"......................"

"పాపం నేనే వేస్తానులే."

"సాయిబ్బు మండిపోతోంది. మీతో మాట్లాడుతూ కూచోడానికిప్పుడు వీలా ?"

"మండీ సాయిబ్బుమీద తవ్వెడుగిన్ని పడేస్తే ఆరెంటికూ కలిసి నీళ్లతో తన్నుకుంటూ వుంటాయి. ఇక మన పని మనం చేసుకోవచ్చు."

"ఇంకేమీ పని లేదూ ?"

"ఇది పని కాదూ ?"

"నాటిపోయింది కదూ ?"

"వెనక్కి లాగేద్దాం. మనకి చేత గాదా యేమిటి?"

"వెనకటిది ముందూ ముందటిది వెనకానా ?"

"అదో అందం."

"శాబాసు."

"సొగసా టన్న - అందరికీ వస్తుంది. అంత కత్తులమీద పరీక్ష—"

"ఎవరు చేశారూ ?"

"క్షనే కనక క్షమించు."

"......................"

"నువ్వలా చూశా వంటే నాకు గుండెలు దూసుకుపోతాయి"

"బాగానే వుంది"

"అయితే యిక తరువాతుమాట ఏమి? తడిబట్ట ఆరేసి వస్తావా, యీమాట కూడా తప్పులా నే చేయిస్తా...?"

దీనికామె బదులుచెప్పక ఒక్క నిశితకటాక్షం విసిరేసి, యెదటి గోడదగ్గిర పీట పరిచి, "కూచోండి" అని మాత్రంచెప్పి దొడ్లోకి వెళ్లిపోయింది.

## ౪

ఆమె మళ్లీ వచ్చేటప్పటికి పార్వతీశం" కథ యెలా మొదలుపెట్టనూ ?" అని ఆలోచించుకుంటు న్నాడు. అది తేలకుండానే ఆమె వచ్చి, పొయికి సమీపంగా చిన్నపీట వేసుకొని కూచుని, "మరి చెప్పండ దేమిటోను" అంది.

"మొదట వరసగా అయిదుగురు పెద్దమనుష్యులు నాకు పిల్లనిస్తా మని—"

"అయిదుగురూ వొక్క పిల్లనే ?"

"బహులా నేర్చుకున్నావూ ?"

"పులు కలాం వుంటుంది కాబోలు."

"తప్పకుండానూ. ఎవరికీ అంతే కాదూ ? మరి తరవాతి కథ విను."

"ఆ అయిదు సమ్మంధాలూ యెందుకు తప్పేనాయీ ?"

"వొకటి మా నాన్నకి నచ్చలేదు. వొకటి మా అమ్మ వొప్పుకోలేదు. వొకటి లాంఛనాల దగ్గిర ఆగిపోయింది. వొకటి నాకు నచ్చింది కాదు. వొకటి అంతా సిద్ధమయినిన్నీ మా నాన్న హఠాత్తుగా చచ్చి పోవడంచేత దాటిపోయింది."

"మా నాన్న చచ్చిపోతే ముహూర్తం మారిపోవాలి; గాని సమ్మంధమే దాటిపోవడం యేం ?"

"పిల్ల కట్టుబొట్టు వుండడంచేత మరో ముహూర్తం వెంటనే కావా లన్నారు వారు. సంవత్సరమధ్యలో మావాళ్లు పనికిరా దన్నారు. కాదైతే ఆలోపుగా వారూ చెయ్యలేకేపోతారు పెళ్లి; గాని అంతలో వారికి వాయిదాంచేత నెలకళా వున్న మరో సమ్మంధం మాట్లాడుకున్నారు"

"పెళ్లి దాటిపోవడమూ, పరీక్ష పోవడమూ—"

"అవు నవును. మా నాన్న పోవడంచేత పెళ్లి తప్పిపోయింది. పెళ్లి తప్పిపోవడంచేత పరీక్ష పోయింది."

"అంత బెంగెందుకూ ? పెళ్లికోసమా ? ఆపిల్ల—"

"ఆ పిల్లకోసమే. ఆసమ్మంధం కుదిరినందుకు మొదట నేను వెయ్యినుంది దేవుళ్లకి మొక్కుకున్నాను. తప్పిపోయినందుకు తరవాత చాలారోజులుదాకా మతి పోయి—"

"అంత యిష్టమా ఆపిల్లమీద ?"

"ఆరోజుల్లో మాట అది"

"ఇప్పుడో ?"

"ఈమాట నువ్వెందు కడుగుతున్నావో తెలుసు. అయితే నేను నిన్ను మోసం చెయ్యడం లేదు. ఇప్పుడు నీమీద యెంత యిష్టమో, అప్పు డాపిల్లమీద అంత—"

"యెలా తిరిగిపోయిం దంటి ?"

"కోరిం దల్లా సమకూడడానికి మనం దేవతలం కాము. అవుతుం దంటే ఆశపడ్డాను. కా దంటే బెంగ పెట్టుకున్నాను. ఆ ఆశ యెలా పోయిందో అబెంగా అలాగే—"

"మగాళ్లంతట్లో తప్పేసుకుంటారు కాబోలు మనస్సు ?"

"తప్పేసుకుంటారంటే—ఇప్పటికిన్నీ—"

"అక్కర్లే దక్కర్లేదు. తరవాతి కథ—"

"నే నేమేనా దాస్తున్నానా ?"

"నే నా మాట అన లేదు. తరువాతి కథ చెప్పండి. మీరు తప్పిపోయినందుకు ఆపిల్ల యేం చేసిందో—"

"నా కంటేనూ ఘోరం చేసింది. ముహూర్తం దాటిపోయినందుకు బెంగపెట్టుకుంది. మరో సమ్మంధం కుదిరాక నాలు గుపవాసాలు చేసింది. పెళ్లిలో వొక్కమూ టేనా పీటమీద సంబరపడుతూ కూచో లేదుట."

"ట"

"టా కాకపోతే నేను చూశానా ? అలా చెప్పారు చూసినవాళ్లు. వూళ్లోవాళ్లంతా చాలా వుద్దారంగా చెప్పుకున్నారు కొన్నాళ్ల దాకానూ."

"ఏమనీ?"

"ఆపిల్ల ఆపిల్లాడితో కాపురం——"

"పెళ్లి అయిన తరవాత యేం జరిగింది?"

"తరవాత కూడా ఆపిల్ల మనస్సు నామీంచి నుంచి తప్పిపోలేదు."

"ఎలా తెలిసింది?"

"ను వ్వొక్కడికి మానుగుడుపులకి వచ్చినప్పుడు, తెల్లవారగట్ల ప్రయాణం అనగా రాత్రి నీకు మల్లె మొగ్గల దండ వేశాను జ్ఞాపకం వుందా?"

"వుంది. అప్పుడు నా దగ్గర మీ వేలు తగిలి వొళ్లంతా గరిపొడిచింది."

"ఇంక నేమీ? అదంతా ఆపిల్ల పంపించినదే. తరవాత చెప్పింది నాకు మా సుబ్బత్త కూతురు."

"ఊహూ"

"మరో మాటు——అనగా నువ్వు మా అక్క కూతురు బాలసాలకి వచ్చినప్పుడు మళ్లీ బుట్టెడు గులాబీపువ్వులు పంపింది. నీకు పంపేశాను"

"అయ్యో"

"నీకు గులాబీపువ్వులు——అసలు పువ్వు లంటేనే సంబరం అని తెలుసు; కాని ఆపిల్ల అలా చేసినట్లు తెలిస్తే వాళ్లవాళ్లు వూరుకుంటారా? సమ్మంధం తప్పి పోయాక మా కు మాటలు కూడా పోయాయి"

"తరవాత యెప్పుడేనా మీ రా పిల్లతో మాట్లాడారా?"

"లేదు"

"ఆపిల్లేనా——"

"చాలా మాట్లు ప్రయత్నం చేసింది. తప్పించు కున్నాను. వొకమాటు సాహసించి యేదో వేళాకోళం చేసింది. బదులు చెప్పడం మానేశాను"

"ఎంత చిన్నబుచ్చుకుందో పాపం"

"కావచ్చు. కాని దానికీ నాకూ యింకేం సమ్మంధమూ?"



"ఎంత తీసేసుకున్నా అది మీ పెళ్లామే"

"నిజానికంటే. దానికి జరిగింది రెండో పెళ్లే"

"ఇంకేమీ?——"

"కాని లోకం మాట చెప్పు"

"లోకం సంగతి పోనిస్తురూ. ఆపిల్లపేరే మి టి రూ?"

"రంగనాయిక."

"మీకు బాగుందా ఆపేరు?"

"నిక్షేపం——"

"నా పేరుకంటే నెయ్యిరెట్లు బాగుంది కదూ! మావూళ్లో——"

"మీ దే వూరూ?"

"తిరుపతి. మా వాళ్ల వూళ్లో మాయింటికి——కాదు కాదు. మా వాళ్ల యింటి దగ్గిర వొక పిల్ల వుంది"

"వుంటే?"

"దాని పేరు రంగమ్మ"

"అయితే?"

"రంగనాయికమ్మ అని పిలిపించుకో మని యెన్నోమట్లు చెప్పాను దానికి."

"పేరు మంచిదే. రూపం కూడా సాటి లేనిదే. వైధవ్యం వచ్చినా యిప్పుడు కూడా ఆమె చాలా అందంగానే వుంది."

"బూడిదలో పోసిన పన్నీరూ. ఏం లాభమూ? అయితే తరవాత మీ కెప్పుడేనా కనపడిందా?"

"లక్షమాట్లు——"

"మీరు కనపడ్డప్పుడు దాని ముఖం——"

"నేను చూశానా?"

"వేశారు కప్పదాటు."

"ఏం?"

"పోనీ మీ కెలా వుండేది చెప్పండి?"

"ఎప్పుడేనా అయ్యో——"

ఎప్పు డేనానా? నిజం చెప్పండి."

"వొట్టూ"

"వొట్టు వద్దు. పాపం అది యెంత దుఃఖిస్తోందో?"

"ముగుడు వచ్చిపోతే దుఃఖం కాదూ?"

"తప్పు తప్పు వోగాయిత్రీ మాట లనకండి."

"నీ ధోరణి యిలా వుందేం జానకీ యివేళ?"

"ఆడవాళ్ల బాధలు యింతేనే కదా?"

"చెప్పవూ?"

"పాపం పీరేళ్లి గంగారు—"

సరిగ్గా యీసమయంలో యెవరో వచ్చి పిలుపు మీద పిలుపు పదినాట్లు పిలిచారు పార్వతీశాన్ని. చేసేది లేక "ఎవరు వా" రంటూ అతను లేచి వెళ్లి పోయాడు. వొక్క క్షణందాకా జానకమ్మ స్తబ్ధ అయిపోయి అక్కణ్నుంచి కదల్లేకపోయింది. కొంతసేపటికి వచ్చిన మనిషి భర్తకేపు చుట్టం అని గ్రహించి ఆగిన్నె రెండింటేసి మూడు సోల గిన్నెతో యెసరు పెట్టింది.

※

తరవాత భోజనాల వేళదాకా ఆ దంపతు లిద్దరూ కలుసుకోలేదు. అప్పు డేనా చుట్టం వుండడం చేత యీ ధోరణి రాలేదు.

రాత్రి కూడా ఆచుట్టం వుండి పోయాడు. పగలూ, రాత్రీ కూడా పార్వతీశానికి చుట్టంతోనే వుండిపోవలసివచ్చింది. రాత్రి పన్నెండు గంటలదాకా మొగుడు వాకట్లోనే వుండడంచేత ఆమె పదిగంటల దాకా కనిపెట్టుకుని వుండి తరువాత యిక వుండలేక నిద్రపోయింది. ఇంట్లోకి వచ్చాక పార్వతీశం లేపనూ లేదూ, తెల్లవారీదాకా ఆమెకి మెలకువ రానూ లేదూ.

ఉదయం అయింది. కాలకృత్యాలూ, గృహకృత్యాలూ—ఇద్దరూ సంసారసాగరంలో పడిపోయారు. ఆసముద్రంలో చుట్టం వొక పెద్ద కెరటం అయి వారి నిద్దర్నీ దూరదూరంగా కొట్టేశాడు.

ఆవేళ మామూలు వేళకి జానకమ్మ కూడా వెతుక్కుంటూనే వెళ్లింది చెరువుకి; కాని పావుగంట ఆలస్యం చేసినా రంగనాయికమ్మ రాలేదు. మర్నాడు కూడా ఆమె రాలేదు. ఆమె సంగతి యెవరినేనా అడుగుదా మంటే అదేం తప్పో? పెద్దవాళ్లని చూసి ఆవేళ రంగనాయికమ్మ వాగు చెప్పకుండా వెళ్లిపోతే ఆమె కేసందేహం కలక పోవును

ఈ రెండు రోజులూ జానకమ్మకి యెలాగో వుంది. ఏదో వస్తువు పోయి ట్టూ, యేదో మరిచి యిన ట్టూ— ఆమె మనస్సు తికమక ట్టయిపోయింది. ఆమె సిగ్గు తోసినంగా వుండడం పార్వతీశం గమనించాడు; గాని "యేం?" అని కారణం అడగలేకపోయాడు.

మూడు రోజులనుంచి వున్న చుట్టం ఆవేళ మధ్యాహ్నం నాలుగ్గంటలకి వెళ్లిపోయాడు. పార్వతీశం సాగనంపుతూ తోవ్వపూడిదాకా షికారుగా కూడా వెళ్లాడు. జానకమ్మ తానుకూడా సాగనంపుతూ గుమ్మందాకా వచ్చి, ఏమిటో కారణం లేకుండా అక్కడే అలాగే నిలిచిపోయింది.

మరో రెండునిమిషాలకి రంగనాయికమ్మ యెక్కణ్నుంచో యింటికి వెళుతూ జానకమ్మ గుమ్మంలో వుండడం చూసి, మొగం యింత చేసుకుని న్నీ చెప్పలేనా వస్తున్నానేమో—చూస్తున్నానేమో అని వెనక్కీ ముందుకీ బెదిరి బెదిరి చూస్తూ "రేపు స్నానం" అని మెల్లిగా అలుగోజా స్వరంతో చెప్పి క్షణమేనా నుంచోకుండా వెళ్లిపోయింది.

రంగనాయికమ్మ కనపడేటప్పటికి జానకమ్మకి కూడా ప్రాణాలు లేచివచ్చాయి. ఆమె చెరువుకి రాక పోవడానికి కారణం కూడా తెలవడం చేత హృదయ భారం కూడా తగ్గిపోయింది; గాని ఆమాట చెప్పడానికామె అంత సంకోచించడమూ, జడుస్తూ వెనక్కీ ముందుకీ చూడడమూ జానకమ్మకి అర్థం కాలేదు. తమ

పుట్టింటివారికీ పార్వతీశానికీ సంభాషణా—చివరికి ముఖావలోకనాలూ లేవు కనుక బాహాటంగా తనతో మాట్లాడ్డానికి జంకుతోం దేమో అంటే అసలు అలాగేనా మాట్లాడ్డమూ, చెల్లీ అనడమూ, నోసీ అక్కయ్యా అని పిలిపించుకోడమూ యెందుకూ?

జానకమ్మ కది యేమీ బోధపడలేదు; గాని రంగనాయికమ్మ స్నేహం విడదీయరానిదిగా కనపడింది. “అక్కయ్య అన్నట్టు వెనకటి జన్మలో వొక్క కడుపున పుట్టామేమో” అని కూడా ఆమె భావించింది. దాని మీద, వొక వూళ్లోనే వున్నా అత్తిళ్లవారికి గర్భశత్రుత్వం వున్నప్పుడు ఇద్దరు అప్పచెల్లెళ్లలాగే అవస్థపడుతూ వుంటారు కాబోలునని ఆమె ఆశ్చర్యపడింది.

* * * * *

ఇక్కడ జానకమ్మకీ, అక్కడ రంగనాయికమ్మకీ కూడా ఆరాత్రి చాలా భాగ మైపోయింది. కళ్లు పొడుచుకున్నా నిద్ర రాదు. ఏమీ తోచదు. ఎంతకీ తెల్లవారదు.

ఇలా వుండగా రంగనాయికమ్మ తనలాగే అచ్చంగా పుణ్యస్త్రీ అయి తనతో సరిగా తన యింట్లో మసులుతూ వున్నట్లు తెల్లవారుజామున జానకమ్మకి కల వచ్చింది. ఇంకా కాస్తసేపటిదాకా మెళుకువ రాక పోతే కల అంతా పూర్తి అయి సంగతంతా బోధపడి వుండును; గాని వొత్తిగిల్లడంలో పార్వతీశం చెయ్యి మీద పడడంచేత మెళుకువ వచ్చి కల అసంపూర్ణంగా తేలిపోయింది.

వెంటనే ఆమె లేచి కూచుంది. ఆమె కేమీ తోచలేదు. చివరికి రంగనాయికమ్మ చూపిస్తూ వున్న మమకారాన్ని తలుచుకుంటూ ఆమె మళ్లీ పడుకుంది.

## ౬

చివరికి తెల్లవారింది. “పందలపాకలో పని వుం” దంటూ ఆవేళ పార్వతీశం అరున్నరకే చద్దన్నం తినేసి సైకిలు ఎక్కి వెళ్లిపోయాడు. మడి కట్టు కోవడం యెలాగా అయిపోయింది కదా అని జానకమ్మ కూడా అప్పుడే చద్దన్నం తినేసింది; కాని యెంతసేప టికీ టైంపీసు అలారం కొట్టదు. అది కాదని యిదీ, యిది కాదని అదీ నాలుగైదు పుస్తకాలూ, వొకటి రెండు మాసపత్రికలూ తిరగవేసింది; గాని దృష్టిలేక అవి నడవలేదు. అందుచేత జానకమ్మ ఆవేళ గదిలో నుంచి నాగట్లో వున్న టైంపీసు దగ్గరికీ, అక్కణ్ణుంచి గదిలోకీ, మధ్యమధ్య వీధిగుమ్మంలోకీ యెన్ని మాట్లు తిరిగిందో లెక్క లేదు.

ఇక్కడిలా వుండగా అక్కడ రంగనాయికమ్మ పని కూడా యిలాగే వుంది. అక్కడ కూడా సూర్యగతి యిలాగే వుంది. యెంతసేపటికీ పాలికాపు సద్దన్నానికి రాడు. దొడ్డిగుమ్మంలోకి వొకమాటూ వీధి గుమ్మంలోకి వొకమాటూ చొప్పున యెన్ని మాట్లు వచ్చి చూసినా బ్రాహ్మణస్త్రీలు స్నానాలకోసం వెళ్లే వాళ్లు వెళుతూ, వచ్చేవాళ్లు వస్తూనే వున్నారు.

“వేళ అయిందో లేదో అని యిలాగ యింటి దగ్గిరే పొంచుకుపోయి వుంటే అది వచ్చి వెళ్లిపోతుం దేమో” అని యెవరి మట్టుకు వారే యిద్దరూ కూడా చివరికి వొక్కమాటే బయలుదేరి పానంచాల దగ్గిర కలుసుకున్నారు. వొకర్ని వొకరు చూసుకునేటప్ప టికి ఇద్దరికీ కూడా ఆనందం తలమునక లైపోయింది. శరవేగంతో వచ్చే రెండు నదులు గభీమని కలుసుకునే టట్టు యిద్దరూ రావిచెట్టుకింద కలుసుకొని బ్రహ్మానం దంతో కౌగిలించుకోబోయారు; గాని చెరువులో వొక ముసలి బ్రాహ్మణస్త్రీ బట్టలు పిండుకుంటూ వుండడం చూసి తెల్లబోయి నాలుకలు కరుచుకుంటూ విధిలేక వెనక్కి తగ్గారు.

తరవాత అక్కడే నుంచుంటే యెవరేనా యేమేనా అనుకుంటారేమో అని పానంచాల మీద కూచుని యిద్దరూ బిందెలు తోమడం మొదలు పెట్టారు. కొంతసేపటికి ముసలమ్మ గంగాస్నానం అందుకుని యెత్తెత్తి కాళ్లు వేసుకుంటూ వెళ్లిపోయింది.

## ౭

అక్కాచెల్లెళ్లిద్దరూ చెరువులో దిగి, గుండెల లోతుకి వెళ్లి, యథాపూర్వంగా గట్టిగా కౌగిలించుకుని మళ్లీ కబుర్ల కందుకున్నారు.

"అతని దగ్గిర నామాట యేమైనా తెచ్చావా యేమిటే చెల్లీ!"

"లేదక్కా"

"వొద్దు వొద్దు. బాగుండదు. కానైతే దీంట్లో యేమీ తప్పు లేదు; గాని—అయినా యెందుకూ?"

"నువ్వేమంటావో అని వూరుకున్నానే"

"పోనీ వోమాటు కదిపి చూస్తావా?"

"ఏమన మంటావూ?"

"ఏమన మంటానా? .........సిగ్గూ నవ్వూ కూడా వస్తున్నాయి......పోనీ మానేస్తే?"

"నీయిష్టం."

"వూరుకో."

"కాని నిన్ను విడిచి వుండడం—"

"నా పనీ అలాగే వుంది. ఈ మూడు రోజులూ నాకు నిద్రాహారాలు లేవు. నిన్న రాత్రి కలగూడా వచ్చింది."

"........................"

"నువ్వూ, నేనూ, అతనూ యెందుకో రాజ మంద్రీ—యెవరో వస్తున్నారే."

ఇద్దరూ మంగాళ్ల మీద నిలిచి, నలుగురు శూద్రస్త్రీలు వస్తూవుండడం చూసి, కొంచెం కొంచెం దూరంగా జరిగి, వొకరితో వొకరికి సమ్మంధం లేనట్టు చెరో వేపుకీ తిరిగి, వొళ్లు తోముకోడం మొదలు పెట్టారు.

శూద్రస్త్రీలు వచ్చారు. వొకామె జానకమ్మనీ, వొకామె రంగనాయికమ్మనీ పలకరించారు. నలుగురూ వెళ్లిపోయారు.

అక్కాచెల్లెళ్లిద్దరూ యెవరేనా వస్తున్నా రేమో అని మళ్లీ మంగాళ్ల మీద నిలిచి చూసి, మళ్లీ దగ్గిరసా చేరుకున్నారు.

"మా యింటి కోమాటు రావుటే అక్కయ్యా?"

"అమ్మయ్యో!"

"ఏం!"

"నీ మొగుడు చూస్తే—"

"చూస్తే?"

"ఇంకేమేనా తరవాయి వుంటుందా?"

"ఏమంటా రేమిటమ్మా?"

"మాట్లాడడు. అంతకంటే యేం కావాలి?"

"నేను మాట్లాడిస్తానే"

"నువ్వు చెప్పినట్టు వింటాడా?"

"వినక యేమ్ చెరువు నీళ్లు తాగుతారూ?

"నిజంగా?"

"చూడరాదూ?"

"నన్ను స్వర్గాని కెక్కిస్తున్నావే చెల్లీ"

ఇలా అంటూ ఆమె జానకమ్మ బుగ్గ తాకింది.

"వారికి తెలవకుండా నువ్వు దొడ్డిదారిని వచ్చి యింట్లో కూచో. వీధిలో యెవరితోనో మాట్లాడు తూ మాట్లాడుతూ కాస్తసేపటికి మంచినీళ్లు కావాలని యింట్లోకి వస్తారు. నేను తలుపు చాటున నుంచుని వుంటాను. వెండి గళాసుతో నువ్వందించు మంచి నీళ్లు"

"బాబోయి"

"ఏమే?"

"ఆమాట వింటేనే కాళ్లు వొణికిపోతు న్నాయి నాకు."

"సింగినాదం కాదూ!"

దీనికి సమాధానం చెప్పకుండా, ముసిముసినవ్వు లు నవ్వుకుంటూ వొక్క క్షణం పక్కకి చూసి, రంగ నాయికమ్మ గంభీరంగా చూస్తూ "అతను గళాసు అందుకోకపోతే నేను చచ్చిపోవాలి గాని వేరో దారి వుందా?" అంది.

"నే నంటాను కాదుటే?"

"........................"

"ఏ మంటావు? రావే. వొక్క మాటు రా. యేం?"

"రావా లనీ వుంది."

"యింకేం? సందేహపడకు. రా. వస్తా ననూ."

"పోనీ వొక పని చెయ్యి."

"ఏమి టదీ?"

"ఇవాళ సుబ్బమ్మ పిన్ని కూతురుచేత మల్లి మొగ్గల దండలు రెండు పంపిస్తాను. వొకటి అతనికి వెయ్యి."

"వేసి?"

"నేను పంపా నని చెప్పి మరీ వెయ్యి."

"వేస్తే!"

"ఏమీ లేదూ? దానిమీద యేం జరుగుతుందో నాతో చెప్పు. నిజంగా—జరిగింది జరిగినట్టు చెప్పాలి సుమా"

"ఇన్ని తికమక లెందుకే?"

"అలా కాదు. నేను చెప్పినట్టు చెయ్యి. అలా చేస్తే అతనికి నామీద దయ వుందో లేదో తెలుస్తుంది"

"దయ వున్నట్టు తెలిస్తే?"

"మా వాళ్లు యేమో చేస్తా రని నా కేమీ భయం లేదు. వాళ్ల లెక్క లేదు నాకు"

"దయ వున్నట్టు తెలిస్తే? ఏమిటో చెప్పు మరి?"

"మీయింటికి వస్తాను"

"నిజంగా? చేతిలో చెయ్యి వెయ్యి"

ఇలా అంటూ జానకమ్మ చెయ్యి చాపగా రంగ నాయికమ్మ ఆ చెయ్యి గట్టిగా పట్టుకుంది.

"నిన్ను సంపుకు తిన్నట్టే. తప్పకుండా వస్తాను. ఈ మూడు రోజులూ నిన్ను చూడకుండా నీ వుండలేక పోయాను. అది తెలిస్తే విడిచి—"

"తప్పకుండా పంపిస్తావు కాదూ?"

"భోజన మేనా మానేసి పంపిస్తాను"

"ఎన్ని గంటలికి?"

"అయిదు. తప్పితే ఆరింటికి"

"వున్న మొగ్గలన్నీ మాకే పంపేస్తే మీ వాళ్లేమీ అనరూ?"

"మాయింటో మొగ్గలు వొక్క టేనా ముట్టుకోను. సుబ్బమ్మ పిన్నిగారి యింటో రోజూకి గంపెడు మొగ్గ లవుతాయి. అందరికీ యిచ్చేయ్యడమే కాదూ మా రత్తిమ్మక్కయ్య?"

"నిన్న మాకూ పంపించింది."

"ఇవాళ నేను పంపుతాను."

"........................"

"రెండు దండలూ నేనే గుచ్చుతాను. అరిటి దొప్పలో పొట్లం కూడా నేనే కట్టి పంపుతాను."

"పంపు."

"గంధంకూడా తీసి పంపనా?"

"నిన్ను మరీ మెచ్చుకుంటారు."

"మెచ్చా?"

"ఏం?"

"చివాట్లు—"

"వూరుకోవే."

"చూస్తావు కాదూ?"

"వింటావు కాదూ?"

"సంయే."

"సంయే."

ఇద్దరూ మళ్లీ వో మాటు ముంగాళ్లమీద నిలిచి చూశారు. దూరాన ముగ్గురు పైకీ స్త్రీలు కనపడ్డారు.

"రోమిట్లు మనలాగే కబుర్లు మొదలేస్తారు. పోదాం రా."

"లే."

"నువ్వు వెడతావా ముందు నేను వెళ్లనా?"

"పోనీ నన్ను వెళ్లనియ్యి."

"వెళ్లు......ఏదీ చెల్లీ యింకో మాటూ."

జానకమ్మ యింకో కౌగిలింత యిచ్చి వెళ్లి పోయింది. గంగనారాయణమ్మ ప్రేమనూనకంగా మిటకలు విరిచి, చిన్నప్పుడు పార్వతీశానికి తనమీద యిష్టం కలిగేట్లు సుబ్బమ్మగారి రత్తమ్మద్వారా తాను పడిన పాట్లన్నీ తలుచుకుంటూ వైశ్యస్త్రీల వైపుకు వెళ్లింది.

౮

"చెవు డెప్పట్నుంచే?"

"నాలుగు రోజుల నుంచి."

"ఇక కళ్లు కూడా మూసుకు పోతాయి కామోసు."

"నా కళ్లు పోవాలని వుందా?"

"నీ కళ్లు పోతే నాకేం వస్తుంది? నా కళ్లే పోవాలి."

"మీ కళ్లు పోయినా రామూ లేమీనీ."

"నవ్వే వస్తుంది పోనేపోతుంది; గాని యివిగో మల్లి మొగ్గల దండలు."

"రోజా యెందు కమ్మా?"

"గంధం కూడా యివిగో"

"సరే"

"తల కూడా నేనే దువ్వాలిట నీకు"

"ఎవ రన్నారుట?"

"ఏం సంగనాచివే!"

"......... ........."

"నవ్వుకని వూరుకుంటావేం?"

"ఏం చెయ్య మంటా వమ్మా మరి?"

"తొరగా కానీ. పిండి కూడా విసురుకోవాలి యింకానూ"

"మాయింటికి [illegible] రండి"

"అమ్మ వాళ్లో మరి?"

"ఆవిడా వస్తారు"

"మరో మాటు వస్తానులే. తొరగా రా అమ్మా. కనిపెట్టుకుంటుంది నేను వచ్చేదాకానూ"

బొట్టుపెట్టే, అనుగుమాని దగ్గిర పెట్టుకుని జానకమ్మ అద్దం యెదుట కూచుంది. వేళాకోళాలూ, వెక్కిరింతలూ చేస్తూ క్షణంలో తల దువ్వేసి, ఆమె మొగం కడుక్కుని వచ్చి కాటుక పెట్టుకోగా బొట్టు పెట్టి "మరి పోతా" నంటూ రత్తమ్మ నుంచోకుండా చక్కాపోయింది

* * * * *

ఎనిమి దయింది. వట్టివేళ్ల చాప లప్పుడే తడపడం చేత కషాయగంధబంధురమై పిల్లగాలి చల్లగా వీస్తోంది. వాషింగ్టన్ లైటు సంసారానంతా వెలుగులో ముంచెత్తేస్తోంది.

"గంధంలో యేమిటో కలిపా వీవేళ"

"చెప్పుకోండి."

"తెల్ల గులాబీ కాదూ!"

"అవునని మాత్రం అన్నానా నేను?"

"............"

"............"

"చేతి కంటిస్తే యెలాగా? బల్లమీద పెట్టరాదూ?"

"పుచ్చుకో గూడదా యేమిటి?"

"అయితే తే మరి."

"మంచులాగ యెంత చల్లగా వుందో?"

"నీమనస్సులాగే చల్లగా వుంది కదూ?"

"............"

"............"

"మీగుణం పోనిచ్చుకోరు"

"నీగుణంమాత్రం పోనిచ్చుకున్నావా?"

"..............."

"ఆలస్యం చేసుకోవడం తప్ప మరేమీ లాభం లేదు"

"మ్రీ"

"............"

"............"

"కొన్నావా యేమిటి? మల్లి మొగ్గలు"

"కొనక్కర్లేకుండానే వచ్చాయి"

"ఎవరు పంపారూ?"

"వో తాయిలం గారు"

"మా రత్తమ్మ వదినేనా?"

"నేవడం ఆవిడే"

"ఎవ రిచ్చారూ?"

"ముహూర్తం దాటిపోగే మొదలే పోయిందీ? ఆవిడా"

"ఏమిటే?"

"సంతోషించారా?"

పార్వతీశం గంభీరంగా చూశాడు. అంతకంటేనూ గంభీరంగా జానకమ్మ బదులు చూసింది.

"............"

"............"

"ఏ మాతుందో యెరుగుదువా?"

"ఇదివరకే అనుకుంటున్నాం మేము 'వోసే చెల్లాయీ' అంటే 'వోసే అక్కయ్యా' అనీ"

"..............."

"బాగుందా?"

"..............."

"మాట్లాడవేం?"

"అదా సంగతీ?"

"మన యింటికి వచ్చేస్తుందిట"

"..............."

"ఏం?"

"చాదస్తమూ కాదు వెర్రీ కాదు నీదీ"

"చిన్నప్పుడెంతో ఆశపెట్టాగట పాపం. వుసురు తగలదూ మీకు? ఆపనా న్నే చెప్పిస్తే జయం కలుగుతుందా?"

"భగవంతుడు చేసినదాని కెవ రేం చేస్తారూ?"

"ఇక ముందు కూడా అలా అని వూరుకుంటారా మరి?"

"నీ సంగతి ఆలోచించుకున్నావా?"

"వంటి పెడుతూ యిద్దరికీ చాకిరీ చేస్తాను"

పార్వతీశం వొక్క క్షణం దిగ్భ్రాంతుడై వుండి, వుత్తరక్షణంలో ఆమెని కౌగిలి పట్టుకున్నాడు. జానకమ్మ ఆ బాహుబంధంలో నిజవునా కరిగిపోగా తామర తూడుకంటేనూ మృదువుగా వున్న ఆమె దేహాన్ని మరింత బిగిగా పట్టుకుని, అరమూసుకుని వున్న కళ్ల మీద అతను ముద్దు లుంచాడు.

## ౬

తెల్లవారింది. వూరికే కాదు. ఇక్కడి జానకమ్మనీ, అక్కడ రంగనాయికమ్మనీ కూడా రాత్రిఅస్తమానూ పక్కని బెట్టి రానేసి మరీ తెల్లవారింది.

పార్వతీశం వెంటనే కాల్యాలు తీర్చుకొని భోంచేసి ఆలారం సరిచేసి, బేరగాళ్లు రాగా బెల్లంతూపించి వెయ్యడానికి గరువుమీదకి వెక్కిపోయాడు. జానకమ్మకూడా అన్నం తిని బీరువా దగ్గరికి చేరుకుంది.

ముందట ఆమె వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్ర తీసింది. వొకటి రెండు పేజీలు చదివింది; గాని చూపు దానిమీద నిలవలేదు. అంతటదాన్ని బీరువాలో పెట్టేసి గాంధిగారి ఆత్మకథ తీసింది. వొక క్షణాని కది కూడా దాచేసి వచనభారతం వుద్యోగపర్వం తీసింది. తరవాత వచనరామాయణం సుందరకాండా, కథాసరిత్సాగరం మొదటిసంపుటమూ, అబలాసచ్చరిత్రరత్నమాల రెండో భాగమూ, రుక్మిణీకల్యాణమూ, గజేంద్రమోక్షమూ—ఇలాగ వొకదానితరవాతవొకటి చొప్పున పైనగస పుస్తకాలన్నీ తీసింది; గాని వొకటీ చదువలేదు.

తరవాత హార్మోనియం దగ్గిర కూచుంది. మొదట నోరు విప్పకుండా రెండుకృతులు వాయించింది. మరో పదినిమిషాలు నోటితో పాడుతూ వాయించింది. అయినా మనస్సుకి ఉల్లాసం కలగలేదు.

దానితో విసుగెత్తి గడియారం చూడగా కృత్యాద్యావస్థవిగా పదినిమిషాలు తక్కువ యెనిమిదయింది.

ఆమె కేమీ తోచలేదు. ఇంతలో జలతారుకి గాజుపళ్లేలా అవ్వీ యిచ్చివాళ్లుగా వొక అర గంట వేసుకపోరాలు చేసి వాళ్లని విసిగించి, తాను కూడా విసిగి, అవతలికి పంపించి చెరువుకి వెళుతూ వొక యింతిరాగా ఆమెని కొసిరికొసిరి అయిదు నిమిషాలు నుంచోబెట్టి యేమిటేమిటో అడిగి, "పదింటికే భోజనం చేస్తే తరవాత యెంత సేపటికి పొద్దుగూకుతుందే మా తల్లీ" అంటూ ఆమెకి సెలవిచ్చింది. ఎంతచేసినా వాకిట్లోకి వచ్చి గడియారం చూడగా యెనిమిదీ యిరవై అయిదునిమిషాలే అయింది.

ఆమె చాలా గొంతైన పిల్ల గనక వూరుకుంది; గాని మరొకతె అయితే గడియారాన్ని కిందికి పెట్టి కొట్టేసి వుండును. అప్పుడామె "రత్నమ్మక్కయ్యైనా రాగూడదూ యిలాంటప్పుడూ?" అనుకుంది. "మధ్యాహ్నం మేనా రాగూడదూ చేగాళ్లూ?" అని కూడా అనుకుంది. చివరికి "రెండు ప్లేట్లు వేసుకుందాం" అనుకుని గ్రామోఫోను దగ్గిర కూచుంది.

జానకమ్మ రెండు ప్లేట్లైనా యేరి యేరి వేసిందో లేదో. అప్పుడు తన యెదుట మరొకళ్లు పాడడం యిష్టం లేనిదానిలాగ టైంపీసు గణగణమంటూ సాగదీసి పదినిమిషాలు అలారం కొట్టింది. వెంటనే ఆమె ఎక్కడివి ప్లేట్లక్కడే అట్టేపెట్టి బిందె భుజంమీద చేలాడవేసుకుని మనస్సులో చాలా తొందరపడుతూ, అడుగులు మాత్రం మెల్లిగానే వేస్తూ చెరువుకి బయలుదేరింది.

అప్పటి కప్పుడే రంగనాయికమ్మ పావంచాల మీద కూచుని మాటిమాటికీ లేచిచూస్తూ బిందె తోముతోంది. వొకరికొకరు కనబడగానే యిద్దరికీ బ్రహ్మానందమైపోయింది.

"ఏం జరిగిందే చెల్లీ?" అని రంగనాయికమ్మ అడగ్గా "నేను చెప్పలేదూ నిన్నా?" అంటూ జానకమ్మ బదులు చెప్పింది. తరవాత జానకమ్మ జరిగిందంతా — మల్లెదండల ప్రస్తావం వచ్చింది మొదలుకుని అక్షరమేనా విడిచిపెట్టకుండా చెప్పింది. "గంధాని కేమీ అనలేదూ?" అని రంగనాయికమ్మ అడిగింది. "అది నువ్వు పంపినట్లు యెరగదు. నేను చెప్పాలేదు సుమా" అని జానకమ్మ చెప్పింది.

వింటూ వుండగా రంగనాయికమ్మ కళ్లలో గిర్రున నీళ్లు తిరిగాయి. పెదవులు వణికిపోయాయి. కంఠం గద్గదికమైపోయింది. ఆస్థితి చూసి జానకమ్మ అప్రతిభ అవుతూ వుండగా రంగనాయికమ్మ యెలాగో తేరిపి చేసుకుని, మధ్యమధ్య అతికష్టంమీద గొంతుకు సవరించుకుంటూ "చెల్లీ! యీజన్మకిక ఆనందం లేదనుకుంటూ వుండగా నన్ను స్వర్గాని కెక్కించావు నువ్వు. నీ ఋణం తీర్చుకోలేను. ఇవి చేతులుకావు కాళ్లు" అంటూ ఆమె చేతులు పట్టుకుని యిక మాట్లాడలేక పోయింది.

ఆస్థితి చూడగా జానకమ్మకి కూడా అలాగే స్తబ్ధత కలిగింది. రెండు నిమిషాలదాకా యెవరూ మాట్లాడలేదు.

తరవాత రంగనాయికమ్మ పైట సవరించుకుంటూ "చెల్లీ! ఇక వెడతానే నేను. మా మరదలు పుట్టింటికి వెళుతుంది భోజనం చేసీ. ఈపాటికి దాని భోజనంకూడా అయిపోయే వుంటుంది. మళ్లీ రేపు—మీయింటికే వస్తాను రేపు యెలాగో వీలు చేసుకునీ. ఏమీ అనుకోకేం? తప్పులు మరిచిపోవేం?" అంటూ గడ్డం పట్టుకుని బతిమాలి, బిందె ముంచుకుని వెనక్కి తిరిగి చూస్తూ వెళ్లిపోయింది. తరవాత జానకమ్మ బయలుదేరింది. రంగనాయికమ్మ దుఃఖమూ, అదీ చూశాటప్పటికి ఆమెకి మనస్సు కలిగిపోయింది.

## ౧౦

సాయంత్రం ఆరవుతోంది. పార్వతీశం బలరామరెడ్డి అనే మిత్రునితో కూడా పొలంనుంచి యింటికి వస్తున్నాడు. సూరావధానులుగారి (రంగనాయికతండ్రి) పెద్దదొడ్డి దగ్గిరికి వచ్చాటప్పటి కొక ముసలిది పలకరించి "రంగనాయికమ్మగారు పిలుస్తున్నారు మిమ్మల్ని" అంది. "ఎందుకూ?" అంటే "ఏమో" అంది. "ఎక్కడుందీ?" అంటే "ఈదొడ్లోనే" అంది. పార్వతీశమూ, రెడ్డీ రెప్పవెయ్యకుండా వొకరికేసి వొకరు చూసుకున్నారు. రెడ్డిముఖంమీద వుత్సాహం కనపడలేదు. "అయినా వెళ్లి కనుక్కొనివస్తా నదేమిటో. ఇక్కడే వుండు" అంటూ పార్వతీశం ముందు అడుగువేశాడు. "జాగ్రత్తసుమండీ" అని రెడ్డి ఆగుమ్మానికెదురుగా వున్న సందులో నుంచున్నాడు.

ముసలమ్మ చెప్పగా రంగనాయికమ్మ యెగిరెగిరి పడుతూ లేచి నుంచుంది గాని పార్వతీశాన్ని చూసాటప్పటికి యెక్కడలేనిసిగ్గూ వచ్చి అలుముకుంది.

"ఎందుకూ రమ్మన్నావుటా?"

"............"

"మాట్లాడవేం?"

"............"

"ఈదొడ్లో మీవాళ్లెవ్వళ్లూ లేరుకదా?"

"లేరు."

"ఎందుకూ రమ్మన్నావూ?"

"ఇప్పటికి నయం వచ్చిందా?"

"నీ దయముందు నా దయ యెంతటిదీ?"

"కోటి సుణీశం. ఇప్పటిదాకా నాకళ్లుమాత్రమే చల్లగా వున్నాయి. ఇప్పుడు హృదయంకూడా చల్లపడింది"

"............"

"ఎంతో ఆశపడ్డాను; గాని అంతా మంచు విడిపోయినట్లు విడిపోయింది. చెల్లాయి అనుగ్రహంవల్ల మళ్లీ ఆశ కలుగుతోంది"

"ఏం చెప్పాలో దీనికి తోచడంలేదు నాకు"

"బెంగ పెట్టుకోవద్దని చెబితే చాలు"

"............"

"పగలెలాగేనా గడిచిపోతుంది. వొక్కొక్క రాత్రి మరీ బాధ — పయ్యెదే ముళ్లు, నాటూ కుట్టినట్లు — యెందుకిలా బతికివుండడం అనిపించేది"

"..... ......"

"పదిరోజులకో మాటేనా మీరు కనపడితే అంతా మరుపొచ్చేది. గాఢాంధకారంలో దీపంలా వుంటుంది మీదర్శనం"

"............"

"గులాబీపువ్వులా విప్పసినా మండుటెత్తి పలకరించావు. అప్పణ్ణుంచీ యిదుమారాతనే. ఇప్పటికి పున్నమి వెన్నెల్లో పడ్డట్టయింది."

"నీ సాహసం చూస్తే ఆశ్చర్యకరంగా వుంది. చాలా గందరగోళం పుట్టొచ్చు"

పార్వతీశం యిలా చెబుతూ వుండగా "ఎవడవురా నువ్వు నా దొడ్లోకి —" అంటూ వొక రంకె వినపడింది. చూడగా వెంకటేశం ఆబోతులాగ మీదికి వస్తున్నాడు. పార్వతీశం పంచె సవరించుకునేప్పటికి మీదే పడిపోయాడు.

రంగనాయికమ్మ తెల్లబోయి వొక్కక్షణం మానుపడిపోయింది.

ఇద్దరూ కూడా మంచి నడివయస్సులోనూ మొమ్మరంగానూ వున్నారు; కనక వెంకటేశమూ, పార్వతీశమూ, సమ్మెటలూ, గుద్దుకుంటూ — ఏనుగుల్లాగ పోరుతున్నారు.

అంతట అది చూసి రంగనాయికమ్మ తానేమీ చెయ్యలేకా, పార్వతీశానికి దెబ్బలు తగులుతూవుండడం చూడలేకా తటాలున తలుపు తీసి వీధిలోకి వచ్చి యెదుట సందు మొదట బలరామరెడ్డి కనపడగా "లోపల కొట్టుకుంటున్నారు" అని గోలపెట్టింది

ఇది వినడమే తడవుగా రెడ్డి దొడ్లోకి వెళ్లి వురిమాడు. అది విని వెంకటేశం జంకగా పార్వతీశం ఆసందుపాట్లో మరో నాలుగు గుద్దులు గుద్ది సాగతీసి వొక తన్ను తన్ని "యిక రా" అంటూ రెడ్డితో కూడా యివతలికి వచ్చి సందులోనుంచి యింటికి వెళ్లిపోయాడు. ఆసందులోనే కాపురం వున్న రెడ్లలో అతని అనుచరులు బలరామరెడ్డి పిలవగా నలుగురు కూడానే వెళ్లారు.

* * *

వెంకటేశం రోజుకుంటూ వెళ్లి జరిగిందంతా చెప్పగా యింటిల్లిపాదీ వులిక్కిపడ్డారు. "లంజముండని తన్నండి రండిరా" అంటూ సూరన్న యెగిరిపడ్డాడు. "నలుగురమూ వెళ్లి సాకిచేద్దాం రండి పార్వతీశంగాణ్ణి" అంటూ రామస్వామి నడుం కట్టాడు. "ఎంత పని చేశాడూ?" అంటూ సూరావధానులు నిశ్చేష్టుడైపోయాడు; కాని భీమన్నశాస్త్రిమాత్రం తొందరపడక తమ్ముళ్లని సద్దించి "విన్నారా?" అని చుట్టూ కూచుని వున్న రయితులతో చెప్పి "మునసబుని తీసుకురా" అని వొక రయితు నంపాడు

అంతటితో వూరుకోక వెంకటేశం "చితకపొడి చేశాను గాడిదకొడుకు" నంటూ యింట్లోకి వెళ్లి ఆడాళ్లకి అంతా చెప్పాడు. "అయ్యో" అంటూ ముసలమ్మ కూలపడిపోయింది. "ఏం పోయీకాలం వచ్చిందీ వాడికి?" అంటూ వెంకటేశం పెళ్లాం సాగతీసుకుంది. "రోజులు గడవాలి. అప్పుడే తీరిందా సంబరం?" అంటూ సూరన్న పెళ్లాం ముగం మాడ్చుకుంది. పెద్ద కోడలు నోరు విప్పలేదు; గాని మూతీ, ముక్కూ ముడుచుకుంటూ అవతలికి చక్కాపోయింది.

వొకనిమిషం అయినాక ముసలమ్మ యింట్లో యేమూలా కూడా కనపడకపోగా వొగర్చుకుంటూ రంగనాయకమ్మకోసం చిన్నదొడ్లో నూతిదగ్గిరికీ, పెద్దదొడ్లో నూతిదగ్గిరికీ పరుగెత్తింది.

నాలుగ్గళ్ల రాత్రి దాకా ఆలోచించి నలుగురు రెడ్లని వెంటబెట్టుకొని వచ్చి పార్వతీశం వెంకటేశాన్ని తన్ని, కుమ్మి, గుద్ది, కొట్టి పారిపోయినట్లు మునసబు బకీరు రాశాడు. ఏదో సూనీకేసుకోసం పోలీసు సూపర్నెంటు లొల్లగ్రామంలో మకాంచేసి వుండడంచేత రాత్రికి రాత్రే బకీరక్కడికి వెళ్లిపోయింది.

౧౧

తన వాలకంచూసి కంగారుపడుతూ వున్న జానకమ్మకి "ముందు మంచినీళ్లు—కాదు పాలు పట్టుకురా" అని చెప్పి పార్వతీశం మంచంమీద వాలగా బలరామరెడ్డి "బాధగావుందా?" అని అడిగాడు. "ఏడెనిమిది గుద్దులు గుద్దాడు. నాలుగైదుమాట్లు కుమ్మాడు. వాటివల్ల యేమీ బాధలేదు; గాని రొమ్ముమీద పొడిచిన పోటుకి మాత్రం కొంచెం నొప్పిగా వుంది ...... డాక్టరుగారింకా వచ్చారుకారేం?" అని పార్వతీశం బదులడిగాడు. సంగతంతా విని జానకమ్మ బెంబేలుపడుతూ వుండగా డాక్టరువచ్చి స్టెతస్కోపుతో పరీక్షచేసి "గుండెలు అదిరాయి, అంతే. ఏమీ బాధకలగదు. భయం వద్దు. మందిస్తాను రండి" అనిచెప్పి బయలుదేరాడు. బలరామరెడ్డికూడా వెళ్లి వ్యవహారం మాట్లాడి మందు తెచ్చాడు.

ఈలోపుగా పార్వతీశం జానకమ్మతో సంగతంతా చెప్పాడు. అది విని ఆమె కళ్లల్లో నీళ్లుపెట్టుకోగా పార్వతీశం మందుతాగేసి వెంటనే లేచి వాకిట్లోకి వచ్చి కుర్చీలో కూచున్నాడు. "తూలిపోతారండీ" అంటూ జానకమ్మ కూడానే వచ్చింది; గాని "యింత మాత్రానికే? వెంకటేశంగాడి రక్కులకే నేను పడిపోతాననుకున్నావా? వొడ్డిమంగలి బాగా బింకంగా వొళ్లుపట్టినట్టుంది. అంతే" అంటూ పార్వతీశం ఆమెనీ, రెడ్డినీ నవ్వించాడు.

"ఏం? నేను తొందరపడ్డానా?" అన్నాడు పార్వతీశం. "తొందరగానే చేరింది. అవిడేనా కనిపెట్టలేకపోయారు. అసలు తోటలోనే వున్నారు వెంకటేశంగారే చెట్టుకిందో?" అన్నాడు రెడ్డి.

"కాని మహా చురుకైనవాడోయి"

"అలా తోచిందా?"

"నిన్ను చూశాటప్పటికి మాత్రం నవనాడులూ కుంగిపోయాయి"

ఇది విని రెడ్డి మందహాసం చేసి "ఛార్జీ యిస్తారు. నన్ను కూడా కలుపుతారు. మొన్ననే పేచీపడివున్నాడు కనక వోబిరెడ్డినీ, పాతపగని బట్టి లచ్చిరెడ్డినీ, కూడా కలపవచ్చు" అన్నాడు.

"అయితే హైకోర్టు చూశా మన్న మాటే"

"మలాగ్గానూ"

"కాని మీరేమీ తొందరపడవద్దు"

"వెంకటేశంగారి నో దబ్బలింపు—"

"వద్దు వద్దు. ఎదిరిఛార్జీ గూడా మనం పెట్టవద్దు. అట్నుంచి నరుక్కువద్దాం"

"అవు నవును; కాని రంగనాయికమ్మగార్ని—"

"అదే బెంగగా వుంది. దాన్ని బాధిస్తారు"

"అసలు సంగతి—"

"మన యింటికి రావడానికి నిమిషాలు లెక్కపెడుతోంది"

"ఇదివరకి చెప్పారు కాకేం ?"

"నిన్న రాత్రే తెలిసింది నాకు. ఈరాత్రి చెబుదా మనకున్నాను నీకు"

"ఇక్కడ—"

"నీకా భయం అక్కర్లేదు"

ఇలా చెప్పి పార్వతీశం జానకమ్మకేసి తిరిగి "యీ పూట వీరింతా భోజనం యిక్కడే" అన్నాడు. "వద్దు వద్దు. యిళ్లలోనే భోంచేసి వస్తా"మని రెడ్డి చెప్పాడు; గాని పార్వతీశం అంగీకరించలేదు జానకమ్మ కూడా "తప్ప"దంది.

మంగలి వెళ్లిన మీదట "ఏమిటిరా బావా యీ అల్లరి అంతానూ ?" అంటూ రత్తమ్మ రాగా "గొడవ అంతా పూర్తి అయీదాకా ఏమీ మాట్లాడవద్దు; గాని నాలుగురోజులు వండిపెట్టాలి నువ్వు" అని చెప్పి పార్వతీశం వాగ్బంధనం చేశాడు. దానిమీద రత్తమ్మ మళ్లీ మాట్లాడకుండా జానకమ్మని తీసుకుని యింటోకి వెళ్లిపోయింది.

మరో అయిదు నిమిషాలికి రత్తమ్మ యిక్కడికో వెళ్లిపోయింది. పార్వతీశం అడగ్గా "సుబ్బమ్మపిన్నిగారిని పంపిస్తుందిట" అని జానకమ్మ బదులు చెప్పింది. పార్వతీశం "యిక్కడికా ?" అని అడిగి, ఆమె "కాదు" అని చెప్పగా "సరే. బాగుంది" అని బలరామరెడ్డికేసి సాకూతంగా చూశాడు.

* * *

రాత్రిపదిగంటలకి పార్వతీశమూ, బలరామరెడ్డీ వాకిట్లో కూచుని ముందు సంగతి ఆలోచించుకుంటూ వుండగా సుబ్బత్త వచ్చింది. "ఏమిటి సంగతి?" అని పార్వతీశం అడగ్గా ఆమె "చేముట్టు సరసం యేమీ జరగలేదు; గాని మొగాళ్లు—సూరన్నా, రామస్వామీ, వెంకటేశమూ తలోమాటా చొప్పున దులిపేశారు. భీముడు మాత్రం యేమీమాట్లాడలేదు. ముసలావిడ నెత్తీ,నోరూ బాదుకుని తనకి తాను తిట్టుకుని వూరుకుంది. "నేను బుద్ధిపూర్వకంగా దాని గొంతుకోశాను. మీ రే మన తలుముకున్నా నన్ననండి" అని ముసలాయన భారం అంతా తనమీద వేసుకున్నాడు. రంగనాయికమ్మ నీకు తగిలిన దెబ్బలు తలుచుకుని కుమిలికుమిలి యేడుస్తోంది. నన్ను తన దగ్గర పడుకోమని ఆపేసిం దది నువ్వేమీ బెంగ పెట్టుకోనక్కర్లేదు" అని బదులు చెప్పి జానకమ్మ దగ్గరికి వెళ్లింది.

నాన్నీ చూడడంతోటే "యేం జరిగిందే అమ్మా" అంటూ గత్తెమ్మ, "అక్కయ్య కులాసాగా వుందా దొడ్డమ్మగారూ?" అంటూ జానకమ్మ వొక్క మాటే అడిగా. అందుకు సుబ్బత్త జరిగిందంతా చెప్పి "రంగనాయికమ్మ యిక నీ మొగం చూడలేనంటోంది. పార్వతీశాన్ని పనిబట్టి తాను కొట్టించినట్లయిపోయిం దని గగ్గోలు పడిపోతోంది నువ్వు అభయం యిస్తేగాని యిక బతకటం అబద్ధం అంది" అని చెప్పి "పోతా, పూటు మాటు ముగిసింది గదా అని దొడ్డిదారినివచ్చాను. దక్షిణపు వసారాలో పడుకున్నాం మే మిద్దరమూనూ" అంటూ లేచింది. అందుకు "అక్కయ్యని విడిచి వుండలే నని

చెప్పండి" అని జానకమ్మ యీ వొక్క మాటే చెప్పి ఆవిణ్ణి సాగనంపింది.

తరవాత పార్వతీశం రెడ్డితో నొంటిగంటదాకా ఆలోచనలు చేసి, అప్పుడు మళ్ళీ అర్ధశేరుపాలు తాగి, గర్రున తేన్చి పడుకున్నాడు.

౧౨

కాలాని కేం పని వుంది? మళ్ళీ తెల్లవారింది. ఎర్రని కిరణాలతో సూర్యుడు సాదుపుకొండమీదికి రాగా, యెర్రని టోపీలతో పోలీసులు వూళ్ళోకి వచ్చారు.

రాత్రంతా గూడుపుఠాణీ చేసిన మున్సబు కరణాన్ని ప్రలోభపెడుతూ సూపర్నెంటుకి యెదురుగా వెళ్లి "యేలినవారు కఠినంగా ప్రవర్తించక పోతే మీరు వెళ్లిపోగానే దొమ్మి జరుగుతుంది" అని చెవిలో వూదాడు "నాలుగు రాళ్లు రాల్తాయి" అని పెద్ద యినస్పెక్టరు మురవగా "మీరు బాగా బిగపట్టాలి" అంటూ హెడ్డుకానిస్టేబులు మూతి బిగించాడు.

పోలీసులు వచ్చినట్లు పార్వతీశానికి గాలికబురు వచ్చింది. "కబురుపంపితే గాని మనం వెళ్లనక్కర్లే"దని రెడ్డి చెప్పగా పార్వతీశం "ఔ"నన్నాడు.

సూరావధాని అరుగుమీద సూపర్నెంటు కచేరీ చేశాడు. వూళ్ళోవాళ్లు చాలా మంది వచ్చారు.

వెంకటేశం, "నలుగురు రెడ్లని (ఫలానా, ఫలానా) వెంటపెట్టుకొని వచ్చి మా పెద్దదొడ్లో పార్వతీశం నన్ను తన్ని, గుమ్మి, గుద్ది, కొట్టి పారిపోయాడు" అని పెద్దన్నగారు చెప్పిన పాఠం దొరకి అప్పగించేశాడు. పెద్ద పోలీకాపు సాక్ష్యం చెప్పడానికి ప్రమాణం చేసి నుంచున్నాడు.

సరిగ్గా యీ సమయంలో "దొరగారు చిత్తగించాలి" అంటూ దమయంతి అంతఃపురంలోకి దౌత్యం కోసం నలుడు వచ్చినట్టు వచ్చి వణికిపోతూ రంగనాయికమ్మ దొర యెదురుగా అరుగుకింద నుంచుంది. అది చూసి అంతా వుబ్బెత్తుగా లేచి నుంచున్నారు. వెంకటేశమూ, రామస్వామీ ఆమె నింటోకి గెంటెయ్యాలని "పద పద" అంటూ వచ్చారు; గాని "దొరగారూ! నన్ను రక్షించండి" అని ఆమె గోలచెయ్యగా, దొర యింగితం కనిపెట్టి పెద్ద యినస్పెక్టరు "రాండి" అంటూ వారి నిద్దర్నీ తోసేశాడు.

"అసలు కథ బైటికి వస్తోం"దన్నాడు దొర. "చిత్తం" అంటూ పెద్ద యినస్పెక్టరు మరో కాగితం తీశాడు. సూరావధాని మొగం వంచుకున్నాడు. భీమన్న శాస్త్రి తెల్లబోగా "కథ యెదురు తిరిగింది" అని మునసబు కుంగిపోయాడు.

అంతా సద్దణిగాక దొర ఆజ్ఞగా రంగనాయికమ్మ యిలా చెప్పింది:

"నన్ను మునపట మావాళ్లు పార్వతీశంగారికి స్థిరపరిచారు. తరవాత మరో సమ్మంధం చేశారు. నా మొగుడనిపించుకున్న పిల్లాడు సంవత్సరానికే చచ్చిపోయాడు. అప్పణ్ణుంచి నా మనస్సు పార్వతీశంగారిమీదే వుంది. వారి యింటికి వెళ్లిపోవాలని నేను దృఢపరుచుకున్నాను. ఈ సంగతి చెప్పడానికి వారు పొలంనుంచి యింటికి వెడుతూ వుండగా చూసి మా పెద్ద దొడ్లోకి పిలిచాను. వారూ, నేనూ మాట్లాడుతున్నాం. ఇంతట్లో మా వెంకటేశం అన్నయ్య వచ్చి వారిమీద పడ్డాడు. ఇద్దరూ సమానంగా కొట్టుకున్నారు. కొంతసేపటికి విడిపించుకొని వారు వెళ్లిపోయారు... నే నిక యిక్కడ వుండను. వారి యింటికి వెళ్లిపోతూ మీ యెదటికి వచ్చి యీ సంగతులన్నీ చెబితే నాకేమీ చిక్కు లుండవని వచ్చాను. నాకు మైనారిటీ వదిలిపోయింది. నాకు నేనే వారి యింటికి వెళ్లిపోతున్నాను. వొట్టి చేతులతో మీ యెదటికి వచ్చాను. నా నగలు మా నాన్న దగ్గిర వున్నాయి. ఇప్పించండి"

దొర, పెద్ద యినస్పెక్టరూ, మునసబు ఎన్ని ప్రశ్నలు వేసినా ఆమె యీ మాటలు తప్పలేదు.

అప్పుడు దొర "తప్పు బకీ రిచ్చినందు కేం చెబుతా"వని మున్సబునీ, "అబద్ధపు వాఙ్మూలం యిచ్చినందు కేంచెబుతా"వని వెంకటేశాన్ని, "నీ కూతురి కేం సమాధానం

చెబుతావయ్యా?" అని సూరావధానినీ టోకాయించి అడిగాడు. అంతా తెల్లపోయారు. చూడ్డానికి వచ్చిన వారంతా కనుబొమ్మ లెగరవేస్తూ తల లూపేశారు.

అప్పుడు భీమన్నశాస్త్రి దొరయెదటికి మెల్లిగా వచ్చి "మా చెల్లెలి కెవరో దుర్బోధ చేశారు. దాన్ని యింటికి తీసుకువెళ్లి మాట్లాడ్డానికి సెలవియ్యండి" అని కోరాడు. అందుకు దొర "ఏమంటావ్ అమ్మాయీ?" అని అడగ్గా "నేను వొట్టి చేతులతో వచ్చి వుండడం మీరు చూసే వున్నారు. నా స్వబుద్ధి చేతనే నే నివతలికి వచ్చాను. నేను మళ్లీ మావాళ్ల యింటికి వెళ్లను. నా నగలమాటకి సమాధానం రాలేదు. ఇందుకు మీరే సాక్ష్యం. ఇదిగో నేను వెళ్లిపోతున్నాను. నా నగలు కోర్టు ద్వారానే వస్తాయి నాకాళ్ల దగ్గిరికి" అంటూ గిరుక్కున మళ్లీ వెళ్లిపోయింది.

## ౧౩

రంగనాయకమ్మ ఔచిత్యానికి భంగం లేనంత వడిగా బయలుదేరింది; కాని లోకప్రవాహనాయకుడు వాయువేగాలమీద ముందువెళ్లి యీ సంగతి పార్వతీశంతో చెప్పాడు. అప్పటి కప్పుడే పార్వతీశం అన్నం తినేసి వుత్తరపు వసారాలో బలరామరెడ్డితో మాట్లాడుతున్నాడు. ఇదివిని అతను "సబాస్" అంటూ చెయ్యి జాడిస్తూ బ్రహ్మానందపడ్డాడు. ఆ ఆనందం పూర్తికాకుండానే జానకమ్మ స్వాగతం యివ్వడానికి వీధిలోకి వెళ్లింది.

రెడ్డి అడగ్గా యువకుడు పోలీసులు వచ్చింది మొదలు జరిగిందంతా చెప్పాడు. పార్వతీశం తీవ్రంగా క్రాసుచేశాడు. రెడ్డి మునసబు మొగంలో కనపడిన మార్పును గురించిమాత్రమే తరిచి తరిచి అడిగాడు.

రంగనాయకమ్మ కింది మెట్టు యెక్కేటప్పటికే "రావే అక్కయ్యా" అంటూ జానకమ్మ చేతులు చాపింది. ఆమె ఒక్కొక్కటే మెట్లు యెక్కి వచ్చిందో యెగిరే వచ్చిందోగాని చూడగా జానకమ్మ కౌగిట్లో వుంది. ఇద్దరికళ్లు గిర్రున తిరిగాయి. రంగనాయకమ్మ మాట రాకపోగా కళ్లతోటే బతిమాలగా జానకమ్మ ఆయింగితం గుర్తించి కళ్లతోటే అంగీకరించినట్లు చెప్పింది.

ఇంతట్లో పార్వతీశం వాకిట్లోకి వచ్చాడు. వెంటనే రంగనాయకమ్మ మన్మథ బాణం లాగ అతని కాళ్ల మీద వాలి "నేను మొండిపీనుగుని. మిమ్మల్ని కొట్టించాను. అయినా క్షమిస్తారని ఆశపడి వచ్చా"నంది. పార్వతీశం ప్రేమతో ఆమెని లేవనెత్తి "నువ్వు విచారించ నక్కర్లేదు. వెంకటేశంబావ బావమరిది పరియాచకాలు చేశాడు. నేను బదులు తీర్చాను. వాళ్లకి వాళ్లం యేమీ బాకీ లేము; కాని నీకు మాత్రం నేను చాలా ఋణపడిపోయాను" అన్నాడు.

రంగనాయకమ్మ మనోవ్యాధి తీరింది. జానకమ్మతో కూడా ఆమె పడమటింట్లోకి వెళ్లిపోయింది.

అంతట్లో సుబ్బిశెట్టివచ్చి "మా మరిది కొడుకు సలహామీద ఆవుపదేశం అంతా నేనుచేశా"నని చెప్పగా పార్వతీశం మరీ ఆనందించాడు. బలరామరెడ్డి "మీ వుపదేశంవల్ల రంగనాయకమ్మగారే కాదు. మేమూ గడ్డెక్కాం" అని ఆమెని చాలా పొగడాడు.

లోపల యిలావుండగా దొర పరివారంతోటే, మునసబుతోటీ, భీమన్నశాస్త్రితోటీ వచ్చి వీధిలో నిలిచి లోపలికి కబురుచేసి పార్వతీశం ఆహ్వానించగా లోపలికి వచ్చికూచుని "మీరు నేరంగల ప్రవేశం చేసినట్లూ, అమాయకురాలైన ఒక బాలవితంతువుని లేవతియ్యడానికి ప్రయత్నం చేసినట్లు నాకు తెలిసింది. ఏం చెబుతారు దీని?"కని అడిగాడు.

"ఆ విషయం ఆ వితంతువు మీయెదుట విన్నవించే వుంది. అక్షరాలా అంతే జరిగింది" అని పార్వతీశం జవాబు చెప్పాడు.

"దీనికి కేసు పెడితే అన్నీ మార్గాలే. అయినా నేను ఈ అల్లరి మాపుచెయ్యాలని నిశ్చయించుకున్నాను. ఆమెని మీ రెలా స్వీకరించదలిచారో దయచేసి చెబుతారా?"

"ఆమె కిలాంటి వుద్దేశం వున్నట్లు గాని, ఆమె నాయింటికి వస్తుం దని గాని యిప్పటిదాకా నేనెరగను. మీకంటె పావుగంట ముందే ఆమె నాయింటికి వచ్చింది. అయినా నే నేమీ ఆక్షేపించకుండా ఆమెని స్వీకరించాను. ముందు సంగతి ఆలోచించడానికి నాకింకా అవకాశం కలగలేదు. అయినా మీ సలహా కోరుతున్నాను."

"మీ కుటుంబమర్యాదా, ఆమె తండ్రి కుటుంబ మర్యాదా కరణం చాలా హెచ్చుగా చెప్పాడు. క్షుద్రులవలె మీ రిద్దరు అక్రమసమ్బంధంతో వుండడం మంచిది కాదు; కనక శాస్త్రోక్తంగా వివాహం—"

"తమ సెలవుకి బద్ధుణ్ణై వుంటాను"

"సంతోషం"

ఇలా చెప్పి దొర "ఆమె నోమాట నాయెదటికి తీసుకొనివస్తారా?" అన్నాడు. దానిమీద పార్వతీశం రెడ్డికేసి చూడగా రెడ్డి పడమటింటి గుమ్మందాకా వెళ్లి రత్తమ్మని పిలిచి సంగతి చెప్పాడు. వెంటనే రంగనాయిక గుమ్మం దగ్గిరికి వచ్చి నుంచింది.

అప్పుడు దొర ముందువాదాకా వెళ్లి "మిమ్మల్ని గాని, మీ ప్రియులయిన పార్వతీశంగార్ని గాని యెవరూ యేమీ చెయ్యలేరు. మీ తెలివితేటలికి చాలా ఆనందించాను. మీరు వారిని శాస్త్రోక్తంగా మళ్లీ పెళ్లి చేసుకుని సుఖపడండి" అని చెప్పాడు. సిగ్గుపడి ఆమె వూరుకుంది. "మీనగలు తెప్పించాను. పుచ్చుకుంటారా?" అని దొర మళ్లీ అడగ్గా ఆమె "చిత్తం" అంది.

అప్పుడు దొర వీథిలో వున్న భీమన్నశాస్త్రిని రప్పించి "నగలు అక్కడ పెట్టండి" అన్నాడు. తల వంచుకునే వుండి అతను మూట అక్కడ పెట్టగా "విప్పి వొక్కొక్కటే అప్పగించండి" అన్నాడు.

భీమన్నశాస్త్రికి తల కొట్టేసినట్లయింది. అయినా కేసు యెదురుతిరక్కుండా వుండాలంటే కిక్కురుమన కూడదని అత నెరుగును.

కంటె, కాసులపేరు, పుస్తెలనాను, గడియారపు గొలుసు, కూడు జతల బంగారపు గాజులు, వొడ్డాణం (పువ్వులో వడ్డాణం), సీమకమలాల కమ్మలు, పాంజేబు పట్టీలు, ముక్కుపుడకలు, బంగారపు కుంకుమబరిణి, వెండిగిన్నె, వెండి గళాసు, నాగపురి సంకే, రెండు వుంగరాలు—యిలాగ వొక్కొక్కటే భీమన్నశాస్త్రి తల వంచుకునే—వొక్కమాటు మాత్రం తీక్ష్ణంగా చూసి వొక్కొక్కటే అందించాడు. రంగనాయికమ్మగూడా అలాగే చూసి వొక్కొక్కటే అందుకుని తలుపు చాటున వున్న జానకమ్మ కందించింది. ఆసన్నివేశం భీమన్నశాస్త్రి, యిప్పటి దాకా పురుషులు చెలాయించిన అధికారాన్ని స్త్రీలకి అప్పగించినట్టుంది.

అప్పగింత లయిపోయాయి. దొర బయలుదేరి వీథిలో నుంచుని, అందర్నీ చేరి చూసి, భీమన్నశాస్త్రినీ, పార్వతీశాన్నీ ప్రత్యేకంగా పిలిచి, "మీకు రాజీ చేశా నని తెలుస్తున్నాను. ఈ వుద్దేశంతోటే యీ కేసు మాపు చేశాను. మీ రిద్దరూ యీఅగ్రహారంలో పెద్ద పెద్ద భూస్వాములై వున్నారు. ఆకారణంచేత మీ అధీనములో నాగా మందిర యిచులూ, కార్మికులూ వున్నారు. మీబుద్ధులు వక్రిస్తే హాని జరుగుతుంది, కాని అలాంటిది తటస్థిస్తే మాత్రం సర్కారు మిమ్మల్ని శిక్షిస్తారు. సమూలంగా విచ్ఛిన్నం చేసేస్తారు. కాబట్టి న్యాయంగా ప్రవర్తించి సుఖపడండి. రంగనాయికమ్మ సాహసంవల్ల మీ రెండు కుటుంబాలికీ దగ్గిర చుట్టరికం కలిగింది. దాన్ని కాపాడుకోండి" అని చెప్పి అడుగు వేశాడు. భీమన్నశాస్త్రి ముఖం మాడ్చుకునీ, పార్వతీశం అత్యుత్సాహంగానూ సెలవు పుచ్చుకున్నారు. మునసబు పొలిమేరదాకా సాగనంపి గంపెడు దీవార్లు తెచ్చుకున్నాడు.

## ౧౪

పార్వతీశం తాపితా కట్టుకుని పెళ్లి పీటమీద కూచునే టప్పటికి యెడా పెడా చెరో అప్సరసా— జానకమ్మా రంగనాయికమ్మా కూచుని వున్నారు. మొదటా రంగనాయికమ్మ అప్పుడే తలంటుకోవడంచేత మెరు

గక్కి చిక్కతీయబడి ఆరతూ వున్న దీర్ఘశిరోజములతోడనూ, సకలాభరణములతోడనూ, పట్టుచీర ధరించి, కళ్లకి కాటుకా, నొసట కుంకుమబొట్టూ — పూర్తిగా ఘర్య స్త్రీ అయివుంది. రత్తమ్మ నేతిగిన్ని పట్టుకుని వడ్డించడానికి సిద్ధంగా వుంది.

రంగనాయకమ్మ తల వంచుకుంది. జానకమ్మ ముఖంమీద అనంతప్రేమా, విజయగర్వమూ నృత్యం చేస్తున్నాయి. రత్తమ్మ మందహాసం చేస్తోంది.

పార్వతీశం మొదట ఆశ్చర్యాన్ని ప్రకటించి ప్రశంస చేసి చివరికి జానకమ్మని కొంచెం యెక్కిరించాడు

అయినా అప్పటిమాత్రం ముగ్గురూ కూడా కొంచెం కొంచెం సిగ్గుతోటే భోజనం చేశారు.

* * *

భోజనానంతరం పడకకుర్చీలో పడుకుని వున్న భర్తకి తాంబూలం అందిస్తూ జానకమ్మ "కృష్ణయాజులుగారి అల్లుడికి చెన్నాపట్టం వుత్తరం రాయండి" అంది. అత "యెందుకూ?" అన్నాడు. అందు కామె "పెళ్లి చేసుకోకపోతే నేను వొప్పుకోను బాబూ" అని చురచుర చూస్తూ తల అడ్డంగా వూపింది.

---

## మనస్సు

కొత్తపల్లి సూర్యారావుగారు

మనసు ప్రధాన మింతకును మానసమే గుఱి యెట్టికార్యముం
బూనినఁ బూన దానివశముంబడ కెవ్వఁడు నుండలేఁడు నుం
డని యతఁ డింద్రియార్థముల డగ్గఱనీయక నిగ్రహించినాఁ
డనఁ జను, రాజు మానసము సన్యములన్నియు దాని బానిసల్.

నాయిష్టము నామన సని-నీయధికారంబు చెల్పు నినుఁ గని నవ్వుం
బాయనిపగవుం గదురను - మాయయు మానసము రెంపుమాటలు నొకఁడే.

మన సన భ్రాంతియన్న నొకమాటయె యందును నేను దానిలోఁ
గనుఁగొనుమయ్య యంతరము గల్గునొ యుంచుక యించు వ్యర్థ మా
పని, విను పగ్గముం గనినఁ బాము ను భ్రాంతి జనింపలేదె, పా
మును గని స్రగ్భ్రమం గొనదె ముగ్ధము చిత్తము కొన్నివేళలన్.

చిత్తమునాఁగ నేమి యని చేయకు ప్రశ్నము మానసంబునే
చిత్తమటండ్రు పెక్కులగు చిన్నెలు వన్నెలు దాల్చునద్ది నీ
చిత్తము దానిభాగ్యమును జేకొన రాతుకొలంది గుఱ్ఱపుం
దత్తఱపెట్టు నద్దడఁగుఁ దత్త్వమెఱుంగుము బుద్ధశాలి వై.

పిండినీళ్లను బాలనువెట్టి త్రావు, నెండమావుల నీళ్లని యెంచి యుఱుకు
ముందు ముప్పున్నదను తలంపును త్యజించి-జార చోరత్వములకునాసపడు నరుడు.
స్వప్నమున నెన్నిక యనంగ వేఱులేదు, తలంపనంగ నాసయనంగ భేదంబు లేదు
తెంచిన కొలంది మనసువతాంగములను, తలమునింగి తాడిలోతయి తంద్రపెట్టు.
ప్రపంచసంకల్పమే ప్రపంచమ్మటంద్రు, కనుము సంకల్పమన్నను మనసె యనుము
మనసు చేయని చేద లేదనుము వినుము, జరిగినది యొక్క చిననమాచార మిచట.



ఒకసంసారి గంగాసు, నాసమద గేయమూరం గులంబెద్ద పు
త్రకుండు యందు దసాగరిత్వముని నన్ బ్రశ్నింపంగా శోకుమా
సకలజ్ఞా! విషయప్రధాన మగు నీ చారిత్రమందేటి కా
ప్రకమానర్థకభాషణం బనుచుం జెప్పంబోను మన్నింపుమా.
ఇంత చదివినవాండ వాయింతమాట, చెప్పగారాదో విషయమే శ్రేష్ఠమైన
విషయలోలురు పెక్కనప సకలంబు, గట్టిపెట్టుద రీవేల కడమనేయు.

దునఁ గనుకున్న నాళ్ల మనతోఁటను గొబ్బెర చెట్టుకాయలం
దునిమి హరించెఁ బట్టువడు దొంగతనం బది దాఁగియుండునే.

నేనుగూడఁ జెట్టు నెక్కింప జంకెద, దానిమీఁదఁ బాము దాఁగి యుండు,
ననుగణింప కెవఁడో కనుఁబ్రామి కొనిపోయె; వానిఁ బాము గఱవ మానెనేమొ.

అదిర! మంచికిఁ గాలమా యనుచుఁ బెద్ద-యెలుగునం బల్కుచుండ నాయింద్ర దారి
నేగుచును విని దానిపై నాగుఁబాము-గలద! యుడుత లటంచును దలఁచినాఁడ.

కాయ కొకసారి యుప్పలవాయి గఱచెఁ, బాముగాఁబోలు చిక్రోడబాధ రాత్రి
యేలకల్గును దైవమా! యేమిసేయు, నగును నను బాము ముట్టుకొన్నది నిజంబు.

అని యొకఁడెల్ల జల్లుమన సంగము చల్లఁబడన్ గుబాలునం
దుసిసిన ప్రమానునాఁ బడియె దుష్టవిషం బపు డెక్క మానసం
బుసఁ గలు ధైర్య మేదుటయుఁ బోయెను జీవము, చూడుమయ్య యే
మనఁదగు భీరతాగుణమునందలి లోప మదెంత చేసెనో.

కడఁబడి నేలఁబడ్డ చిఱుతం గని నాయన నీవు గాదురా
ఒడిసది బావయన్న విని పల్కక యేడ్వక యూరకుండు; నె
వ్వాఁడయినఁ దేలు గుట్టెనన, వట్టిది వానిని గుట్ట నిన్నుఁ గా
దుడుగు మటన్న నోర్చికొను, నోరుపు ధైర్యము వెచ్చుచుండెడున్.

తేలుండునో పాముండునో, కాలిడ నంచెంచుకొనుచుఁ గదలిన నెపుడుం
దేలుండదు పాముండదు, కాలిడఁగఁ దలంపులేని కడ నది యొదవున్.

* * * *

ఒగిఁ బంచాంగము చించివైచినను రాహుగ్రస్తచంద్రోపరా
గగతుల్యామునో, పాముకాటు విష మెక్కంబోదొ చిక్రోడ మం
చు గణింపం, దలనొప్పమందనుచు వెజ్జుల్ బేదమం దీయ న
ద్దిగుణాంబుం బొసరింపదో ప్రొడము సందేహంబు నా కిచ్చటన్.

శాస్త్రవేత్తలు, వైద్యులు, శస్త్రవిదులు, బహుపదార్థజ్ఞులును నిబంధము నరసి
యెందవో గుఱి గరళము మందగుణము, గలుగుటకుఁ జెప్పఁ దని నమస్కార మిడుదు.

---



# పిట్టకథలు



ఒకఊరిలో కామశాస్త్రి అనే ఒక బ్రాహ్మణుడు. ఆయనభార్య ఆదిలక్ష్మి; మిగుల అందమైంది. కాని వాండ్లకు బిడ్డలు లేరు. అంచేత కామశాస్త్రి మరొక పెండ్లి చేసుకొన్నాడు. పెండ్లి అయిన రెండుమూడేండ్లకే చిన్నభార్య కాపురానికి వచ్చింది. అప్పటికి కామశాస్త్రికి నలభైయేండ్లు. పెద్దభార్యకు ముప్పైఅయిదు. కాని తల పూర్తిగా నెరసిపోవడంవల్ల ఆవిడే పెద్దగా కనబడుచుండెను. ఇలా ఇద్దరు భార్యలతోను కామశాస్త్రి సంసారం చేస్తూ ఉండినాడు.

భార్యలిద్దరికీ కలహాలు ఆరంభమయినవి. పాపం! బ్రాహ్మణుడేమి చేస్తాడు? ఎవరినన్నా వారొకరికి కోపం వస్తుంది. అంచేత మౌనం వహించాడు. కాని యెన్నాళ్లలా ఉంటాడు? రోజురోజుకు పెరుగుతున్నాయి వారి కలహాలు. ఇక మౌనంతో కొనసాగదని ఆ బ్రాహ్మణుడు వారితో అన్నాడు: 'మీలో మీకెందుకీదెబ్బలాటలు? ఒక నెల పెద్దదాని యింట, మరొకనెల చిన్నదానియింటా నే నుంటాను. జగడాలు మానెయ్యండి' అని. సరే నన్నారు వా రిద్దరు. ఇద్దర్నీ చెరియొక

ఇంటిలో ఉంచాడు బ్రాహ్మడు. అన్నట్టు మొదట పెద్దభార్య ఇంటికి వెళ్లాడు.

పెద్దభార్య చూచింది; భర్తతల నరసిపోలేదు. తనతల నరసింది. 'ఈమె తనకంటె చిన్నవాడిని పెండ్లాడిం'దని లోకులంటారేమో అని చింతించింది. తుదకు తనవద్దనున్న నెలరోజులలోను అతని తలలోని నల్లవెండ్రుకలన్నీ లాగివేయవలెనని ఊహించింది. ఆలాగే చేసిందికూడాను. నెలరోజులూ దాటేయి.

ఆపైన కామశాస్త్రి మాటప్రకారం చిన్నభార్య యింటికి వెళ్లాడు. పాప మామె మంచిప్రాయముది. ముసలివాడిని పెండ్లిచేసుకొన్నందుకు విచారించింది. లోకులేమంటారో అని భయపడింది. అంచేత ఆమె ఆనెలరోజులలోను అతని తలలోని తెల్లవెండ్రుకలన్నీ ఊడపీయ దలచింది, ఊడపీకింది. ఇప్పటికి బ్రాహ్మడికి తలవెండ్రుకలన్నీ ఊడేయి. మంగలాడి అవసరం తప్పింది. కాని భార్యలు చేసిన దానికి లోలోన విచారించేడు.

రోజులు గడిచాయి. అంతఃకలహాలు వృద్ధిపొందుతూనే ఉన్నాయి. తుద కెలాగో వారిద్దరూ కలిసి అతనికి సమంగా సంరక్షణ చేయాలని సమాధానపడ్డారు. అతని దేహంలో కుడిభాగం పెద్దభార్యది; ఎడమభాగం చిన్నభార్యది. ఉపచారాలు చక్కగా సాగుతున్నవి.

ఒకరోజు పెద్దభార్యకు జ్వరం వచ్చింది. చిన్నభార్య మగనికి స్నానం చేయిస్తూ తన యెడమభాగానికి మాత్రం నీళ్లు పోస్తూంది. అప్పుడు పెద్దభార్య ఆమెతో అందిగదా- 'నీ ఎడమభాగంలోనుంచి ఏమాత్రమేనా నీళ్లు నాభాగంలోకి వచ్చాయంటే నీభాగాన్ని చెంబుచ్చుకు కొట్టాను' అని 'నాభాగాన్ని కొడితే నీభాగాన్నిమాత్రం కొట్టలేనా!' అంది చిన్నభార్య. సరి, చిన్నభార్య మగనికి స్నానంచేయిస్తున్నది. ఒంటిమీద నీళ్లుపోస్తూంటే ఒకప్రక్కనుంచీ ఇంకోప్రక్కకు రాకపోతాయూ నీళ్లు! కుడిభాగంలోకి నీళ్లు రాగానే జ్వరంతో బాధపడుతూన్న పెద్దభార్య లేచి మహావేగంతో వచ్చి అమాంతంగా చెంబుచ్చుకొని భర్త ఎడమభాగాన్ని గట్టిగా కొట్టింది. చిన్నభార్యకూడా కోపంతో కర్రపుచ్చుకొని కుడిభాగాన్ని కొట్టింది. ఇలా ఒకరిభాగాన్ని ఒకరు కొడుతున్నారు. వీరిద్దరి కోపం బ్రాహ్మడికి కొంపముంచుతున్నది. అంత ఆబ్రాహ్మడు 'మీకొంప తగలబడా! నన్ను చంపేకండర్రో! చచ్చిపోయేనర్రో' అని యేడ్చేడు. భార్యల గయ్యాళితనానికి చింతించేడు. స్వయంకృతాపరాధం గదా అని యేడ్చేడు. ఇంతకంటే సన్న్యాసాశ్రమం మేలని నిశ్చయించి గృహస్థాశ్రమం వీడి దేశాంతరం లేచిపోయి సన్న్యాసం తీసుకొని శేషించిన జీవితాన్ని భగవద్ధ్యానముక్రింద వినియోగించేడు.

—రావి అప్పల నరసింహం.




పూర్వకాలంలో ఒకప్పుడు మే మెక్కువంటే మేమెక్కువ అని మృగాలకు, పక్షులకు గొప్ప వివాదం జరిగింది. అది తుదకు యుద్ధంకింద మారింది. రెండు పక్షాలవారు యుద్ధానికి తయారవుతున్నారు. అలాంటప్పుడు గబ్బిలాలు మృగాలదగ్గరకు పోయి 'మేమూ మృగాలమే చూడండి; మాకూ మీవలెనే కొరకడానికీ చీల్చడానికీ పండ్లున్నాయి. మమ్మల్ను మీపార్టీలో చేర్చుకోండి' అని అడిగినాయి. 'సరేకాని, మీకు రెక్కలుండడంవల్ల మాలో చేర్చుకోవడానికి వీలులేదు, పొ' మ్మన్నాయి మృగాలన్నీ ఒకేవిధంగా. ఇంకేమి చేస్తాయి గబ్బిలాలు. అక్కడనుండీ పక్షుల దగ్గరకు వెళ్లి 'మాకు మీవలెనే రెక్కలున్నాయి. మీలో చేర్చుకోండి' అని బతిమాలినాయి. 'మీకు పండ్లుండడంవల్ల మాలో చేరడానికి వీలులే'దన్నవి పక్షులుకూడా.

పాపం! గబ్బిలాలకు చాలా అవమానమయింది. ఆఅవమానంతో అవి ఇక వాటి ముఖాలను ఎలా చూపుతాయి పక్షులకూ, మృగాలకూను. సిగ్గుపడి పగలంతా ఏ చెట్లల్లోనో, ఏపాడుపడిన ఇండ్లల్లోనో తలక్రిందుగా తపస్సుచేస్తూ ఉన్నట్టు నటిస్తూ రాత్రిమాత్రం ప్రపంచ మంతా నిద్రపోయిం తర్వాత తమ ఆహారాన్ని తెచ్చుకొని జీవిస్తున్నాయి.

కథ కంచికి, మనం ఇంటికి.

—రామనాథ దత్త.




అనగాఅనగా ఒకవూరు. ఆవూళ్లో యిద్దరన్నదమ్ములు. వాళ్లకు విస్తారంగా ఆస్తి వుంది. ఒకర్నిగాదని ఒకరా ఆస్తిని అనుభవించాలని అన్నదమ్ములకు దుర్బుద్ధి పుట్టింది. అందుకోసం అన్నను చంపాలని తమ్ముడూ, తమ్ముణ్ణి చంపాలని అన్నా, ఈవిధంగా లోలోపల తంటాలు పడుతున్నారు. కాని తగిన సమయం దొరక్కపోవడంవల్ల వాళ్ల ప్రయత్నాలు అట్టే కొనసాగలేదు.

ఇలా వుండగా ఒకనాడు చద్ది తీసుకొని రమ్మని తమ్మునితో చెప్పి అన్న కాడిగట్టుకొని పొలానికి వెళ్లాడు. సరే, సమయం దొరికింది గదా అనుకొని చద్దిబువ్వలో మొదటి రకం పాషాణం కలిపి తీసుకొనివెళ్లి అన్న కిచ్చాడు తమ్ముడు. ఆకలి అమితం వేస్తున్నా అన్నకు మాత్రం బువ్వమీద బుద్ధిపుట్టలేదు. తమ్ముడు ఒంటిగా వున్నాడు. చుట్టుపక్కల యెవరూ లేరు. సమయం బాగుంది, జారిపోనీయగూడదనుకొని చేతిలోవున్న నాగటికర్రతో నడినెత్తిన బాదాడు తమ్ముణ్ని మళ్లీ లేవకుండాను. ఎన్నాళ్లనుంచో నెరవేరని దొడ్డకోరిక నేటికి నెరవేరిందిగదా అనే ఆనందంతో పిల్లరాగాలు తీస్తూ పక్కవున్న కోనేటికి వెళ్లి కాళ్లుచేతులు కడుక్కొని చద్దిమూట విప్పి సాంతంగా భోంచేశాడు అన్న. కాస్సేపటి కంతా విషం తల కెక్కింది. విలవిల తన్నుకొని ప్రాణాలు విడిచేశాడు అన్న, పాపం!

అదేసమయాన ఆకాశమార్గాన వెళ్తూవున్న నారదమహాముని క్రిందజరిగిన ఘోర కార్యం చూచి, "అమ్మా! లక్ష్మీదేవీ! నీప్రభావం అమోఘం. నీకటాక్షం మాత్రం నాపైకి ఎప్పుడూ రానీయకు. పదివేల దణ్ణాలు పెడతాను." అని తిరిగి చూడకుండా తనదారిని వెళ్లాడు.

---

దేవాలయములోని-
దేవు డెడకో పోయె
దీపాలు లేవేమె మనసా!
ధిమ్ము ధిమ్మని చిమ్మ
చీకటుల లోపలను
దెయ్యాలు ఆడెనే మనసా! ౧.

శ్రీ వేంకటేశ్వరుని
చెలువైన ఒకరాతి
బొమ్మగా నిలిపితివె మనసా!
అలమేలుమంగ ఒక-
ఆటవస్తువు గాగ
అంగడికి ఈడ్చితివె మనసా! ౨.

దేవతలు నరులతో-
నరులు దేవతలతో
తిరిగి రీదేశాన మనసా!
దేవతలు తమ విమా-
నాలలో వెడలగా
దిక్కుమాలిరి నరులు మనసా! 3.

ఇండ్లలో ఉండేటి-
ఇలవేల్పు లందరును
ఎచ్చటికో ఏగిరే మనసా!
ఎవరితోవై వారు-
ఎగురుతూ ఉన్నారు
ఏమౌనో తెలియదే మనసా! ౪.

పాత తోవలలోను-
పాదాలు మెట్టితే
భద్రమని మరచితివె మనసా!
కొత్తదారులు పట్టి-
కోరి అడవిని జొచ్చి
కూలిపో నేలనే మనసా! ౫.

ఎదలోను పదిలముగ-
కుదురుకొన్నట్టి నీ
చదువులన్నీ యేవె మనసా!
చదువులన్నీ పోయి-
కొదవపడి మరి ఒకరి
నరసజేరితి వేమె మనసా! ౬.

నీవన్నె చెడిపోయె-
నీచిన్నె మరుగుపడె
నీఅంద మేమయ్యె మనసా!
నీవారి దారి సరి-
వారిలో తలమెత్తి
నిలువలేవేమె ఓ మనసా! ౭.

ఆలు ఆడుది యనాట-
మగడు మగవా డౌట
అది లోకమర్యాద మనసా!
ఆడుదియు మగవాడు-
అంద రొక్కటియైన
అది యెట్లు పొసగునే మనసా! ౮.

వెలగలుగు రత్నాల-
　　విలు వెఱుగ కున్నావు
వెఱ్ఱివై విడిచితివి మనసా!
తళుకుబెళుకుల రాళ్ల-
　　తలపైని పెట్టుకొని
తబ్బిబ్బుపడ నేల మనసా! ౯.

నీ తెలివి తేటలను-
　　నీ నీటుగోటులను
నీ వెఱుగ కున్నావు మనసా!
నీతిమాలిన ఇతర-
　　రీతులను చేపట్టి
నిక్కి నీల్గెదవేమి మనసా! ౧౦.

పరులు పన్నిన పట్టి-
　　యురులలో జిక్కుకొని
పరుగాడ కున్నావు మనసా!
పంజరములో పడ్డ-
　　పంచవన్నెల చిలుక
వరుసయ్యె నీ బ్రదుకు మనసా! ౧౧.

ఉన్నదంతా ఊడ్చి-
　　కొన్న దొక్కింతయున
కుదురుపడ కున్నదే మనసా!
చిన్నదానికినై వి-
　　చారించ నేల ఇక
సరసమార్గము గొనవె మనసా! ౧౨.

---

## కాముకప్రేమతత్త్వము

(Shelley's 'Love's Philosophy)

అయ్యగారి సత్యనారాయణమూర్తిగారు, B. A.

నగములం బుట్టుధారలు నదినిఁ గలియుఁ,
　గలియు నానదు లన్నియు జలధియందు;
మింట వేర్వేఱువాయువు ల్మిళితమగును
సంభ్రమానందము ల్మీఱ శాశ్వతముగ;
ఉండ దేదియు నక్కమం దొంటరిగను
అఖిలవస్తుచయంబు దైవాజ్ఞ నొకఁ
గలిసియుండు నొండొంటితోఁ జెలిమి గలిగి;
కాన నే నేలఁ బ్రేమ సంగ్ధనయరాదు?

కాంచు మెత్తైన నింగిఁ జుంబించు గిరుల;
కడలి యలలెల్ల నొండొంటిఁ గౌఁగిలించు;
ఇలను సోదరీసుమము వైరింపఁబడదు;
నిరసనంబునఁ దనదు సోదరుని వీడ.
అవని నాలింగన మొనర్చు రవి వెలుంగు;
చంద్రకిరణము లొద్దును సాగరమును;
వింటివి గాదె! యీ ముద్దు లింకను జూడ
నీవు న న్నేమితోడ ముద్దిడకయున్న.

---

మడతలో మొదట నొక సాధారణపు నిడివి యాకును, దానిప్రక్కన నొక కోతలు గల నిడివియాకును, దానిప్రక్క కోతలు లేని సాధారణపునిడివియాకును, మరల కోతలుగలఆకును, కడపట మరల నొకసాధారణపు ఆకును పెట్టి, జంటఆకును మూసి కుట్టవలెను. (చిత్రము ఘ చూడుము) నిడివిఆకులన్నియు ఒకదానిప్రక్క నొకటి చేరియుండవలెను అప్పుడు కుడిప్రక్క గూడ నొక అంగుళము స్థలము మిగులును. నిడుపాటి ఆకులను అమర్చుకొనిన తర్వాత కురుచఆకులను అడ్డముగా అల్లవలసియున్నది. మొదట నొక కోతలులేని కురుచ ఆకును గీసికొని, (చిత్రము ఘ యందు చూడుము) కుడి ప్రక్కనుండు ఘ అను నిడివిఆకుపైనుండి ఖ అను ఆకులోని కోతలగుండా చిత్రమునజూపిన విధమున దూర్చుకొనవలెను. పిమ్మట ఆ కురుచఆకును రెండవ ఘ అను ఆకుమీదుగాను, రెండవ ఖ యొక్క కోతలగుండా మూడవ ఘ ఆకుమీదుగా తీసికొనవలెను. కురుచ ఆకుయొక్క కొనలు క్రిందనుండు మడతఆకు కొనలకు సరిగా నుండు కొనవలెను. రెండవ కురుచఆకు కోతలు గలదిగా నుండవలెను. సాధారణపు కురుచ ఆకునుదూర్చ వలసివచ్చినప్పుడు కుడినుండి ఎడమ ప్రక్కకుగాని, ఎడమ నుండి కుడిప్రక్కకుగాని దూర్చవలెను. కోతలు గల తునుకను దూర్చ వలసివచ్చినప్పుడు పై నుండిక్రిందికిదింపవలెను. ఒక కోతలుగలఆకును గీసికొని దానిలోనికోత



లుగల భాగములను నిడివిఆకులలో కోతలు లేని ఆకుల కొనలకు సరిగా (ఎదురుగా) నుంచుకొన వలెను. పిమ్మట కోతలగుండా సాధారణపు నిడివిఆకులను కురుచఆకులందలి కోతలులేని గదులకు ఒకటి పైవైపునను, మరియొకటి క్రిందివైపునను వచ్చునటులు దూర్చవలెను. అపుడు కోతలుగల కురుచఆకు, మొదట దూర్చబడిన సాధారణపుకురుచఆకు ప్రక్కకు వచ్చును. ఈవిధముగా తక్కిన కురుచఆకులను, ఒకమారు సాధారణపు తునుకను, మరొకమారు కోతలుగలదానిని అల్లుచు నిడివితునుకల పైకొనలయందు ఒక అంగుళము స్థలముమాత్రము వదలి అల్లవలెను.

ఇంక విసనకర్రకు అంచులుమాత్రము కట్టవలసియుండును. ఈనెలు తీయని జంట ఆకులలో ఒకనిడివితునుకను విసనకర్రయొక్క ఎడమప్రక్కను, రెండవ తునుకను కుడిప్రక్కను, రెండవ కురుచ జంటఆకును పైయంచునను ఉంచి అన్నిప్రక్కలను కుట్టివేయవలెను. పిమ్మట నొక వెదురుబద్దను పదునెనిమిదంగుళముల నిడివియు, ఒక అంగుళము వెడల్పును గలదానిని తీసికొని దానిని సగము వరకు రెండుగా చీల్చవలెను. (చిత్రము యా) పిమ్మట విసనకర్రయొక్క ఒక నిడివిఅంచును వెదురుబద్దయొక్క చీలికయందుంచి ర, ర ర, ర అను చోట్ల కుట్టివేయవలెను.

విసనకర్రయందు కావలసినచో రంగువేసిన ఆకులనుగూడ నుపయోగించవచ్చును.



---

## ఓకవులారా!

మంగిపూడి వేంకటశర్మగారు

వర్ణనీయమైన వస్తు వేదో యెఱింగి
తగుప్రయోజనంబు దానగలిగి
యున్నగాక కైత లూరక కైసరుల్
వ్రాయనేల? బుధులు రోయనేల?

కృతికర్త తా రచించిన
ప్రతికృతియును చదివినట్టి ప్రజలకు తమ జీ
వితములు దిద్దుకొనందగు
గతి మతినలరించి కీర్తి గడియించవలెన్.

రాజుల భాగ్యములు మహా
రాజుల భోగములు రాజరాజుల ప్రభలున్
రాజుల విలాసములె కా
నీ జగమున కవికి వర్ణనీయములేదో?

సాధుల చరితలు వారల
బోధనలును పద్యగద్యములు గాఁగ సుధా
మాధురిగా నూర్పఁగ కవి
నాథుల కవితలకు సాధనంబులు గావో?

ప్రౌఢప్రాయపు ప్రౌఢగ్రంథము గానక యెల్ల
ప్రొద్దులును శ్రమియించు పూజ్యమతులు
ప్రజల కెల్ల ప్రాణబాంధవుల్ కార్మికు
లేల కవులకవితకెక్కరొక్కొ?

పాటకపుజనుల యాటలు
పాటలు పనిపాటులు నలవాటులు తెలిపీ
తేటలు మాటలు సత్కవి
కూటములకు వర్ణ్యవస్తుకోశములు కావో?

దేశమునకు వెన్నెముకై
క్లేశంబుల నెల్ల బడుచు కృషియే కృషిగా
తా శాంతిగ జీవించు మ
హాశయుడగు రైతు వర్ణ్యుఁ డవఁడో కవికిన్?

తనపొట్టను తనబట్టను
తనవారి సుఖంబు నెపుడు దలపక దీక్షన్
తన దేశమునకె బ్రతుకును
తనువు నిడెడు సుకృతి పొగడ తగడో కవికిన్?

శ్రీలుంగని యాసింపక
మేలుగ తనకున్న తృణమె మేరువయనుచున్
లోలోన తనివిగను శుభ
శీలుని జీవితము చెప్ప జెల్లదె కవికిన్?

ఆమొడ నబ్బినగంజియె
పాయసమని తలచి పతిని భగవంతునిగా
పాయక కొలుచు సతులు కమ
నీయాదర్శులు కవికి వర్ణనీయులు కారో?

గుడిసెలలో నివసించుచు
వడిసెలగొని యరిపలెక్కి పక్షులవోలన్
కడు జిలిబిలిపాటలు వి
న్పించి పడుచులు కవులలేఖినికి సరిపడరో?

అడవుల పశువుల మేపుచు
గుడిగుంచములాడి పిల్లగ్రోవ [illegible]ము వే
డ్కడరగ నూదుచు క్రీడిం
చెడి బుడుతలు కవికి వర్ణనీయులుగారో?

కేవలము శాంతులై శుభ
భావనులై భక్తులై కృపాంచితమతులై
పావనులగు జానపదుల
జీవితములు సుకవులకు రచింపగ తగవో?

లేమివడికన్న బిడ్డల
నోమంగా శక్తిలేమి నురుకష్టములన్
వేమారు సహించు మాతృ
ప్రేమము వర్ణింప సత్కవికి తగదొక్కో?

భోగాములు తెలియక నవ
నాగరికతయనుచు చూచు నాచారములన్
వేగగొను ప్రజల కందలి
బాగోగులు తెలుప కవికి పనిగాదొక్కో?

ఓ కవితిలకములారా!
నాకరములు మోడ్తు నామనవి చేకొనుడీ!
లోకోపకృతికి చెందని
యా కవనము వనమె యనెదు నానుడి గనుడీ!

# గురుశిష్యసంవాదము

కూచి నరసింహముగారు

## ౭

(వందనాశీర్వాదముల పిమ్మట)

శి—నేఁడు మన ప్రసంగవిషయము లేవి?

గు—ప్రభుత్వమువారికి వచ్చుఆదాయము, ఆయ మూలములు.

శి—మన దేశము విశేషముగాఁ గృషివృత్తి నాధారము చేసికొని బ్రతుకు బీద దేశము.

గు—అందుచేతనే పన్నులు గొనుటలో పాలకులు బహుజాగరూకులై యుండవలయును. ఎట్లుండవలయునో కుమారప్పగారు మూలసూత్రములలో విస్పష్టముగాఁ జెప్పినారు; అవి జ్ఞప్తిలో నున్నవా?

శి—సింహావలోకనము చేసికొని చెప్పుచునెదరా? లోపములు మీరు పూర్తిచేయునెడల నట్లే చెప్పెదను.

గు—మంచిది.

శి—రాజ్య ప్రజావర్గమునుండి తీయఁ బన్నులు గొనవలసియున్నప్పటికిని, వాని మొత్తము పేదవారిపైఁ బడనీయక, అదిలి విశేషభాగము భాగ్యవంతులనుండి గ్రహించి బీదలఁ గాచుచుండవలయును.

పరోక్షకరద్వారమున ఇండియావంటి దేశములో శుల్కము లధికముగా గ్రహింపరాదు. ఆపన్నులు దరిద్రప్రజల యాహారపదార్థములమీఁద వేయఁగూడదు; సామాన్యప్రజావర్గ ముపయోగించు వస్తువులపైఁ దేలికగా వేయవలయును. ధనపుష్టిగలవా రుపయోగించు భోగపదార్థములపై నెక్కువగా వేయవచ్చును. గత్యంతరము లేనప్పుడు దక్కఁ దేవలకీవనాధారము లగు పదార్థములపైఁ బన్ను లెప్పుడును విధింపఁగూడదు.

అనావశ్యకములును హానికరములును అగు భోగపదార్థములపైఁ గఠినమైనశుల్కములువేసి ప్రజలు వాని నుపయోగించుకొనుటను సాధ్యమైనంతవఱకరికట్టుచుండవలెనుగాని, ఆదాయ మధిక మగుచున్నది గదా యని, వానిదిగుమతి పెరుఁగనీయఁగూడదు.

ప్రజాపుష్టికిని, తుష్టికిని, పదార్థోత్పాదనశక్తికిని ములకును గావలయు ద్రవ్యము వారియొద్ద నుంచి యతిరిక్తముగా నుండు దానిపైనే పన్నులు వేయుచుండవలెను. శుల్కగ్రహణపద్ధతులును, వాయిదాలును ప్రజలకుఁ గష్టకరములు గాకుండ ననుకూలములుగా నుండవలెను.

గు—విఘ్నేశ్వరపూజ నీవు చేయించితివి గాన మిగిలిన తంతు నేను నడపెదను. 1925–26 వ సంవత్సరపు టాయవ్యయ లెక్కలనుబట్టి నీవిధినిషేధసూత్రములు హిందూదేశపరిపాలనలో నెంతవఱకు నవలంబింపఁబడుచున్నవో చూతము.

శి—చిత్తము.

గు—ఈ క్రిందిపట్టిక ఆసంవత్సరము వచ్చిన ఆదాయపు మొత్తమును, ముఖ్యమైన బాపతులును, కొన్ని బాపతుల యాదాయమును వసూలుచేయుటకైన వ్యయమును జూపుచున్నది.

| బాపతు | వసూలు వ్యయము | నికరపు టాదాయము | |
|---|---|---|---|
| | | లక్షలలో | |
| దిగుమతి ఎగుమతి పన్నులు | 1.7% | 4696 | పైచిల్లర |
| రాబడిపన్ను | 3·6% | 1553 | ,, |
| ఉప్పు | 19·7% | 507 | ,, |
| నల్లమందు | 50.8% | 203 | ,, |
| భూమిపన్ను | 11·6% | 3143 | ,, |
| కల్లు, గంజాయి మున్నగు మాదకద్రవ్యములు | ,, | 1729 | ,, |
| స్టాంపులు | ,, | 1828 | ,, |
| అడవులు | ,, | 260 | ,, |
| రిజిస్ట్రేషన్ | ,, | 78 | ,, |

| | | | |
|---|---|---|---|
| రెయిల్వేలు | ,, | 551 | ,, |
| కాలువలు మొదలగు నీటివసతులు | ,, | 239 | ,, |
| పోస్టు & టెలిగ్రాఫ్ | ,, | 85 | ,, |
| వడ్డి | ,, | 656 | ,, |
| నాణెములు, టంకసాల | ,, | 393 | ,, |
| విశేషాయమూలములు | ,, | 192 | ,, |
| ఇతరములు | ,, | 119 | ,, |

సంవత్సరాయపు మొత్తము 15,688 లక్షలపైచిల్లర.

ఎగుమతిదిగుమతిసరకులపై వేసిన సుంకములవలన వచ్చు రాబడి తోలుత విమర్శించి చూచుకొందము. కావలయు లెక్కలు స్పష్టముగా నీయబడలేదు గాన, స్థూలవిమర్శనమునకే కాని సూక్ష్మవిమర్శనమునకవకాశము లేదు. అయినను సత్యమును గనుగొనుటకు మనకు స్థూలవిమర్శనము చాలును.

శి—రాబడిపద్దులలో నదియే పెద్దపద్దుగాఁ గాన్పించుచున్నది.

గు—పైచూపులవలన బుద్ధిని భ్రమాయత్తముఁ జేయఁగూడదు. చెప్పినమాట లన్నియు విని చివర నీయభిప్రాయమును స్థిరపఱచుకొనుము.

వచ్చిన 4696 లక్షలలోను, ఎగుమతిపన్నులును, పెట్రోలుమీఁది పన్నును, బీదల నట్టే బాధింపని సైకిళ్లు, మోటారుకార్లు, యంత్రములు, సారాయి మొదలగువానిపై వేసిన దిగుమతిపన్నులును ఉన్నవి. వాని మొత్తము 2293 లక్షలు. అవిపోఁగా శేషించిన దిగుమతిపన్నులు 2408 లక్షలు.

శి—అట్లు చూచినను భూమిపన్ను తరువాత నదియే పెద్దమొత్తము.

గు—ఎక్కువతగ్గు లెట్టివైన మనదేశపు పద్దులతోఁ బోల్చిచూచుకొనికాదు నిర్ణయింపవలసినది. ఇతరదేశముల కాబాపతు రాబడి యెంత వచ్చుచున్నదో పరికించి దానిఁబట్టి నిర్ధారణచేసికొనవలెను.

శి—అట్లే చేయరాదా!

గు— అట్లైన బ్రిటన్దేశమునుండి ౧౯౦౪ సం. లో వివిధదేశముల కెగుమతియైన సరకులపైని ఆయాదేశములవారు వేసిన టారిఫుల (సుంకముల) తారతమ్యమును జాబు నంకెలతో నొకపట్టీ, బ్రిటిష్వాణిజ్యసంఘమువారే తయారుచేసి ప్రకటించినారు, చూడుము.—

| దేశము | టారిఫ్ | దేశము | టారిఫ్ |
|---|---|---|---|
| రష్యా | 131 | ఫ్రాన్సు | 34 |
| స్పెయిన్ | 76 | ఇటలీ | 27 |
| | | జర్మనీ | 25 |
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | 78 | కెనడా | 17 |
| | | జపాన్ | 9 |
| పోర్చుగల్ | 71 | టర్కీ | 8 |
| | | దక్షిణాఫ్రికా | 6 |
| ఆస్ట్రియాహంగరీ | 35 | చీనా | 5 |
| | | హాలెండు | 3 |
| | | బ్రిటిషిండియా | 8 |

మన దిగుమతిపన్నుపద్దు ఎక్కువయో తక్కువయో యిప్పుడు చెప్పుము.

శి— తక్కువయే యని చెప్పకతప్పదు. రష్యావారు వేయు టారిఫ్ మనదానికంటె దాదాపుగా 44 రెట్లున్నది. అన్నిటిలోను మనదేశ మడుగున నున్నది హాలండువారుమాత్రము మనకుఁ దోడుగా నున్నారు.

గు—మన యిండియా, సేద్యమునే జీవనమునకు ముఖ్యాధారముగాఁ జేసికొన్న దేశము గనుక, దిగుమతిసరకులమీఁద వేయు శుల్కము లధికముగా నుండవలసినది. నవ్యవస్తూత్పాదనసామర్థ్యమును, కర్మాగారములును ఇంకను శైశవావస్థలోనే యున్న మనదేశపు వర్తకవ్యాపారము కఠినమైన దిగుమతిపన్నులచే సంరక్షింపఁబడవలెను. యథేష్టవిదేశవాణిజ్యవ్యాపారపద్ధతి పరిపాలకు లవలంబించుట దేశానర్థకరము.

శి—పరదేశములును, బ్రిటిష్సామ్రాజ్యములోనే చేరిన యితరదేశములును గూడ విదేశవస్తుసామగ్రిపై దిగుమతిపన్ను లంతహెచ్చుగా వేయుచుండఁగా మన

హిందూదేశపరిపాలకులు న్యూనశుల్కములు విధించుటకు హేతు వేమైయుండును?

గు— మన దేశమునకు వచ్చు విదేశవస్తుజాతములో విశేషభాగము పాలకుల స్వదేశమగు గ్రేట్బ్రిటన్ ద్వీపమునుండియే వచ్చుచున్నది గనుక. ఎవరి సరకుని వారు బాగుచేసికొనఁ బ్రయత్నించుట స్వాభావికము గనుక.

శి— ఎగుమతిపన్ను లెక్కువ చేసినచో, దేవుఁడిచ్చిన యాహారపదార్థములు దేశములో నిలిచి యుండుటచే, వెలలు తగ్గి, ప్రజల కన్నపుబాధ కొంతవఱకుఁ బోఁగొట్టునుగదా!

గు— అవి యన్నియు నెట్లు జరుగఁ గలవు? నేల బొగ్గుతోను ఇనుముతోను ఆఁకలి తీరునుగదా! మన ముఖ్యపగరులు-ముఖ్యముగా నోడరేవులు-ఇతరదేశముల కంటె విశేషముగా గ్రేట్బ్రిటనునకే నడుమనా యగుచున్నవి. పరిపాలితులకు తీవ్రబాధ రాకుండఁ బరిపాలక దేశప్రజల కొద్దియో యెట్లు పోఁగలుగు, న్యాయ మేమగును గాని?

స్వేచ్ఛావాణిజ్యవ్యాపారవిధాన మవలంబించి రాజ్యతంత్రము సాగించుచున్నంత వఱకుఁ దెల్లవారికి విదేశవర్తకులకు, విదేశవస్తువులను విరివిగా నుపయోగించు నల్పసంఖ్యాకులగు ధనవద్భాగ్యశాలి ప్రజలకును, లాభము చేయుచు నెగుమతిదిగుమతి సుంకములు తగ్గింపక తప్పదు; రాజ్యములోని యాదాయము నధికముగాఁ దీసికొనుటకు భూములమీఁదను, ఉప్పు మన్నగు జీవనాధారపదార్థములమీఁదను వేయుపన్నులు హెచ్చించి ప్రజల బాధింపక తప్పదు.

శి— పరిపాలకులుగా నెవరుందురో వారికి రాజ్యలాభ మంతయును వారికే కలుగునన్నమాట. బ్రిటిష్ వారు మన దేశమునకుఁ బ్రభువులైనారు గావునఁ దత్ఫలలాభము లన్నియు వారికిని, వారి దేశమువారికిని ప్రాప్తింపక మానదన్నమాట.

గు— అవును. "మిల్లు" గారు చెప్పిన మాటలే నీవును జెప్పినావు. "ఆత్మవత్సర్వభూతాని" అనువచనము లాధ్యాత్మికశాస్త్రములోనివిగాని అర్థశాస్త్రములోనివి గావు. "నిన్నితరు లెట్లు చూడవలెనని నీ కుంతువో నీ వితరుల నట్లు చూడుము" అను బైబిల్‌లోని యుపదేశవాక్యము భానువాసరములందుఁ బ్రార్థనాగారములలో నిచ్చు ధర్మోపన్యాసముల కుపయోగపడును గాని పరదేశపాలనక్రియాకలాపమునం దవలంబించిపోవుట కనువు పడదు.

"ఇది దివ్యమైన దొడ్డదేశము; కాని అయ్యో! స్వదేశస్థు లంగుంచిపోయిరే! అని నాకుఁ బట్టరాని దుఃఖము వచ్చుచున్నది" అని యొకఁడు వంగదేశపు గవర్నరు గారితో నన్నాఁడట!

శి— ప్రమాణ మేమి?

గు— "హాలండు" గారు తమ గ్రంథములో వ్రాసినారు.

శి— ఆ సన్న మహానుభావుఁ డెవఁడు?

గు— మన దేశములో గొఁగువారవర్తకము చేయుచుండిన పండిపట్టనవాస్తవ్యుఁడగు నొక వర్తకుఁడు.

శి— వస్తునిర్మాణపాటవమునందును, వాణిజ్యనైపుణ్యమునందును, అర్థబలమునందును సమానులై యుండువారి దేశములకు, విశృంఖలముగా నేతద్వాణిజ్యవ్యాపారములు సాగనిచ్చుపద్ధతి అనుసరింపను గాని, ప్రజలు విత్తహీనులై, స్వపాహారజ్ఞానశూన్యులై యుండు మన దేశమునకు హానికర మగును. అందులో ఆయవ్యయనిర్ణయాధికారము పరుల చేతులలో నున్నప్పుడు మఱియు ననర్థకారి యగును.

గు— నీ వన్నమాట సత్యము. హిందూదేశమునకుఁ బ్రస్తుతావస్థలో శ్రేయస్కరమైనది శాసననిరుద్ధమై, నియమితమై, స్వదేశవర్తకమున కనుకూలమై యుండు విదేశవాణిజ్యము.

శి— ఇఁకఁ బట్టీలో రెండవపద్దుగా నుండు వచ్చుబడిపన్నును గూర్చి ముచ్చటించుకొందము.

గు— పన్నులన్నిటిలోను ఇది బహుప్రజాతృప్తికరమైన పన్నుగాఁ బరిగణింపఁబడుచున్నది.

శి—ఈరూపముగానైన రావలసినప న్నంతయు వచ్చుచున్నదా ?

గు—ఇండియా చేసిన ఋణములపైఁ జెల్లింప వలయు పెద్దవడ్డీమొత్తములు ప్రభుత్వమువారు ఇంగ్లండులోఁ జెల్లించుచున్నారు. వానిమీఁదఁ బరదేశములు ప్రవాసులనుండి వసూలుచేయవలయు రాబడిపన్ను ఇండియాకు ముట్టుటలేదు. ముట్టినచో సాలునకు రెండుకోట్ల రూపాయలు హిందూదేశకోశములోఁ బడుచుండును అని "షా"గారు లెక్కించి చెప్పినారు.

శి—ఇట్టిపద్ధతులు న్యాయమైన వన్నవా ?

గు—గొప్పగొప్ప భూస్వాములకంటె భూమిపన్నులు పుచ్చుకొనుచున్నారని చెప్పి, ఆభూములపై వచ్చు రాబడిమీఁద రాబడిపన్ను వసూలుచేయుట లేదు. సుఖజీవనమునకుఁ జాలిన యాదాయమును దాఁటి వచ్చు రాబడి యున్నవారిపై రాబడిపన్ను వేయుటయే న్యాయపద్ధతి. "చెల్లింపఁగల శక్తి గలవారిపైఁ బన్నులు వేయవచ్చును" అనుసూత్రమే మాపట్టున న్యాయము లోనికిఁ దేవలసినదే. ఈరూపమున సులభ్యభాగ్యమును సంవత్సరమునకుఁ బదికోట్లరూపాయలని పై"షా" పండితుఁడే వ్రాసినాఁడు.

ఇంకొకటి యిట్టిదే యున్నది.

శి—ఏది ?

గు—తెల్లదొరలవేతలు మనదేశములో నౌకరి చేసి, మనలనుండి యమితమైన ధనము వాణిజ్యలాభరూపముగా లాగుకొని, తమ (గేట్బ్రిటన్) దేశమునకుఁబోయి దానితో నచట గొప్పభూముల సంపాదించుకొని, వానిపైఁ బన్నులు (గేట్బ్రిటన్) ప్రభుత్వమువారికిఁ జెల్లించుచున్నారు. ఆపన్నుల యాదాయ మంతయు న్యాయ్యముగా హిందూదేశమునకు వచ్చుబడిపన్నుగా రావలసినది.

శి—ఇండియాపరిపాలకులు స్వదేశీయులే యగు నెడల బ్రిటన్వారితోఁ దగు నొడంబడికలు చేసికొని యట్టి యాదాయములను బోకుండ రాఁబట్టుకొందురు గదా !—నవ్వుకొనుచున్నారేమి ?

గు—ఏమియు లేదు. "మా ఆయన బ్రతికియుండిన మంగలవానినైనఁ బిలుచుకొని వచ్చునుగదా !" అన్న లోకోక్తి నీమాటలవలన జ్ఞప్తికివచ్చుచున్నది. మనవారు పాలకులగుచో నట్టి యిక్కట్టు లేల పుట్టును?

శి—పోనిండు, తరువాతి యొప్పుపన్నమాట చెప్పుఁడు. దానిమూలముననే యిప్పుడు దేశమంతయు నల్లకల్లోలముగా నున్నది.

గు—జీవులను బాధించుపన్నులు రాజులు వేయఁగూడదు—అను రాజనీతిసూత్రము సర్వజనసమాదరణీయసూత్రమే యగుచుండ, ఉప్పుపన్ను ఘోరమైన యన్యాయపుఁబన్నని చెప్పకతీఱదు.

శి—ఏందుచేత ?

గు—సర్వప్రాణులును సమానావసముగా యథేష్టముగా ననుభవించుటకు గాలి, వెలుతురు, నీరు—భగవంతుఁడెట్లు సుఫలముగాఁ బ్రసాదించినాఁడో, అట్లే మనుష్యులును పశువులును గూడ సులభముగా నుప్పు వాడుకొని సుఖపడి యారోగ్యరక్షణము చేసికొనుట కానర్గళముగ, సముద్రమంత యాకాశమును గ్రహించినాఁడు. అట్టిచోఁ దానికి ప్రతిబంధకములు కల్పించి, పన్నులువేసి ప్రజను బాధపెట్టుట యనర్థకృత్యము.

దేశమున కీపన్ను మహావిపత్తని యేకకంఠముగా హిందూదేశప్రజానాయకు లందఱును గర్జించినారు.

శి—ప్రజలకు నుప్పు చౌకగా నమ్ముచున్నారేమో ?

గు—చేతులకు నూరురూపాయలు పట్టినసరకు ప్రజలకు రూ 1200లు మొదలు రూ 2000లకు అమ్ముదురఁట.

శి—ఈమాట యెవరు చెప్పినారు ?

గు—'బ్లంటు'గారు తమ గ్రంథములో వ్రాసినారు.

శి—ఇంకను ఈ విషయమునుగూర్చి ఆయన యేమివ్రాసెనో చెప్పుదురా ?

గు—"కొనలేక యుప్పు మిక్కిలి తక్కువగా వాడుకొనువారు నిఱుపేదలు. దక్షిణదేశప్రజలలోఁ బెక్కు రట్టిబీదవారే. దక్షిణహిందూస్థానములో మనుష్యులు శ్రమపడి పండింప నక్కఱలేకుండ భూమిపై నైసర్గికముగా ఉత్పన్నమై కాన్పించు ఉప్పుగలప్రదేశము లనేకము లున్నవి. ఎదుటఁ బుష్కలముగా దొరకు ఉప్పు చూచుచు, అన్యాయమగు శాసనముచే ఉప్పుకఱవననుభవించుట ఆనట్టి ప్రజలకు మిక్కిలి కష్టముగా నున్నది—ఉప్పు కొనిపెట్టలేక మా పశువు లుప్పు నాకినగాని బ్రతుకవని రాత్రులందు వానిని దొంగతనముగా ఉప్పుపఱ్ఱలకుఁ దోలుకుపోవుటకు మేము వచ్చినాము, కాని కనఁబడినయెడలఁ జట్టముల నతిక్రమించితిమని కావలివాండ్రు మా పశువులను బందెదొడ్లలోఁ బెట్టుదురు. స్వతస్సిద్ధముగా నేలపైనుప్పు గాన్పించు చోట్లనెల్ల నూడిపించి యాయుప్పును గుట్టలుగాఁ జేరిపించి పోలీసువారు అది ప్రజ లుపయోగించుట కనర్హమగునట్లు పాడుచేయవలయునని యిటీవల నుత్తరువులు పుట్టినవి—అని నేఁ ద్రోవలోఁ జూచిన యనేకగ్రామముల రయితులు మొఱ్ఱలువెట్టుకొనినారు." అని కూడ ఆర్బ్లంటుగారు వ్రాసినారు.

శి—ఈపన్ను వసూలుచేయుటకుఁ బ్రభుత్వమువారి కగు వ్యయ మెంత?

గు—అదియు నెక్కువయే. అసలురాబడిలో 19.7% అని పనుకటిపట్టీలో నున్నది. అనఁగా దాదాపుగా నైదవవం తన్నమాట.

శి—అధికారులలో నెవరైన నీ యుప్పుపన్ను దుష్టమైనదని యొప్పుకొనినారా?

గు—ఆ! సామ్రాజ్యమునకు మంత్రియగు మెగ్డానల్డుగారే యిట్లు చెప్పుచున్నారు:—"ఉప్పుపన్ను ప్రజలనుండి బలాత్కారముగాఁ [illegible] [illegible]కరమైన పన్ను. యథార్థస్థితి ప్రజకుఁ దెలిసిన యెడల, నది వారి కతృప్తిఁ గలిగింపకమానదు. ఇది స్వలాభమే పరమార్థముగాఁ జూచికొని దరిద్రహిందూదేశమును దోఁచుకొని తాము బాగుపడిన కంపెనీవారియొక్క దుష్పరిపాలనా స్మృతిశేషము."

శి—అబ్బా! మెగ్డానల్డుగా రిప్పటి సంక్షోభము వచ్చునని యప్పుడే తెలిసికొనిన భావిజ్ఞులన్నమాట.

గు—ఔను! నేఁటి కీప్రసంగము చాలును.

శి—చిత్తము! నమస్కారము! సెలవు.

గు—సుఖీభవ!

---

## నిజగురువు

ధర్మాల అప్పన్నపంతులు గారు

బాలురతోడ నేనెపుడు బాటలు బాడుచు నాటలాడుచున్,
బాలుర కేను బోధన లుపాయముతోడ హితంబు సేయుచున్,
బాలుర శీలమున్ యశము బాలనసేయుట నాదు చింతనల్,
బాలుఁడ నేను నీకు, నను బాలనసేయుమ లోకబాంధవా!

---

## మద్యపాన నివారణోద్యమమెడల సానుభూతియా ?




తలిశెట్టి రామారావు.




# సప్తర్షిమండలము

నడింపల్లి జగన్నాథరావుగారు

ప్రాచీన హైందవ దేశచరిత్ర కాలముల దెలియజేయునట్టియున సప్తర్షులే యేయే కాలములయం దేయే నక్షత్రములయందు సంచరించుచుండినదియు పురాణేతిహాసాది హైందవ ప్రాచీన వాఙ్మయమునందు చెప్పబడియున్నది. ఆయా కాలములను మనము తెలుసుకొనకలిగిన ప్రాచీన హైందవ దేశచరిత్ర యధార్థ కాలనిర్ణయము గావించుట కనువగును.

సప్తర్షిమండలచలనవిధానమునుగురించియు, ఒక్కొక్కనక్షత్రమున వారు సంచరించుకాలపరిమితిని గురించియు కొందరు భిన్నాభిప్రాయములైనట్లు గన్పట్టుచున్నది. ఈ సప్తర్షిమండలము తక్కిన గ్రహములవలె ముందునకు నడవక వెనుకకు నడచుచుండెనని కొందరిమతము. వారిమతానుసారము సప్తర్షులు నక్షత్రమండలమున అశ్వినీనక్షత్రమునుండి వరుసక్రమముగ భరణ్యాదినక్షత్రములయందు ముందునకు నడవక, వెనుకకు అనగా రేవత్యాదినక్షత్రములయందు విలోమముగ సంచరించుచుందురని చెప్పుచున్నారు. మరికొందరు అశ్వినీనక్షత్రము మొదలు వరుసక్రమముగ ముందునకు సంచరించుచుందురని చెప్పుచున్నారు. దీనినిబట్టి సప్తర్షులు ముందునడకను (Forward motion) సంచరించుచుందురా లేక వెనుకనడకను(Retrograde motion)సంచరించుచుందురా యను రెండుసిద్ధాంతములు గన్పట్టుచున్నవి. ఇట్లుండ సప్తర్షిమండలమునకు చలనమే లేదని నవీనసిద్ధాంతులగు స్వామికన్నుపిళ్లె మున్నగువారి సిద్ధాంతమయినట్లు గన్పట్టుచున్నది. సప్తర్షిమండలమునకు చలనము లేదని ప్రాచీనహైందవసిద్ధాంతు లెరింగియుండిరనియు, సప్తర్షు లొక్కొక్కనక్షత్రమున నూరువత్సరము లుండురని చెప్పుట శతాబ్దములను లెక్కించుటకుగాను యేర్పరచుకొనిన యొక సాంకేతికయుగమనియు జెప్పియుండిరి. (Vide, Indian Ephemeris by Dewan Bahadur L. D. Swamikannu Pillai, Vol. I, part I, page 483, para 6 of Appendix F) స్వామికన్నుపిళ్లెగారట్టిసాంకేతికయుగమును బట్టియే మహాభారత యుద్ధకాలనిర్ణయమును గావించుటను బట్టియే సప్తర్షిమండలమునకు సహజముగ చలనము లేదని యుండి నిర్ణీతమగు విధానమున నా సప్తర్షిమండలమునకు సమముగ నొకశతాబ్దకాలము ఒక్కొక్కనక్షత్రము గన్పట్టుచుండుననియు నద్దానినే ప్రాచీనహైందవు లొక సాంకేతికయుగముగ గైకొని చరిత్రకాలనిర్ణయములు

గావించుపట్టున బేర్కొనియుందురని యెంచి కాలనిర్ణయవిధానమునకు గడంగిన యథార్థ కాలనిర్ణయమును గావించదగియుండు ననుట సిద్ధము.

పురాణేతిహాసాది ప్రాచీన హైందవవాఙ్మయము యుధిష్ఠిరుని కాలమునందును, పరీక్షితుని కాలమునందును సప్తర్షులు మఘానక్షత్రమునం దుండినట్లు జెప్పుచున్నది. గ్రంథకర్తలు మాత్రము యుధిష్ఠిరపరీక్షితుల కాలమున యందు సప్తర్షులు కృత్తికానక్షత్రమున నుండినటుల జెప్పియుండి రనుచున్నారు. వీనినిబట్టియే తర్వాతి కాలమున కొన్ని భిన్నసిద్ధాంతములు బయలువెడలినట్లు గన్పట్టుచున్నది. వరాహమిహిరుడు గ్రంథకర్తల సిద్ధాంతము ననుసరించి యుండెననియు సప్తర్షులు అశ్విన్యాదినక్షత్రముల వరుసక్రమము ననుసరించి సంచరించుచుండినటుల జెప్పియుండెననియు కొందరు జెప్పుచుండిరి. వరాహమిహిరు డదివర కుండు సిద్ధాంతములను కనుబరచుచు ఆయాసిద్ధాంతముల ననుసరించి కాలనిర్ణయము గావించుట కనువగు మార్గములను దెలియజేసియుండెను. ప్రాచీనసిద్ధాంతవేత్తయగు వృద్ధగర్గుని మతానుసారముగ సప్తర్షులు యుధిష్ఠిరుని కాలమున మఘానక్షత్రమున నుండిరనియు, ఆయుధిష్ఠిరుని కాలమునకును శకకాలమునకును మధ్యగల కాలవ్యవధి 2526 సంవత్సరము లయ్యుండెననియు జెప్పియుండెను.

శ్లో. ఆసన్ మఘాసు మునయః శాసతి పృథ్వీమ్ యుధిష్ఠిరే నృపతౌ, షట్ ద్వికపంచద్వియుత శకకాలస్య తస్య రాజ్ఞశ్చ.

—బృహత్సంహిత. ౧౩. అధ్యా. శ్లో. ౧.

ఈశ్లోకమున వరాహమిహిరునిచే బ్రస్తావింపబడిన శకకాలము శాలివాహనశక మను భ్రాంతితో యుధిష్ఠిరకాలనిర్ణయము గావింప కొందరు బ్రయత్నించియుండిరి. అయ్యది క్రీ. పూ. 550 సంవత్సరమున శకసామ్రాజ్య స్థాపనము గావించిన సైరసుచక్రవర్తిచే స్థాపించబడిన శకవత్సరప్రశంసయని యిదివరలో కనుబరచియుంటిని. (Vide The Age of the Mahabharata-War published by me-P. 56 to 58) వరాహమిహిరు డిచ్చిన యీ కాలగణితమునుబట్టి యిప్పటి కయిదువేల యేడు (2526 + 550 + 1931) సంవత్సరములకు పూర్వము యుధిష్ఠిరు డుండినటులను, యుధిష్ఠిరుని కాలమున సప్తర్షులు మఘయం దుండినటులను ఒక్కొక్క నక్షత్రమున శతవత్సరము లుండునటులను జెప్పబడియుండుటచే యుధిష్ఠిరుని కాలమున సప్తర్షులు మఘానక్షత్రమున నిప్పటి కయిదువేల నూటయేడు వత్సరముల (5007 + 100) క్రిందట బ్రవేశించి యుండిరనియు స్పష్టముగ దెలియుచున్నది. ఈగణితమును బట్టి యుధిష్ఠిరుని కాలమునుండి ప్రస్తుత కాలమువరకు సప్తర్షు లేబదియొక్క నక్షత్రములయందు సంచరించియుండినటుల దెలియుచున్నది.

మత్స్యపురాణమున

"భవిష్యేతే ప్రసఙ్ఖ్యాతాః పురాణజ్ఞైః శ్రుతర్షిభిః,

సప్తర్షయ స్తథా ప్రాంశుః ప్రదీప్తే నాగ్నినాసమాః,

సప్తవింశతి భావ్యాఽనా మంధ్రాణాంతు యథాపునః."
—మత్స్యపురాణ. ౨౭౧ అధ్యా. ౪౦-౪౧ శ్లో.

అని చెప్పబడియుండుటచే "ప్రదీప్తే నాగ్నినా సమాః" అనువాక్యమునకు అగ్ని దేవు డధిపతిగనుండిన కృత్తికానక్షత్రమునకు సమముగ సప్తర్షు లుండిరనియు వారలు తిరిగి యిరువదియేడవ(27) ఆంధ్రరాజుల కాలమున కొక యావృత్తి (Rotation or Cycle) పూర్తి గావించి రెండవయావృత్తి ప్రారంభించెదరనియు తర్వాతకాలపువార లభిప్రాయులై యుధిష్ఠిరుని కాలమునందు లేక పరీక్షితునికాలమునందు సప్తర్షులు కృత్తికయందుండిరని భావించినటుల గన్పట్టెడి. ఆశ్లోకములకు తర్వాత జెప్పబడిన శ్లోకములయందు—

"సప్తర్షయో మఘాయుక్తాః కాలేపారీక్షితేశతమ్,
ఆంధ్రాంశే చతుర్వింశా భవిష్యంతి శతంసమాః".
—మత్స్యపురాణ. ౨౭౧ అధ్యా ౪౬-౪౭ శ్లో.

అని చెప్పబడియున్నది. ఇయ్యది "పరీక్షితుని కాలమున సప్తర్షులు మఘానక్షత్రమునం దుండిన కాలము పారీక్షితశతమనియు, తర్వాత ఆంధ్రరాజుల ప్రారంభకాలమునకు ఇరువదినాలుగు (24) శతాబ్దములు గడచును" అనియు దెలియజేయుచున్నది. పరీక్షితుని కాలమున సప్తర్షులు మఘానక్షత్రమున నుండిరని స్పష్టముగ జెప్పియుండుటచే కృత్తికానక్షత్రమున నుండిరనుట గ్రంథకర్తయుద్దేశ్యము కాదని స్పష్టముగ దెలియుచున్నది. మరియు "ప్రదీప్తేనాగ్నినా సమాః" అను వాక్యమునకు "ప్రకాశమాన మగు అగ్ని దేవు డధిపతిగనుండుకృత్తికానక్షత్రమునకు సమముగనుండు" అనుభావము కాదనియు, "అగ్నితో సమానముగ ప్రకాశించెడు సప్తర్షులు" అని చెప్పుటకుగాను విశేషణపదముగ జెప్పబడియుండెననియు బోధితమగుచున్నది. అదియును గాక పరీక్షితుని కాలమున సప్తర్షులు కృత్తికానక్షత్రమున నుండిరనియు, ఆవాక్యముల వెంటనే తిరిగి నేడు శతాబ్దముల కాలన్యవధిని తెలియజేయునటుల మఘానక్షత్రమునం దుండెననియు జెప్పబడియుండెననుట యసంగతము. సప్తర్షులు శ్రుతగ్రంథ మతానుసారముగ కృత్తికానక్షత్రమునందును, పురాణవేత్తలు వృద్ధగర్గుడు మున్నగువారి మతానుసారముగ మఘానక్షత్రమునందును పరీక్షితునికాలమున సంచరించుచుండురని యెంచినను అందలివాక్యములను బట్టి వారు అశ్విన్యాదినక్షత్రముల విరుద్ధక్రమముగ ముందునకు సంచరించుచుండురను భావము స్ఫురింపజేయుచుండెను అవకాశము గన్పట్టదు. 'హైందవశకములు' (Book of Indian Eras) అను గ్రంథమును రచించిన అలెగ్జాండరు కన్నింగుహామ్ పండితుడు సప్తర్షియుగమును గురించి రచించునందర్భమున నీవిషయమును చర్చించుచు యథార్థస్థితిని సమన్వయముగా వించుకొనజాలక శ్రుతిగ్రంథులు కృత్తికానక్షత్రముగ నెంచినదానినే పురాణవేత్తలును వృద్ధగర్గాదులును మఘానక్షత్రముగ నెంచియుండిరనియు ఆ యుభయమతముల వారి యుద్దేశ్య మొకేనక్షత్రమును గురించి చెప్పుటయే యయ్యుండెననియు సమన్వయము జేయుచు

మున సప్తర్షులు మఘానక్షత్రమునందుండిరనియు, యుధిష్ఠిర పరిపాలన కాలమున మఘయందుండిన సప్తర్షులు కలియుగప్రవేశ కాలమునకు పూర్వము డెబ్బదియైదు వత్సరముల క్రిందట మఘానక్షత్రమున ప్రవేశించి యుండిరనియు, కలియుగమునం దిరువదియైదు (25) వత్సరములు గడచిన పిమ్మట సప్తర్షులు ఆశ్లేషా నక్షత్రశతమున బ్రవేశించిరనియు, అయ్యదియే యుధిష్ఠిరుడు మహాప్రస్థానము జేరిన సమయమనియు, యుధిష్ఠిరుని జ్ఞాపకార్థ మప్పటినుండియే యిరువదియేడు శతాబ్దముల (2700) పరిమితిగల లౌకికాబ్దము ప్రారంభించబడి యుండెననియు తెలియుచున్నది.

"సప్తర్షయస్తు దృశ్యన్తే యత్ర నక్షత్రమండలే,
సప్తర్షయస్తు తిష్ఠన్తి పర్యాయేణ శతం నృణామ్,
సప్తర్షీణాంతు పర్యాయే [illegible] దివ్యసంఖ్యయా,
సమాదివ్యాస్స్మృతాః సప్తదివ్యా[illegible].
ఏభిః ప్రవర్తతే కాలో దివ్యస్సప్తర్షిభిస్తుతైః,
సప్తర్షీణాంతు యౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితే నిశి,
తయోర్మధ్యేతు నక్షత్రం దృశ్యతే యత్సమం దివి,
తేన సప్తర్షయో యుక్తా వ్యోమ్ని శతం సమాః.
నక్షత్రాణా మృషీణాంతు యోగస్యైత న్నిదర్శనమ్,
సప్తర్షయో మఘా యుక్తాః కాలే పారీక్షితే శతమ్."
(Vide మత్స్యపురాణము. ౨౭౧ అధ్యా. ౪౩-౪౮ శ్లో)

అని మత్స్యపురాణము చెప్పుచున్నది. ఈ వాక్యములను బట్టి నక్షత్రమండలమున గల యేనక్షత్రమున సప్తర్షులుందురో ఆనక్షత్రమున వారు శతవత్సరముల పర్యంత ముండెదరనియు, నక్షత్రమండలమును సప్తర్షులు చుట్టివచ్చెడు కాలము దేవకాలమున నేడువత్సరముల ఆరు మాసముల కాల మగుచున్నదనియు, అర్ధరాత్రమున సప్తర్షిమండలమున పూర్వదిక్కున నుండు నక్షత్రములకు సమముగ నేనక్షత్రము గన్పట్టునో యానక్షత్రమున సప్తర్షులొక శతవత్సరము లుండెదరనియు, పరీక్షితుని కాలమున సప్తర్షులు మఘయం దుండిరనియు, ఆ కారణమున మఘయందు సప్తర్షులుండిన శతము పారీక్షితశతమని పేర్కొనబడుచుండె తెలియుచున్నది.

దేవకాలమానమున నొకదివ్యవత్సరము మానవకాలమానమున మున్నూటఱువది (360) వత్సరముల కాల మయ్యుండినటుల పురాణాదులయందు జెప్పబడియుండెను. కావున ఏడుదివ్యవత్సరముల ఆరుమాసముల కాలము మానవమానమున ఇరువదియేడువందల(2700) సంవత్సరము లగుచున్నది. సప్తర్షులొక్కొక్క నక్షత్రమున శతవత్సరము లుందురని చెప్పబడియుండుటచే వారు లోకపరి నక్షత్రమండలమునగల యిరువదియేడు నక్షత్రములను చుట్టివచ్చుట కిరువదియేడువందల (27 × 100) వత్సరము లగుచున్నవి. ఇయ్యది సప్తర్షి యుగమునకు చెప్పబడిన (2700) ఇరువదియేడువందల సంవత్సరముల సంఖ్యకు సరిపోవుచున్నది.

భాగవతపురాణమునందును

"సప్తర్షీణాంతు యౌ పూర్వౌ దృశ్యేతే ఉదితౌ దివి,
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమం నిశి.
తేనైత ఋషయో యుక్తా స్తిష్ఠన్త్యబ్దశతం నృణామ్,
తే త్వదీయే ద్విజాః కాలే అధునా చాశ్రితా మఘాః".
—భాగవతము ౧౨ స్కం ౨౭, ౨౮ శ్లో.

అని చెప్పబడియున్నది. విష్ణుపురాణము నందును

"సప్తర్షీణాంతుయౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితౌదివి
తయోస్తుమధ్యేనక్షత్రం దృశ్యతే యత్సమంనిశి
తేన సప్తర్షయోయుక్తా స్తిష్ఠం త్యబ్దశతం నృణామ్
తేతుపారీక్షితేకాలే మఘాస్వాసన్ ద్విజోత్తమ".

విష్ణుపురాణము ౪ అంశ ౨౪ అధ్యా ౧౦౫. ౧౦౬ శ్లో.

అని చెప్పబడియున్నది. వాయుబ్రహ్మాండ పురాణములయందును ఇటులనే చెప్పబడి యున్నది. (1. వాయు. 99 అధ్యా. 2. బ్రహ్మాండపురాణము. 3. అధ్యా 74) వీని నన్నిటినిబట్టి జూచిన సప్తర్షి మండలమున పూర్వమందున్న నక్షత్రములకు సమముగా అర్ధరాత్రమున నక్షత్రమండలమున నేనక్షత్రము గన్పట్టుచున్నదో యానక్షత్రమున సప్తర్షు లుండినటుల భావించవలసియుండుననియు, సప్తర్షు లొక్కొక్కనక్షత్రమున మానవకాలమానమున శతవత్సరము లుందురనియు స్పష్టముగ దెలియుచున్నది.

పరీక్షితుని కాలమున సప్తర్షులు కృత్తిక యందుండి రనెడి శ్రుతర్షులును, మఘయందుండి రనెడు పురాణవేత్తలు, వృద్ధగర్గాదులును

"సప్తర్షీణాంతుయౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితౌదివి,
తయోస్తుమధ్యేనక్షత్రం దృశ్యతే యత్సమంనిశి".

అను శ్లోకమునుబట్టి పూర్వమున చూడబడెడు నక్షత్రము లెవ్వియో నిర్ధారణగావించు పట్టున భిన్నాభిప్రాయులై యుండినటుల గన్పట్టుచున్నది. ఈభిన్నాభిప్రాయమే యొకేకాలమందు సప్తర్షులు కృత్తికానక్షత్రమున నుండి రనుటకును, మఘానక్షత్రమున నుండిరనుటకును కారణమయినటుల గన్పట్టుచున్నది. "పూర్వౌ" యనుపదమునకు "ముందరభాగమున లేక మొదట" యనియును, "తూర్పు దిక్కున" అనియును అర్థముచెప్పుట కవకాశము గన్పట్టుచుండెను. అట్టి అవకాశమును పురస్కరించుకొని శ్రుతర్షులు ముందరభాగముననుండు నక్షత్రములకు సమముగానుండు నక్షత్రమున నుండిరనియు, వృద్ధగర్గాదులును పురాణవేత్తలును తూర్పుదిక్కుననుండు నక్షత్రములకు సమముగానుండు నక్షత్రమున నుండిరనియు జెప్పుటచే నీభేదాభిప్రాయములు కలుగుటకు కారణ మయ్యుండినటుల గన్పట్టెడి. ఈయుభయసిద్ధాంతవాదులును పరీక్షితుని కాలమున సప్తర్షులు వేర్వేరునక్షత్రములయం దుండినటుల జెప్పియుండిరే గాని ఒక్కొక్కనక్షత్రమున వా రుండు కాలపరిమితి యందుగాని వారి చలనవిధానమును గురించి గాని భిన్నాభిప్రాయులైనటుల గన్పట్టుటలేదు. ఉభయమతములవారును సప్తర్షు లొక్కొక నక్షత్రమున శతవత్సరము లుందురనియే స్పష్టముగ జెప్పియుండిరి. ఈయిరుతెగలవారి సిద్ధాంతముల గమనించిన శ్రుతర్షులు కృత్తికానక్షత్రమని పేర్కొనిన నక్షత్రమునే వృద్ధగర్గాదులు మఘానక్షత్ర మని పేర్కొని యుందు రను కన్నింగుహామ్ పండితుని యభిప్రాయము సరిగాదని స్పష్టముగ గన్పట్టును.

సప్తర్షు లేనక్షత్రమున నుండునది కనుగొనుటకుగాను చెప్పబడిన శ్లోకములకు భాగ

వతపురాణమునకు భావార్థదీపిక యను వ్యాఖ్యను రచించిన శ్రీధరస్వామి

"సప్తర్షీణామితి. అయమర్థః:— ప్రాగగ్రశకటాకారం తారాసప్తకం సప్తర్షిమండలం. తత్రకించిదున్నతే తేషామగ్రస్థానీయో మరీచిః. తతః పశ్చాదానమ్రయుగకంధరాకారో వసిష్ఠస్సభార్యః. తతః పశ్చాదీషదుత్తర స్థానీయో౽ంగిరాః. తతః పశ్చాచ్చతురశ్రతారాచతుష్కైశాన్యే అత్రిః. తతోదక్షిణతః పులస్త్యః. పులస్త్యాత్పశ్చిమతః పులహః. తత ఉత్తరతః క్రతుః. ఏవంస్థితే తేషాం మధ్యే యా పూర్వా ఉదయసమయే ప్రథమముదితౌ దృశ్యేతేతౌ పులహక్రతు సంజ్ఞే, తయోస్తుమధ్యేతయోస్తు పూర్వయోస్తు మధ్యేతత్సమం దక్షిణతః సమకాదేసస్థిత మశ్విన్యాదిషు యదన్యతమం నక్షత్రం దృశ్యతే (౨౮) తే గతి. తేన తత్రైవయుక్తాః నృణామబ్దశతమ్ తిష్ఠంతి. తేన ద్విజాస్త్వదీయే కాలే అధునా మఘా ఆశ్రితా వర్తంతే. (౨౯)"

అని చెప్పియుండెను. ఈ వ్యాఖ్య

"తూర్పుదిక్కున కగ్రము గలిగి శకటాకారముగ (ఒక చకటా బండియాకారముగ) గన్పట్టు 7 (యేడు)నక్షత్రముల సముదాయము సప్తర్షి మండలము. అందు కొంచెమున్నతికలిగి వానికగ్రమున అనగా శకటాకారముగనుండిన యా నక్షత్రసముదాయమున యేడికోల మొదట నుండువాడు మరీచి. అతనికి పశ్చిమముగ వంగిన కాడిమూపువలె నుండువాడు భార్యాయుతు డగు వసిష్ఠుడు. అతనికి పశ్చిమమున కొంచము త్తరముగ (యేడికోల మూల) నుండువాడు అంగిరసుడు. అతనికి పశ్చిమమున చతురశ్రముగ గన్పట్టు నాలుగుతారలయందు ఈశాన్యమున నుండువాడు అత్రి. అతనికి దక్షిణమున పులస్త్యుడు. ఆపులస్త్యునకు పశ్చిమమున పులహుడు. అతని కుత్తరమున క్రతువు. వీరు తూర్పుదిక్కున ఉదయమగు సమయమున మొట్టమొదట చూడబడెడువారు పులహక్రతువులు. వారికి (పులహక్రతువులకు) మధ్య సమముగా వారికి (పులహక్రతువులకు)ముందు భాగమున అనగా ఎదురుగా (వారికి అనగా సప్తర్షులకు) దక్షిణముగా నుండిన అశ్విన్యాది నక్షత్రములలో యేనక్షత్రము గన్పట్టునో ఆ నక్షత్రమున సప్తర్షులుండినటుల జెప్పబడుచున్నది. అటుల ఒక్కొక్కనక్షత్రమున వారు (సప్తర్షులు) మానవకాలమున శతవత్సరము లుందురు. ఈవిధముగ నీ (పరీక్షితుని) కాలమున సప్తర్షులు మఘయందుండిరి."

అని భావమిచ్చు చున్నది. మఱియు విష్ణు పురాణమునకు ఆత్మప్రకాశికాఖ్యావాఖ్యను రచించుపట్టున శ్రీధరస్వామి యాశ్లోకములకు

"సప్తర్షీణాం త్వితి: శకటాకారతారాసప్తకం మునిమండలం. ప్రాగగ్రేతత్రమండలే ఈషాస్థానీయః ప్రాచ్యాం మరీచిః. తతః పశ్చాన్నమ్రయుగకంధరాకారో వసిష్ఠః సభార్యః. తతః పశ్చాదీషదున్నత ఈషామూలస్థానీయో౽ంగిరాః. తదాసన్నపశ్చిమచతుష్కశ్చైశాన్యే అత్రిః. అత్రేర్యామ్యః పులస్త్యః. పులస్త్యాత్పశ్చిమః పులహః తదుదీచ్యశ్చతుష్కవాయవ్యేక్రతుః. వసిష్ఠాద్యామ్యా సూక్ష్మతారా అరుంధతీ. తత్రమండలే ఉక్తంచ పూర్వభాగే మరీచిర్భగవాన్ అపరభాగేస్థితో వసిష్ఠోస్మాత్పరతో౽ంగిరాః. తతో౽త్రిస్తస్యాసన్నః. పులస్త్యపులహః క్రతుర్భగవానాసన్నానుక్రమేణపూర్వాద్యాస్తారావసిష్ఠవర ముపాశ్రితారుంధతీ సాధ్వస్థితేతి; ఏపంస్థితే. యౌపూర్వౌదయే ప్రథమం దృశ్యౌపులస్త్యక్రతుసంజ్ఞౌ మునీశకటస్య పశ్చాత్యౌతథాపిపూర్వాం ఉదితౌదృశ్యతే. మధ్యే గగనమధ్యే-తయోః తాభ్యాంసమం

సమదక్షిణోత్తరరేఖాయాం య ద్విన్యాద్యన్యతమం నక్షత్ర మార్గ్గవే నాతిష్ఠతే. తేననక్షత్రేణ తేయుక్తాః శతాబ్దంతిష్ఠంతి. తేషాం ప్రత్యేకం శతాబ్దస్థిత్యుక్తిః కలి గతాబ్దజ్ఞానోద్దేశార్థా.

అని వ్యాఖ్యను చెప్పియున్నాడు. భాగవత పురాణమునకును, విష్ణుపురాణమునకును వ్యాఖ్యను రచించుచుట్టున మూలమున గల 'సిశి' యను శబ్దమును గమనించక వదలి యున్నారు. భాగవతమునకు వ్యాఖ్యయగు భావార్థదీపిక ననుసరించి పులహక్రతువులకు మధ్యభాగమునకు సమముగా ముందరభాగమున నక్షత్రమండలమునందలి యేనక్షత్రము గన్పట్టునో యా నక్షత్రమునందు సప్తర్షులుండి నటు లెంచదగియుండునని తెలియుచున్నది. విష్ణుపురాణమునకు వ్యాఖ్య యగు ఆత్మప్రకాశిక ననుసరించి పులహక్రతువులకు సమముగ నుత్తరదక్షిణముల గాక సరళరేఖను లిఖించిన యా రేఖ నక్షత్రమండలమునందలి యేనక్షత్రమునం దుండునో యానక్షత్రమునందు సప్తర్షు లుండినటుల జెప్పదగి యుండుననియు దెలియుచున్నది. ఈసిద్ధాంతము మూలమున జెప్పబడిన విషయమునకు భిన్నముగ గన్పట్టుచుండెనని వేరుగ జెప్పనగత్యము లేదు. మూలమునందు పూర్వమున గన్పట్టు నక్షత్రములకు మధ్య సమముగ అర్ధరాత్రమున గన్పట్టు నక్షత్రమునందు సప్తర్షులుండినటు లెంచవలసియుండునను భావమును సూచించుచుండ, 'పూర్వా' మన 'తూర్పుదిశయం' దనియా లేక 'ముందరభాగము లేక యెదుటిభాగమునం' దనియా యను భిన్నాభిప్రాయములకు తావలమై భిన్నసిద్ధాంతములు బయలువెడలి పరీక్షితుని కాలమున సప్తర్షులు కృత్తికా నక్షత్రమున నుండిరని శ్రుతర్షులును, మఘానక్షత్రమునందుండిరనిపురాణవేత్తలును, వృద్ధగర్గాదులును సిద్ధాంతములు జేసియుండిరి. ఆ యిరుమతములవారును సప్తర్షుల చలనవిధానమును గురించియు, వారలొక్కొకనక్షత్రమునందుండు కాలపరిమితినిగురించియు భిన్నాభిప్రాయులు గాక నేకాభిప్రాయులై యుండిరి. ఎవరిసిద్ధాంతము ననుసరించి కాలనిర్ణయములు గావించినను భేదము గన్పట్టక యొకేరీతిగ కాలపరిమితులు దేలుచున్నవి. ఈసిద్ధాంతములకును మూలమునకును భిన్నముగ పులహక్రతువులకు సమముగ నుత్తరదక్షిణముల గాక రేఖను లిఖించిన యా రేఖ నక్షత్రమండలమునందలి యేనక్షత్రమున గన్పట్టునో యానక్షత్రమున సప్తర్షులుండినటుల భావించవలసియుండునని ఆత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యాకారుడు కడు ప్రమాణముతో గావించిన వ్యాఖ్యనుబట్టి సప్తర్షులు ముందునకు నడచుచుండిరను సిద్ధాంతము బయలువెడలినటుల గన్పట్టుచున్నది. ఈవ్యాఖ్యను రచించిన శ్రీధరస్వామి యాశ్లోకములకు పైన చెప్పబడిన

"యావత్పరీక్షితో జన్మ యావన్నందాభిషేచనమ్,
ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచాశదుత్తరమ్."

అను శ్లోకమునందు పరీక్షిత్తుని జన్మకాలమునకును, నందుని పట్టాభిషేకమునకును మధ్యగల కాలవ్యవధియని చెప్పబడిన సంఖ్యను తెలియ

జేయు "ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయంపంచశతోత్తరమ్" అనుపాదమునందలి "పంచశతోత్తరమ్" అనువాక్యమునకు మూరు లేఖకప్రమాదజనితమగు "పంచాశదుత్తరమ్" అను పాఠాంతరమునుబట్టి యీ శ్లోకములకు తర్వాత నందుని పట్టాభిషేకము మొదలు సప్తర్షులు పూర్వాషాఢానక్షత్రమునకు వచ్చువరకు కలి వృద్ధియగునని చెప్పబడిన

"విపరీతాని దృష్ట్వాని నిమిత్తానిహి పాండవః,
యాతే కృష్ణే చకారాథ సోఽభిషేకం పరీక్షితః

ప్రయాస్యంతి యదా చైతే పూర్వాషాఢాం మహర్షయః,
తదా నందాత్ప్రభృత్యేష కలిర్వృద్ధిం గమిష్యతి."

అను శ్లోకములనుబట్టి నందుని పట్టాభిషేక కాలమున సప్తర్షులు పూర్వాషాఢానక్షత్రమున నుండినటుల భావించి వానిని సమన్వయము జేయుతలంపున ప్రయత్నపూర్వకముగ నట్టి వ్యాఖ్యానము గావించియుండినటుల గన్పట్టెడి. మఘానక్షత్రమునుండి వరుసక్రమముగ లెక్కించిన పూర్వాషాఢానక్షత్రము పదునొకండవ నక్షత్రమగుచున్నది. దీనినిబట్టి పరీక్షితుని జన్మ మొదలు మహాపద్మనందుని పట్టాభిషేకమునాటికి పదునొకండవ శతాబ్దము జరుగుచుండినటుల గన్పట్టుటచే దాని కనుగుణముగ నుండునటుల

"యావత్పరీక్షితో జన్మ యావన్నందాభిషేచనమ్,
ఏత ద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచాశతోత్తరమ్."

అను శ్లోకమునందు "పదిహేనువందల వత్సరముల కాలవ్యవధి" యని తెలియజేయు "ఏతద్వర్ష సహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరమ్" అను వాక్యములను "పదివందల యేబదివత్సరముల కాలవ్యవధి" యని తెలియజేయునటుల మూలమునందలి "పంచశతోత్తరమ్" అను వాక్యమును "పంచాశదుత్తరమ్" అని సవరణజేసి యుండిరని గన్పట్టుచున్నది. ఇయ్యది యే తర్వాత కాలమునందు సప్తర్షులు వెనుకకు నడచుటలేదనియు, ముందునకు నడచుచుండిరనియు సిద్ధాంతము బయలువెడలుటకు కారణమయ్యెండెను. శ్రీధరస్వామియు అట్టి భ్రమప్రమాదములకు వశుడైనటుల గన్పట్టెడి. ఈ యాత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యను రచించిన శ్రీధరస్వామి భాగవతమునకు భావార్థదీపికాఖ్య వ్యాఖ్యను రచించు సందర్భమున పరీక్షితుని జన్మకాలమునకును మహాపద్మనందుని పట్టాభిషేకకాలమునకును మధ్యగల కాలవ్యవధి (౧౧౧౫) పదునొకండు వందల పదిహేను వత్సరము లయినటుల గన్పట్టు

"ఆరభ్య భవతో జన్మ
యావన్నందాభిషేచనమ్,
ఏతద్వర్ష సహస్రంతు
శతం పంచదశోత్తరమ్."

(భాగ. ౧౨ స్కం. ౨ అధ్యా. ౨౬ శ్లో.)

అను శ్లోకమునకు

"వర్ష సహస్రం పంచదశోత్తరం శతం చేతి కయా ఉపపత్త్యా అనాంతరసం ఖ్యాయుమ్. వస్తుతస్తు పరీక్షిన్నందయో రంతరం ద్వాభ్యాం న్యూనం సార్ధాంసార్ధసహస్రం భవతి. యతః పరీక్షిత్ సమకాలం మాగధం మార్జారి మారభ్య రిపుంజయాంతా వింశతి రాజానః సహస్రవత్సరం భోక్ష్యంతి త్యుక్తం నవమస్కంధే "యే బార్హ

ద్రథభూపాలాః భావ్యాః సహస్రవత్సరమ్." ఇతి తతః పరం పంచప్రద్యోతనా "అష్టాత్రింశోత్తరంశతం", శిశునాగాశ్చ "షష్ట్యుత్తరశతత్రయం భోక్ష్యంతి పృథివీమ్" ఇతి అత్రైవోక్తత్వాత్."

అని వ్యాఖ్యను రచించియుండెను. ఈవ్యాఖ్య

"పదునొకండువందల పదిహేనుసంవత్సరములసంఖ్యను విమర్శించిన తప్పుసంఖ్య యగుచున్నది. పరీక్షితునకును నందునకును మధ్య గలకాలము రెండుతక్కువ పదిహేనువందల వత్సరము లగుచున్నది. పరీక్షితునకు సమకాలికుడగు మార్జారి మొదలు రిపుంజయునివరకిరువదిమంది రాజులు మగధరాజ్యమును వేయి వత్సరములు పరిపాలన సల్పియుండిరి. బార్హద్రథులు వేయివత్సరములు పరిపాలన సల్పియుండిరని నవమస్కంధమున జెప్పబడి యుండెను. వారి పిమ్మట ఐదుగురు ప్రద్యోతనులు 138 సంవత్సరములును, శిశునాగులు 360 సంవత్సరములును పృథివిని పాలించియుండిరి. ఆకారణమున 1115 సంఖ్య తప్పు సంఖ్య యగుచున్నది." అను భావము నిచ్చుచున్నది కావున ప్రథమపాఠము "ఏతద్వర్షసహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరమ్" అనియే స్పష్టముగ గన్పట్టుచున్నది.

విష్ణుపురాణము 4 వ అంశము 23 వ అధ్యాయమున జెప్పబడిన విషయములనుబట్టి బార్హద్రథులు భారతయుద్ధానంతరము మగధదేశమును 1000 సంవత్సరములు పాలించినటులను వారి యనంతరము ప్రద్యోతనులు 130 సంవత్సరములును, ప్రద్యోతనుల యనంతరమున శిశునాగులు 362 సంవత్సరములును పాలించినటుల 24 అధ్యాయమునను జెప్పబడి యున్నది. ఈవాక్యములనుబట్టి పరీక్షితుని మొదలు మహాపద్మనందుని పట్టాభిషేకమువరకు 1500 సంవత్సరములు గడచినటుల స్పష్టముగ గన్పట్టుచున్నది. పిమ్మట పరీక్షితునకును మహాపద్మనందునకును గల కాలవ్యవధిని తెలియజేయుచు "యావత్పరీక్షితో జన్మ....." అను శ్లోకమున జెప్పబడిన "ఏతద్వర్షసహస్రంతు జ్ఞేయం పంచాశదుత్తరమ్" అను వాక్యమునందలి "పంచాశదుత్తరమ్" అను వాక్యము "పంచశతోత్తరమ్" అనువాక్యమునకు మారు లేఖకప్రమాదమని స్పష్టముగ గన్పట్టుచున్నది. అటుల కాదని విష్ణుపురాణమును జెప్పిన గ్రంథకర్త పరీక్షితుని జన్మకాలమునుండియు మహాపద్మనందుని పట్టాభిషేచనమువరకు మధ్యగల కాలమున పరిపాలన సల్పిన రాజవంశములయొక్కయు రాజులయొక్కయు కాలపరిమితులను 1500 సంవత్సరములుగ జెప్పుచు వాని మొత్తము 1050 సంవత్సరము లని చెప్పియుండె ననుట అసంభవము, అసంగతము. మరియు కొన్ని ప్రాత ప్రతులయందీ శ్లోకము భాగము "ఏతద్వర్షసహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరమ్" అనియే గన్పట్టుచున్నది.

ఇటుల లేఖకప్రమాదజనిత మగు భిన్నపాఠాంతరము గల విష్ణుపురాణమునందలి

శ్లోకమునుబట్టి పరీక్షితుని జన్మకాలమునకును, నందుని పట్టాభిషేకకాలమునకును గల కాలవ్యవధి 1050 సంవత్సరము లయ్యెనని కన్పట్టుచుండుటచేతను, పరీక్షితుని కాలమున సప్తర్షులు మఘానక్షత్రమున నుండినటుల చెప్పబడియుండుటచేతను, నందుని పట్టాభిషేకకాలమున సప్తర్షులు పూర్వాషాఢా నక్షత్రమున నుండిరని భావించి మఘనుండి వరుసక్రమమున పూర్వాషాఢ పదునొకండవ నక్షత్రమగుచుండుటచే సప్తర్షు లొక్కొక్కనక్షత్రమున శతవత్సరము లుందురని చెప్పబడియుండుటచే ఆగణితము ననుసరించి పరీక్షితునికాలమునుండి నందుని పట్టాభిషేకకాలమునకు పదునొకండవ శతాబ్దము జరుగుచుండినటుల కన్పట్టు చుండుటచే, మూలమున కన్పట్టు భిన్నపాఠాంతరముల యథార్థరూపముల గనుగొను ప్రయత్నములు గావింపక భ్రమప్రమాదములకు లోనై ఆశ్వ ప్రకాశికాఖ్యవ్యాఖ్యాకారుడు సప్తర్షు లేనక్షత్రమున నుండునది కనుగొను విధానమున కడు ప్రయాసతో గావించిన వ్యాఖ్యను పురస్కరించుకొని సప్తర్షులు అశ్విన్యాదినక్షత్రముల వరుసక్రమముగ తక్కిన గ్రహములవలెనే ముందునకు (అనగా తూర్పుదిక్కునుండి పశ్చిమదిక్కునకు) నడచుచుండినటుల యెంచి కొందరు సిద్ధాంతముల గావించుచుండిరి.

సప్తర్షిమండలము తక్కిన గ్రహములవలె ముందునకు నడవక వెనుకకు నడచుచుండునటుల హైందవుల సిద్ధాంత మయ్యుండెనని పాశ్చాత్యసిద్ధాంతులు నయిత మంగీకరించి యుండిరి. సప్తర్షిమండలచలనమును గురించి కర్నల్ విల్ఫర్డు (Cornol Wilford) పండితుడు

"The Hindus have thought proper to connect their Chronology with an astronomical period of most strange nature. It is that of Seven Rishis o Seven Stars of the Wain which are sup. posed to go through the Zodaic in a retrograde motion in the space of 2700 years".
(Asiatic Researches Vol IX page 83.)

(హైందవులు తమచరిత్రాంశముల కాలములను మిక్కిలి వింతపద్ధతిమైన జ్యోతిషసిద్ధాంత సంబంధమగు యుగముతో సంధించి చెప్పుట (సంబంధము కలుగజేసి చెప్పుట) యుక్తమని తలంచియుండిరి. అయ్యది 2700 సంవత్సర కాలపరిమితితో క్రాంతివృత్తమును (జ్యోతిశ్చక్రమును- Zodaic) వెనుకనడకతో చుట్టివచ్చుననెడు సప్తర్షులు లేక సప్తతారల చలనముతో సంబంధము కలుగజేయుటయే యయ్యున్నది.) అని చెప్పియుండెను.

సప్తర్షిమండలము వెనుకకు (అనగా పశ్చిమమునుండి తూర్పునకు) నడచుచుండునా లేక ముందునకు (అనగా తూర్పుదిక్కు నుండి పశ్చిమమునకు) నడచుచుండునాయను సిద్ధాంతభేద మట్లుండ సప్తర్షు లేనక్షత్రమునందుండినది కనుగొనువిధానమున నీ దిగువ కనుబరచినరీతిగ మూడు సిద్ధాంతభేదము లుండినటుల కన్పట్టుచున్నది.

౧. సప్తర్షులలో తూర్పుదిక్కుగ నుండు తారలకు మధ్యసమముగ అర్ధరాత్రమున యే నక్షత్రము గన్పట్టుచుండునో సప్తర్షు లానక్షత్రమున నుండిరని. (ఇయ్యది పురాణవేత్తలు,వృద్ధగర్గాదుల మతమయినటుల గన్పట్టుచున్నది. వీరు పరీక్షితునికాలమున సప్తర్షులు మఘానక్షత్రమున నుండిరని చెప్పియుండిరి.)

౨. సప్తర్షు లుదయించు సమయమున ముందరభాగమున మొట్టమొదట గన్పట్టు పులహక్రతువులకు మధ్యభాగమునకు సమముగ ఎదుట (అనగా ముందరభాగమున) ఏ నక్షత్రము గన్పట్టునో యా నక్షత్రమున సప్తర్షు లుండిరని. (ఇయ్యది శ్రుతజ్ఞుల మతమయినటుల గన్పట్టుచున్నది. భావార్థదీపికాఖ్యవ్యాఖ్యాకారుడిమతము ననుసరించి చెప్పియుండినటుల గన్పట్టెడి. ఈసిద్ధాంతమున కలియుగాదిని అనగా పరీక్షితుని కాలమున సప్తర్షులు కృత్తికానక్షత్రమున నుండిరనుచున్నారు.

౩. సప్తర్షు లుదయించు సమయమున ముందరిభాగమున మొట్టమొదట గన్పట్టు పులహక్రతువులకు సమముగ దక్షిణోత్తరములకొకరేఖను లిఖించిన యారేఖ యేనక్షత్రమున నుండునో యానక్షత్రమున సప్తర్షు లుండిరని. (ఇయ్యది విష్ణుపురాణమునకు వ్యాఖ్య యగు ఆత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యయందు ప్రతిపాదింపబడిన సిద్ధాంతము. ఈసిద్ధాంతము ననుసరించియు పరీక్షితునికాలమున సప్తర్షులు మఘయందే యుండి రనుచున్నారు. ఈసిద్ధాంతమే సప్తర్షులు ముందునకు నడచుచుందు రను సిద్ధాంతము బయల్వెడలుటకు కారణమయి నటులగన్పట్టుచున్నది.)

ఈ సిద్ధాంతముల ననుసరించి ప్రస్తుత కాలమున సప్తర్షు లేనక్షత్రమున నుండునది కనుగొని కాలనిర్ణయము గావించెదము. ప్రథమసిద్ధాంతము ననుసరించి సప్తర్షులు ప్రస్తుతకాలమున హస్తానక్షత్రమున నుండినటులను, రెండవ సిద్ధాంతము ననుసరించి ఆర్ద్రా నక్షత్రమునందుండినటులను, మూడవ సిద్ధాంతము ననుసరించి పూర్వఫల్గునీనక్షత్రమున నుండినటులను గన్పట్టుచున్నది.

సప్తర్షు లొక్కొక నక్షత్రమున నుండు కాలపరిమితిని గురించియు ప్రస్తుతకాలమున కొందరు భిన్నాభిప్రాయులైనటుల గన్పట్టుచున్నది. పురాణాదులయందును, ప్రాచీన జ్యోతిషసిద్ధాంతగ్రంథములయందును స్థూలదృష్టిన శతవత్సరములకాలము సప్తర్షు లొక్కొక నక్షత్రమున నుందురని చెప్పబడియుండెనుగాని వాస్తవమున నావత్సరపరిమితి సరి కాదనియు, ఒక్కొక్క నక్షత్రమున 160 వత్సరముల పర్యంత ముండెదరనియు (శ్రీ) మహోపాధ్యాయ ఆచంట వేంకటరాయసాంఖ్యాయన శర్మగారు చెప్పియుండిరి. (శారద. Vol 2, parts 3, 4 & 5)వీరట్టియభిప్రాయముకలిగియుండుటకు కారణము కలియుగమునందు 653 సంవత్సరములకు కురుపాండవు లుండిరని చెప్పినవచనము

లాధారముగ గైకొని యుధిష్ఠిరునికాలమున సప్తర్షులు మఘయం దుండినటుల జెప్పబడియుం డుటచేతను, తామా వ్యాసమును వ్రాయుకాల మున సప్తర్షులు మఘయందుండిరని యెంచి, యుధిష్ఠిరుని కాలమునుండి తమకాలమువరకు సప్తర్షులు నక్షత్రమండలము నొకపరి చుట్టివచ్చి తిరిగి రెండవయావృత్తియందు మఘానక్షత్ర మునసుండినటుల భావించి, కాలనిర్ణయముగా వించదలపెట్టుటయేయైనటుల గన్పట్టెడి. సప్త ర్షులొకేపరి నక్షత్రమండలమును చుట్టి వచ్చి మఘయందుచేరిరనిన పురాణాదిప్రాచీనవాఙ్మ యమున చెప్పబడిన పరిమితి ననుసరించి యుధి ష్ఠిరుని కాలమునుండి తమకాలమువరకు ఇరు వదియేడు శతాబ్దములు గడచి యిరువదియెని మిదవ శతాబ్దము జరుగుచుండినటుల గన్ప ట్టును. దానినిబట్టి క్రీ. పూ. 8 శతాబ్దములో యుధిష్ఠిరు డుండినటుల జెప్పవలసి వచ్చును. ఈచిక్కును దాటుకొనుటకై పురాణాదులలో చెప్పబడిన కాలపరిమితి స్థూలదృష్టితో చెప్ప బడియుండెననియు సరికాదనియు త్రోసిపుచ్చి కలియుగాబ్దము 653 సంవత్సరమునుండి తమ కాలమునకు నలువదినాలవ శతాబ్దము జరుగు చున్నటులగన్పట్టుచుండుటచే సప్తర్షులొక్కొక నక్షత్రమున నూటఅరువది సంవత్సరముల కంటె యెక్కువకాలముండెదరని గణితము చేసియుండిరి. వీరును సప్తర్షు లేనక్షత్రమున నుండునది కనుగొను విధానమున తృతీయ సిద్ధాంతము ననుసరించియుండినటుల గన్పట్టెడి.

క్రీ. శ. 1931 వ సంవత్సరమున సప్తర్షులు పూర్వఫల్గునీనక్షత్రమున సంచరించుచుందురని శ్రీజగద్గురు శ్రీ శ్రీ శ్రీ కల్యాణానంద భారతీ మహాంతాచార్యస్వాములవారు నిర్ణ యించినటుల శ్రీయుత పోలూరు వెంకట సుబ్బయ్యశాస్త్రిగారిచే గుణితమయిన ప్రజో త్పత్తినామసంవత్సరపంచాంగమున నిటుల జెప్పఁబడియున్నది:—

"పౌర్ణమాస్యాం మార్గశీర్షే హ్యాదృష్టాస్సప్తర్షయో యుతాః, ఫల్గున్యాపూర్వయా శీత్రాగ్ని గగనేషు (5032) సమేకలా.

సప్తర్షీణాంతు యౌ పూర్వౌ దృశ్యేతేహ్యుదితౌ దివి, తయోస్తు మధ్యేనక్షత్రం దృశ్యతే యత్సమందివి.

బుధాయుస్తేన తిష్ఠంతి శతఖ్నొంమాసరుద్రకం (1100), తత శ్చభగణస్తేషాంతా సభారాబ్దసమ్మతాః. (2475;).

యదాపురామహా స్వాసన్ తదాకృష్ణో దివంగతః, యస్మిన్కృష్ణోదినంయాత స్తస్మిన్నేవ తదాహని,

ప్రతిపన్నంకలేర్యుగమితి పరాశరో బ్రవీత్, నకారకుస్ఫుటంతత్తు కల్యాణానంద భారతీ".

—ప్రజోత్పత్తినామసంవత్సరపంచాఙ్గమ్, ౨౧ పేజీ.

వీరి సిద్ధాంతమునుబట్టి ప్రస్తుతకాలమున సప్తర్షులు పూర్వఫల్గునీనక్షత్రమున నుండినటు లజెప్పచున్నారు. వీరు మూడవసిద్ధాంతమగు "సప్తర్షు లుదయించుసమయమున ముందర భాగమున మొట్టమొదట గన్పట్టు పులహక్ర తువులకు సమముగ దక్షిణోత్తరముల కొక రేఖను లిఖించిన యారేఖ యేనక్షత్రమున నుండునో యానక్షత్రమున సప్తర్షులుందు"రను

ఆత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యాకారునిమతము ననుసరించుచుండిరనుట స్పష్టము. ప్రస్తుతకాలమున నీసిద్ధాంతము ననుసరించి పులహక్రతువులకు సమముగ ఉత్తరదక్షిణముల కొకరేఖను లిఖంచిననయ్యది పూర్వఫల్గునీనక్షత్రమున నుండినటులనే గన్పట్టును. ఈసిద్ధాంతవాదులును పరీక్షితుని కాలమున సప్తర్షులు మఘానక్షత్రమున నుండినటుల జెప్పుచున్నారు. మరియు సప్తర్షులు అశ్విన్యాదినక్షత్రముల వరుసక్రమముగ తక్కిన గ్రహములవలెనే ముందునకు అనగా తూర్పునుండి పశ్చిమమునకు సంచరించుచుందురను సిద్ధాంతమును ప్రతిపాదించుచున్నారు. కలియుగము ప్రవేశమయి యిప్పటికి 5032(అయిదువేల ముప్పదిరెండు) వత్సరములు అనగా యేబదియొకటవ శతాబ్దము జరుగుచున్నటుల యొప్పుకొనుచున్నారు. మహాభారతయుద్ధమంతకు పూర్వమే జరిగియుండెననియు నొప్పుకొనుచున్నారు. ఇక వీరిసిద్ధాంతము ననుసరించి చూచిన పరీక్షితుని కాలమునుండి ప్రస్తుతకాలమువరకు సప్తర్షులు నక్షత్రమండలమును రెండుపర్యాయములు చుట్టివచ్చి మూడవ యావృత్తిలో మఘనుండి రెండవనక్షత్రమగు పూర్వఫల్గునీనక్షత్రమున ప్రవేశించినటుల గన్పట్టుచున్నది. దీనినిబట్టి సప్తర్షులు ఏబదియైదు నక్షత్రములలో సంచరించి యేబదియారవ (27 + 27 + 2) నక్షత్రమునకు వచ్చినటుల గన్పట్టుచున్నది. సప్తర్షు లొక్కొక్కనక్షత్రమున శతవత్సరము లుందురని పురాణాదిప్రాచీన వాఙ్మయమున చెప్పబడిన పరిమితి ననుసరించి పరీక్షితుని కాలమునుండియు ప్రస్తుతకాలమువరకును ఏబదియైదు శతాబ్దములు గడచి యేబదియారవ శతాబ్దము జరుగుచున్నటుల గన్పట్టుచున్నది. వీ రాధారముగ గైకొనిన విష్ణుపురాణమునందు సయితము

"తేన సప్తర్షయో యుక్తాః స్థితాబ్దశతం నృణామ్,
తేతు పారీక్షితే కాలే మఘాస్వాసన్ ద్విజోత్తమ".

అనియే చెప్పబడియున్నది. ఆత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యాకారుడును ఆకాలపరిమితిని అంగీకరించియే చెప్పియున్నాడు. ఈసిద్ధాంతము ననుసరించి కాలనిర్ణయము గావించిన కలియుగాదినుండి యిప్పటికి యేబదియైదు శతాబ్దములు గడచినటుల గన్పట్టుచున్నది. ఇయ్యది కలియుగము ప్రారంభమయి యిప్పటికి 5031 (అయిదువేల ముప్పదియొకటవ) సంవత్సరము జరుగుచున్నదను విషయమునకు ప్రతిబంధకముగ నున్నది. దీనినిబట్టి వాస్తవముగ జరుగుచున్న కాలపరిమితికంటె నాలుగుశతాబ్దములపై కాలమెక్కువగ జరుగుచున్నటుల గన్పట్టుచున్నది. ఈచిక్కును దాటుకొనుటకు సప్తర్షు లొక్కొకనక్షత్రమున నూరుసంవత్సరములు సంచరించుచుందురని ప్రాచీనవాఙ్మయమున గన్పట్టు సిద్ధాంతమును రూపుమాపి ఒక్కొక నక్షత్రమున పదునొకండువందల (1100) మానము లుందురనియు, నక్షత్రమండలమును 2475 (ఇరవైనాలుగువందల డెబ్బదియైదు) వత్సరములకు చుట్టివచ్చెదరనియు,

"తేన సప్తర్షయో యుక్తా స్తిష్ఠంత్యబ్దశతం నృణామ్".
అను మూలమునందలి శ్లోకపాదమునకు

"ఋషయస్తే నతిష్ఠంతి శతఘ్నం తూసరుద్రకం
(౧౧౧౦ మాసాః)

తతశ్చభిగణస్తేషాం కాసభారాబ్దసమ్మితః
(౨౮౭౫ సం.)"

అనుపాఠాంతరముల నిర్మించి తమ సిద్ధాంతము ననుసరించి కాలపరిమితిని సరిపుచ్చుచున్నటుల గన్పట్టుచున్నది. ఆత్మప్రకాశికావ్యాఖ్యను రచించిన శ్రీధరస్వామి మూలమున లేఖకప్రమాదజనితమగు శ్లోకమునందలి వాక్యములను మార్పుగావించకయే దానిని సమర్థించుటకై సప్తర్షు లేనక్షత్రమున సంచరించుచుందురో కనుగొను విధానమును గురించి కడు ప్రయాసపడి ప్రయత్నపూర్వకముగ మూలమునకు భిన్నముగ పులహక్రతువులకు సమముగ ఉత్తరదక్షిణముల కొకరేఖను లిఖించిన యారేఖ యేనక్షత్రమున నుండునో యానక్షత్రమున సప్తర్షులు సంచరించుచున్నటుల నెలుసుకొనవలసియుండు నని వ్యాఖ్యను రచించియుండెను. ఆవిధానము ననుసరించి సీకాలనిర్ణయములను గావించుపట్టున కల్గెడు ప్రతిబంధకములనుండి తప్పించుకొనుటకై మూలమున చెప్పబడిన పరిమితులనే తప్పని తుడిచివైచి నూతనకాలపరిమితుల నేర్పాటు గావించుచు మూలములనే మార్చవలసివచ్చుచున్నది. ఇటులమనము ప్రతిపాదించు సిద్ధాంతముల కనువగునటుల మూలమున చెప్పబడిన విషయములనే మన యిచ్చవచ్చినటుల మార్పులు గావించుచుండిన ప్రాచీనకాలములను నవీనకాలములకు దీసుకొనివచ్చుటకును, నవీనకాలములను ప్రాచీనకాలములకు నెట్టుటకును అవకాశము లేకుండునా? మన ప్రాచీనవాఙ్మయమున గన్పట్టు భిన్నభిన్నపాఠాంతరములు తాము గావించదలచిన సిద్ధాంతముల కనుకూలించునటుల కొందరు పండితవరేణ్యు లిటులనే మార్పులు గావించియుందు రని చెప్పెడు వారి వచనములయందేమాత్రమైనను యథార్థముండకపోవునా యని దలంచుట కవకాశము లేకపోలేదు.

మరియు సప్తర్షు లొకపరి నక్షత్రమండలమును చుట్టివచ్చుకాల మొకసప్తర్షియుగ మనియు, ఈ సప్తర్షియుగము దేవకాలమానమున ఏడుదివ్యవత్సరముల ఆరు దివ్యమానముల కాలమనియు చెప్పబడి యుండెను. ఒక్కొక దివ్యవత్సరము మున్నూట అరువది (360) మానవాబ్దములనియు చెప్పబడి యుండెను. ఈగణితపద్ధతి ననుసరించి సప్తర్షియుగము అనగా సప్తర్షు లొకపరి 27 (యిరువదయేడు) నక్షత్రములను చుట్టివచ్చు కాలపరిమితి దివ్యమానవత్సరపరిమితినిబట్టి జూచినను 2700 ($360 \times 7\frac{1}{2}$) మానవాబ్దము లగుచున్నది. ఇయ్యది సప్తర్షు లొక్కొకనక్షత్రమున మానవాబ్దమున శతవత్సరములు సంచరించుచుందురని మూలమున చెప్పబడిన పరిమితి కన్నివిధముల సరిపోవుచున్నది. దీనినిబట్టియు సప్తర్షు లొక్కొక్కనక్షత్రమున పదునొకండు వందల

మానము లుందు రనియు, ఇరువది నాలుగు వందల డెబ్బదియైదువత్సరములకొకపరి నక్షత్ర మండలమును చుట్టివచ్చుచుందు రనియు గావించెడు గణితము సరికాదని స్పష్టముగ జెప్ప దగియున్నది. మరియు పరీక్షితుని కాలమున మఘయందుండిన సప్తర్షులు ప్రస్తుతకాలమున పూర్వఫల్గునియం దుండిరనియు, సప్తర్షులు ముందుకు నడచుచుందు రనియు గావించెడు సిద్ధాంతములును సరిగావనియు కన్పట్టుచున్నది. ఈసిద్ధాంతప్రతిపాదనకు కారణమగు శ్రీధరస్వామికృతమైన ఆత్మప్రకాశికాఖ్యవ్యాఖ్యను రచించుకాలమున నాసిద్ధాంతముననుసరించి సప్తర్షు లేకాలమున నుండునదియు కనుగొని కాలనిర్ణయము గావించి చూచిన తాము సూచించినవిధానమునందలి లోపమును శ్రీధరస్వామి గ్రహించియే యుండును. శ్రీధరస్వామి యటుల కనుగొనుటకు ప్రయత్నించినటుల గన్పట్టుటలేదు. వీరి సిద్ధాంతము ననుసరించిచూచిన పరీక్షితుకాలమున సప్తర్షులు మఘయందుగాక పుష్యమినక్షత్రమునం దుండెననియు వెనుకనడకతో సప్తర్షులు సంచరించుచుందురనియు చెప్పిన సరిపోవును.

పురాణవేత్తలు, వృద్ధగర్గాదిసిద్ధాంతులును పరీక్షితునికాలమున సప్తర్షులు కృత్తికయందుండినటుల జెప్పియుండి రనుచున్నారు. ఈభేద మిదివరలో జెప్పియుండినటుల సప్తర్షులుండు నక్షత్రమును కనుగొనువిధానమునందు గల భిన్నాభిప్రాయములనుబట్టికలిగియుండెను. సప్తర్షులుండు నక్షత్రమును కనుగొనువిధానమున గల సిద్ధాంతభేదములలో మొదటిసిద్ధాంతమును అనగా సప్తర్షులలో తూర్పుదిక్కుగ నుండు తారలకు సమముగ అర్ధరాత్రమున గన్పట్టునక్షత్రము సప్తర్షులుండు నక్షత్రమని యెడు సిద్ధాంతము ననుసరించి పురాణవేత్తలు వృద్ధగర్గాదులును పరీక్షితుని కాలమునందు మఘయందుండిరనియు, రెండవసిద్ధాంతమును అనగా సప్తర్షు లుదయించుసమయమున ముందరిభాగమున మొట్టమొదట గన్పట్టు పులహాక్రతువులకు మధ్యను సరిగా ముందరిభాగమున అర్ధరాత్రమున గన్పట్టునక్షత్రము సప్తర్షులుండు నక్షత్రమనియెడి సిద్ధాంతము ననుసరించి శ్రుతర్షులు పరీక్షితుని కాలమున సప్తర్షులు కృత్తికయందుండిరనియు జెప్పియుండినటుల గన్పట్టుచున్నది. ఆయావిధానముల ననుసరించి చూచిన ప్రస్తుతకాలమున వృద్ధగర్గాదుల మతము ననుసరించి హస్తానక్షత్రమునందును, శ్రుతర్షులమతము ననుసరించి ఆర్ద్రానక్షత్రమునందును, సంచరించుచుండినటుల గన్పట్టుచున్నది. ఇక నీనినిబట్టి కాలనిర్ణయము గావించి చూచెదము.

ప్రథమసిద్ధాంతమునుబట్టి అనగా వృద్ధగర్గాదుల మతముననుసరించి ప్రస్తుతకాలమున హస్తానక్షత్రమున నుండు సప్తర్షులు, తక్కిన గ్రహములవలెనే ముందునడకతో సంచరించుచుందురను వారిసిద్ధాంతము ననుసరించి చూచిన మఘనుండి హస్తానక్షత్రము నాలవ నక్షత్రమగుటచే వార లొకపరి నక్షత్రమండల

మును చుట్టివచ్చి రెండవ యావృత్తిలో హస్తానక్షత్రమునకు వచ్చిరని దలచిన ముప్పదియొక్క నక్షత్రముల కాలము అనగా ఒక్కొక్క నక్షత్రమున శతవత్సరము లుందురని చెప్పబడియుండుటచే పరీక్షితుని కాలమునుండి యిప్పటికి ముప్పదియొకటవ శతాబ్దము జరుగుచుండినటుల గన్పట్టుచున్నది. కలియుగప్రవేశమయి యిప్పటికి 5032 సంవత్సరము లయ్యుండెనని అందరంగీకరించుచున్నారు. పరీక్షితుడు కలియుగప్రవేశకాలమునకు పూర్వము ముప్పదియేడు వత్సరముల క్రిందట అనగా మహాభారతయుద్ధము జరిగినసంవత్సరముననే జననమందియుండెనని చెప్పబడియుండుటచే పరీక్షితుని కాలమిప్పటికి 5032 సంవత్సరములకు తక్కువకాలము కానేరదు. కావున పరీక్షితునికాలమున మఘయందుండిన సప్తర్షులు నక్షత్రమండలమును రెండు పర్యాయములుచుట్టివచ్చి మూడవ యావృత్తిలో హస్తానక్షత్రమునకు వచ్చియుండిరని చెప్పవలసివచ్చుచున్నది. అట్లైన పరీక్షితుని కాలమునుండి సప్తర్షులు 58 (27+27+4) నక్షత్రముల కాలము అనగా యేబదియెనిమిది శతాబ్దముల కాలము గడపియుండినటుల గన్పట్టుచున్నది. ఇయ్యది అన్ని విధముల చరిత్రాంశములకు విరుద్ధముగనుండినది. కాలనిర్ణయమున దాదాపుగ నేడు శతాబ్దముల కాలవ్యత్యాసము కన్పట్టుచున్నది. ఈకాలవ్యత్యాసము సప్తర్షులు గ్రహములన్నిటివలెనే ముందుకు నడచుచుందురను వారిసిద్ధాంతము ననుసరించి గణితముచేయుట వలన కలుగుచున్నది. ఇక సప్తర్షులు వెనుకకు నడచుచుందురను సిద్ధాంతము ననుసరించి జూచెదము. మఘనుండి హస్తానక్షత్ర మిరువదియైదవ నక్షత్రమగుచున్నది. సప్తర్షులు మొదటి యావృత్తిలోనే మఘయందుండిరనిన యిప్పటికి పరీక్షితుని కాలమునుండియు యిరువదినాలుగు శతాబ్దములు గడచి యిరువదియైదవశతాబ్దము జరుగుచున్నటుల గన్పట్టును. ప్రస్తుతము కలియుగాబ్దము 5032 సంవత్సరము జరుగుచుండుటచే సప్తర్షులొకపరి నక్షత్రమండలమునుచుట్టివచ్చి రెండవయావృత్తిలో హస్తానక్షత్రమునకు వచ్చినటుల జెప్పదగియున్నది. అట్లైనచో సప్తర్షులు పరీక్షితుని కాలమునుండి యేబదినాలుగు నక్షత్రములు చుట్టివచ్చి యేబదియైదవ నక్షత్రమగు హస్తానక్షత్రమున (27+25) నుండిరనియు, పరీక్షితునికాలమునుండి యేబదియొకటవ శతాబ్దము జరుగుచుండెననియు గన్పట్టుచున్నది. పరీక్షితుని కాలమున మఘయం దుండిరి. యుధిష్ఠిరుని కాలమునను మఘయందుండినటులను, కలియుగప్రవేశమునకు పూర్వము 75 (డెబ్బదియైదు) వత్సరములక్రిందట మఘయందు ప్రవేశించి యుండిరనియు, కలియుగము 25 (యిరువదియైదు) వత్సరములు గడచిన పిమ్మట ఆశ్లేషయందు బ్రవేశించియుండిరనియు చెప్పబడియుండెను. ప్రస్తుతకాలమున హస్తానక్షత్రమున బ్రవేశించి యేడు వత్సరములు గడచియుండెను. దీనిని బట్టి మఘయందు సప్తర్షులిప్పటికయిదువేల నూటయేడు వత్సర

ములు (5032 + 75) క్రిందట అనగా క్రీ. పూ. 3177 (5107-1930) సంవత్సరమున ప్రవేశించియుండిరనియు, ఆశ్లేషా నక్షత్రమున క్రీ. పూ. 3077 సంవత్సరమున ప్రవేశించియుండిరనుట సిద్ధము. దీనినిబట్టి సప్తర్షి యుగమున ప్రస్తుతము యేబదిరెండవ శతాబ్దము జరుగుచుండినట్లు గన్పట్టుచున్నది. ఇయ్యది అన్నివిధముల చరిత్రాంశములకు సరిపోవుచున్నది. ఈ గణితమును బట్టి సప్తర్షులు మఘయందు కలియుగమునకు పూర్వము డెబ్బదిరెండు సంవత్సరములనుండి కలియుగము తర్వాత 25 (యిరువదియైదు) సంవత్సరములవరకు నుండినట్లుల స్పష్టముగ దెలియుచున్నది. కావున సప్తర్షులు పురాణవేత్తలు, వృద్ధగర్గాదులు జెప్పినట్లు పరీక్షితు యుధిష్ఠిర కాలముల యందు మఘానక్షత్రమున నుండిరనియు, వారలొక్కొక్క నక్షత్రమున శతవత్సరములు పర్యాంతము సంచరించుచు వెనుకనడకతో నక్షత్ర మండలమును చుట్టివచ్చుచుండిరనియు, ప్రస్తుతకాలమున హస్తానక్షత్రమున సంచరించుచుండిరనియు జెప్పదగియున్నది.

సప్తర్షులే నక్షత్రమున సంచరించునది కనుగొనువిధానమున రెండవ సిద్ధాంతము ననుసరించి పరీక్షితుని కాలమున సప్తర్షులు కృత్తికా నక్షత్రమున నుండినట్లుల శ్రుతిస్మృతులు జెప్పియుండిరని యిదివరలో కనబరచియుంటిమి. ఆవిధానమున ప్రస్తుతకాలమున సప్తర్షులు ఆర్ద్రానక్షత్రమున సంచరించు చుండినట్లుల గన్పట్టుచున్నది. సప్తర్షి మండలము ముందునకు నడచుచుండునని యెంచిన కృత్తికనుండి ఆర్ద్ర నాల్గవనక్షత్రమగుచున్నది. కలియుగము ప్రారంభమయి 5032 సంవత్సరము జరుగుచుండుటచేతను, కలియుగప్రారంభమున పరీక్షితుని పట్టాభిషేకమగుటచేతను, పరీక్షితుని కాలమునుండి సప్తర్షి మండలము రెండు పర్యాయములు నక్షత్రమండలమును చుట్టివచ్చి మూడవయావృత్తిలో ఆర్ద్రానక్షత్రమునకువచ్చియుండినట్లుల జెప్పవలసివచ్చుచున్నది. అట్లయినచో నిప్పటికి ఏబదియేడు శతాబ్దములు గడచి యేబదియెనిమిదవ శతాబ్దము (27 + 27 + 4) జరుగుచున్నట్లుల జెప్పవలసివచ్చుచున్నది. ఇయ్యది యథార్థముగ జరిగినకాలమునకంటె దాదాపుగ నేడుశతాబ్దములకాల మెక్కుడుగ జరిగినట్లుల గన్పట్టుచున్నది. ఈవ్యత్యాసము సప్తర్షి మండలము ముందుకు నడచుచుండునను వారల సిద్ధాంతము ననుసరించి గావించిన గణితమునుబట్టి కలుగుచున్నది. కావున వెనుకకు నడచుచుండునను సిద్ధాంతము ననుసరించి గణితము జేసిచూచెదము. కృత్తికనుండి ఆర్ద్ర యిరువదియైదవ నక్షత్రమగుచున్నది. కలియుగప్రారంభమయి యేబదియొకటవ శతాబ్దము జరుగుచున్నట్లు జెప్పబడియుండుటచే సప్తర్షి మండలమొకపరి నక్షత్రమండలమును చుట్టివచ్చి రెండవ యావృత్తిలో ఆర్ద్రయందు ప్రవేశించియుండెనని చెప్పిన యేబదియొక్క శతాబ్దములు గడచి యేబదిరెండవ శతాబ్దము (27 + 25) జరుగుచున్నట్లుల గన్పట్టుచున్న

# ఛాయాచిత్రములు



తామర అగడ్త

(పాలఘాటుదుర్గము)

ఛాయాచిత్రకారుడు: యం. కె. రంగస్వామయ్యంగారు

శ్రీ కృష్ణాలయము-పుష్కరిణి
(అంబలప్పుళ)



ఛాయాచిత్రకారుడు: యం. కె. రంగస్వామయ్యంగారు.

# మేఘదశకము*

మాడభూషి మఠం వేంకటాచార్యులుగారు, B. A.

మలినుఁడొ గర్జనపరుఁడో-బలుచపలాత్మకుఁడొ తాను బడయును ఘనముం
బలె జీవనదానగుణా-కలితుం డుపలాల్యతను జగంబున నెప్డున్.

ఘనవంశజుఁడో శుద్ధుఁడొ-తన కార్ద్రాశయము లేక తనరెడు పురుషుం
డొనర లఘుత్వము నొందును-దనరు శరన్మేఘమట నిదర్శన మగుచున్.

పరమాపదఁ బొందినను-బరోపకృతి నే మనీషి వదలఁడు వడియా
కరువలి పీడలఁబడియును-దిరుగుడు వడుచుండు మొయిలు దెగఁ గురియుచు నే.

అలలగమి దుర్విగాహము-జల మాన నయోగ్య, మట్టి సాగరపు జలం
బుల వంగి త్రావి కురిసి స-కలోపభోగ్యముగఁ జేయుఁ గద జలదంబుల్.

పాత్రునకుఁ గొంచె మిడియు, న-పాత్రుల దాతయును జూడ బహుమాన్యుఁడె యౌ.
గోత్రాద్రుల కధికంబును-ధాత్రికిఁ గొంచె మిడు వారిదంబును బోలెన్.

ధర నాఢ్యుఁడయ్యు లుబ్ధుం-డరయంగాఁ గీర్తిశూన్యుఁ డాతని ధనముల్
పరుఁ డొనఁగి వదాన్యుం డగు,-నరసంబుగ జలధినీట జలదము వోలెన్.

ఒనరించెడు నుపకారము-ధనహీనుండయ్యు దాత దానెట్టులైనన్
వనదము గతాంబువయ్యును-నొనరుచు వేసవిని నీడ లొనఁగి సుఖంబున్.

నరునకుఁ బరోపకర్తృత-ధర నభ్యాసజము గాదు దా సహజం బె
వ్వరివలనఁ గఱచె మేఘము-గురియంగా నాతపార్తకుతుకరసంబున్.

జనులకుఁ బరోపకారినిఁ-గనినంతనె జాతిపోవుఁ గల దుఃఖంబుల్
కనినంత గ్రీష్మపుం దుది-వనదముఁ గనకుందురే యపారముదంబున్.

స్వయముగ నుపకారి నిరా-శ్రయుఁడయ్యు నొసర్చు నొరుఁ బ్రశస్తుఁడు గాఁగన్
బయల మొయి లనవలంబం-బయి యుండియు నరుల కిడు స్థిరామోదంబున్.

---

* ఇది తిరుపతిపురవాసి కీ. శే. విద్వాన్ కపిస్థలం రంగాచార్యులవారి సంస్కృతభాషలోని "సుభాషిత శతకము" నందలి మేఘదశక మను పదిశ్లోకములకుఁ దెనుఁగు.

# చోడభక్తిరాజు మద్రాసు మ్యూజియము తామ్రశాసనము

టి. యన్. రామచంద్రన్ గారు, M. A.

ఈ తామ్రశాసనము నూజివీడు ప్రాంతమున బయలుపడి, ౧౮౭౩ వరకు నూజివీడు జమీందారుగారి వశమున నుండెను. ఆనాటి వారు దీని మద్రాసుమ్యూజియమునకిచ్చివేసిరి. ఈశాసనమును గురించి సూయెల్ దొరగారు వ్రాసిన విషయమునకై వారు రచియించిన 'లిస్ట్స్ ఆఫ్ ఇన్స్క్రిప్షన్స్ అండ్ స్కెచ్ ఆఫ్ ది డైనాస్టీస్ ఆఫ్ సదరన్ ఇండియా', పుట ౨౮-౨౯ (౧౮౮౪) అను గ్రంథమును చూడవలెను. ఏకారణముననో ఇది యింతవరకు ప్రకటింపబడలేదు. ఇది చాల చారిత్రప్రాముఖ్యముగల శాసనమగుటచేత దీని నిప్పుడు ప్రకటించుచున్నాను.

**ఆకారాదికములు**

శాసనమున మూడు రేకులు కలవు. ఇవి యొకకడియమున గ్రుచ్చబడియున్నవి. ఈకడియపుకొనలు మనుష్యప్రతిమ గీయబడిన యొకముద్రికయందు అతుకబడియున్నవి. ముద్రికమీది మనుష్యరూపము దేనికి సంకేతమో తెలియరాదు. కంఠమువరకు చేతులు పైకెత్తి, నడచుచున్నట్లో నృత్యముచేయుచున్నట్లో యీరూపము గీయబడినది. ఇటువంటి రూపములనే చోళరాజైన మొదటిరాజరాజు (క్రీ.శ.౯౮౫-౧౦౧౨) రాగినాణెములమీదను గాంచగలము. ముద్రిక వ్యాసము ౨×౧ అంగుళములు. కడియమువ్యాసము ౪ అంగుళములు. శాసనమును జదువుటకు కడియమును నేనె కోసితిని. రేకుల పొడువు ౮¼ అంగుళములు, వెడల్పు ౪ అంగుళములు. రేకుల కొనలు ఇంచుక మందముగను, ఎత్తుగను తీర్చబడియుండుటవలన శాసనము సురక్షితమయియున్నది.

**లిపి : భాష**

వ్రాత స్పష్టముగ నున్నది కాని పంక్తులు సరిగాలేక ఒకదానినుండి మఱియొకదానిలోనికి పోవుటచేత శాసనమును జాగ్రత్తతో చదువవలసియున్నది. అక్షరములు లోతుగ చెక్కబడలేదు. కొన్నికొన్నిచోటుల అవి కనబడీకనబడనట్లున్నవి. ప్రాతతెలుగున గ్రామసీమలను వివరించు కొద్దిపంక్తులు (౪౦-౫౪) తక్క మిగిలిన శాసనమంతయు సంస్కృతభాషను గలదు. శాసనలిపి ప్రాతతెనుగు. ఇందలి యక్షరములలో ననేకము లిప్యంతరరూపములను పొందినవి. ౬౧ పంక్తులున్న ఈ శాసనమున ౨౪ శ్లోకములు కలవు. వర్గాను నాసికమునకు బదులుగ అనుస్వారము వాడబడెను (ఉదా: ప్రసంన, గంగ, చంద్ర). 'ఏ' వర్ణమున కిప్పటిరీతి నెగువ వత్వములేదు, 'ద',

'డ'లకు భేదము స్వల్పము. భక్తిరాజుకొడుకగు అన్నదేవచోడుని రాజమహేంద్రవరము మ్యూజియము శాసనమునందువలె 'డ'కు కుడిప్రక్క దిగువ వంపుకలదు. 'బ'వర్ణమునకు తలకట్టిచ్చిన ఈశాసనమున 'భ'వర్ణ మేర్పడుచున్నది. దాదాపుగ సత్వరముల కన్నిటికి తలకట్టు కలదు. రేఫము వలపలిగిలకరూపమున వ్రాయబడినది. అనుస్వారమునకు పరముగనున్న యక్షరములకు ద్విత్వము కలదు. అనుస్వారము ఉండవలసిన చోట్ల నుండకపోవుటయు (పం. ౩౧. స్వపాలా[ం*]), అనావశ్యకములగు చోట్లనుండుటయు (పం. ౧౭. వంర్ణ్ణపయుమ్) కూడ గలదు. హల్లులు కొన్నిచోట్ల ద్విత్వము చెందనివి (ఉదా:—పం. ౮. సూర్య్యే; పం. ౧౧. భగ్గ; పం. ౨౧. బాంధవియ్య). 'ళ', 'ష', 'శ'లు చాళుక్యలిపిరూపములతోనే కలవు. కొన్నికొన్నిచోట్లను 'ఫ'కును (పం. ౧౧, ౨౮), 'బ'కును (పం. ౧౯) 'భ' గా వ్రాయబడినది. 'డ' కు బదులు 'ట' వ్రాయబడిన చోట్లును కలవు (పం. ౨౮).

శాసనవిషయము

శాసనవిషయము సంగ్రహముగ నిట తెలుపబడును. పూర్తివివరములకు శాసనానువాదము చూడదగును. సూర్యవంశమున మను భగీరథ, ఇక్ష్వాకు, కకుత్స్థ, రఘు, రామ, అరికాల, కరికాల, నల్లభీమాది రాజు లుదయించిరి. నల్లభీముని పిదప దోహత్తినారాయణుడను నామాంతరముగల దామభూపతి కలిగెను. ఇతని కొడుకు సోమన్నపాలుడు. సోమన్నపాలుని కుమారుడు గంగాపతుడు. ఇతడు చంద్రవంశసముద్భవుడయిన కామభూపాలుని కుమార్తెను, వేంగభూపతి సోదరియు నగు ఇరుగాంబను పరిణయమాడెను. గంగాపతిని తనయుడు చోడ, కామరాజు అను నామాంతరములుగల భక్తిరాజు. ఇతడు శివభక్తుడు; శత్రుసంహారమునకుగండభేరుండము; రాయవేశ్యాభుజంగబిరుదాంచితుడు. ఈతడు దిగ్విజయమునకై వెడలుచు శ్రీపర్వతమునకేతెంచి యచ్చట విశ్వనాథు డను పేరుగల శ్రీవిశ్వేశ్వరశివాచార్యుని దర్శించి, [illegible]పరమశిష్యుడై యాతనికి శకవర్షము ౧౨౭౭-వ సంవత్సరము కార్తికసోమవారమున కంప్వకొల్లు అనుగ్రామమును దానముచేసెను. ఈ దానమును తెల్పుటకే యీశాసనము పుట్టినది.

శాసనయోగ్యత

క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దియందును పదునైదవ శతాబ్ది ప్రారంభమునను, ఇప్పటి గోదావరి విశాఖపట్టణము జిల్లాలున్నలుగా గల దేశమును పరిపాలించినట్టియు, సూర్యవంశపు చోడులమని చెప్పుకొనినట్టియు దాదాపుగ నింతవరకు తెలియరాని యొకమాండలికవంశమునుగూర్చి తెలుపుటయందే ఈశాసన ప్రాముఖ్యము కలదు. ఈ చోడులనుగూర్చిన వృత్తాంతము క్రిందిశాసనములనుబట్టి తెలిసికొనదగును:

నెం॥ ౧౪౫ దక్షిణహిందూదేశశాసనసంపుటములు ౫, పు ౫౫
,, ౧౩౪౭ ,, ,, ౪, పుట ౪౭౪
,, ౧౩౪౮ ,, ,, ,, ,, ,,
,, ౮౬౫ ,, ,, ౬ పుట ౩౩౪
,, ౨౫౪ మద్రాసు శాసనశాఖనివేదిక ౧౯౦౫
,, ౨౯౩ ,, ౧౯౨౦
,, ౧౬ తామ్రశాసనము ౧౯౧౭-౧౮

రాజమహేంద్రవరము మ్యూజియము నందలి అన్నదేవచోడుని శాసనము (ఆంధ్రదేశీయేతిహాసముసంఘ పత్రిక సం. ౧, సం. ౪, పుట ౧౭౨-౧౮౯).

ఈపై శాసనముల ననుసరించి యీచోడ వంశము ఆంధ్రదేశమున వేఱువేఱు భాగముల బరిపాలించిన తెలుగుచోడులు, వెలనాటిచోడులు, రేనాటిచోడులు మొదలగు నితర చోడవంశములకు భిన్నమైన దని తెలియుచున్నది. క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్ది మొదటిభాగమున మాండలికు లనేకు లెవరికి వారె గొప్ప రాజ్యములను నిర్మించుటకు బ్రయత్నించి పరస్పరము కలహించుచు వచ్చిరి. కాకతీయసామ్రాజ్యము విచ్ఛిన్నమయిన పిదప సర్వాధికారదక్షులైన మహారాజు లెవ్వరును లేకపోవుటచేత కాకతీయసామంతులు వేఱువేఱు చిన్నసంస్థానముల నేర్పఱుచుకొని రాజ్యము చేయజొచ్చిరి. ఈ కాలమున సామ్రాజ్యనిర్మాణమునకై కళింగగజపతులు (గాంగులు)ను, కొండవీటి రెడ్లును, దేవరకొండ, రాచకొండ వెలమలును, విజయనగర కర్నాటులును, కలుబరిగి బహమనీసుల్తానులును పరస్పరజయాకాంక్షతో పోరాడి దేశమును సంక్షోభింప జేసిరి. ఈతరుణముననే మన శాసనమునందలి చోడులు అధికారమునకు వచ్చిరి.

అన్నదేవచోడుని రాజమహేంద్రవరము మ్యూజియము శాసనము ననుసరించి వీరెవరి పక్షమో యొకరి పక్షము చేరి యాపోరాటములలో జోక్యము కలిగించుకొనుచుండినట్లు తెలియుచున్నది. ఆశాసనమునుబట్టి అన్నదేవచోడుడు కర్ణాటభూపతులతోడి పోరాటమున తురుష్కునికి (ఫిరోజ్‌షా బహమని) సహాయపడి వారల నోడించినట్లు తెలుపబడినది. శాసనములందీచోడు లెంతయో గొప్పగా పొగడబడినప్పటికి వా రెప్పుడును మాండలికులుగానె ఉన్నస్థితిని బడసినట్లు కనబడదు. వారి శాసనముల ననుసరించి వారుశివభక్తు లనియు, దాక్షారామము, మహానందీశ్వరము, త్రిపురాంతకము, శ్రీశైలము, పట్టిసము, కాశీ మొదలగుక్షేత్రములందు శివాలయములకును, మన శాసనప్రతిగ్రహీతయైన విశ్వనాథునివంటి బ్రాహ్మణపండితులకును గొప్పదానములు చేసిరనియు తెలియుచున్నది.

మన శాసనమునందును, అన్నదేవచోడుని రాజమహేంద్రవరము మ్యూజియము శాసనమునందును దెలుపబడిన వీరి వంశావతారక్రమములనొండొంటితో సరిపోల్చిచూతము:-

**మద్రాసు మ్యూజియము శాసనము**

నల్లభీముడు
|
దామభూపుడు = లక్ష్మి
|
సోమనృపతి = సూరాంబిక
|
గంగాధరుడు = ఇరుగాంబ
|
భక్తిరాజు

**రాజమహేంద్రవరము మ్యూజియము శాసనము**

..........=అన్నమాంబ
|
ఏఱువ భీముడు = ప్రోలాంబిక
|
దామనృపాలుడు = లక్ష్మి
|
సోమభూపతి = సూరాంబిక
|
గంగాధరుడు = ఇరుగాంబ
|
కామరాజు అను భక్తిరాజు=అన్నమాంబ
|
అన్నదేవుడు = ఇరుగాంబిక
|
వీరభద్రుడు.

పై వంశవృక్షములను బరిశీలించిచూచినచో మన శాసనమునందలి నల్లభీముడే అన్నదేవచోడశాసనమున ఏఱువ భీముడని పేర్కొనబడినట్లు తెలియగలదు. ఇతని పరాక్రమకార్యములు నుగ్గడించుచు కొన్ని చాటువులు కలవు*. రాజమహేంద్రవరశాసనమును ప్రకటించిన శ్రీయుత పి. అప్పారావుగారు ఏఱువ భీమునికి మైలమ భీము డనునది నామాంతర మని వ్రాసియున్నారు. ఈభీమునికి మైలమ భీముడను పేరు అతని తల్లినిబట్టిచే కలిగినదనుటలు(అట్లే తోచును)-వారియూహాసరియైనది కాదని చెప్పవలెను; ఏలన వారు ప్రకటించిన రాజమహేంద్రవరము శాసనమువలననే అతనితల్లి అన్నమాంబయని తెలియుచున్నది. ఏఱువభీమునికి నల్లభీము డనుపేరు వర్ణమునుబట్టియో, ప్రవర్తనునుబట్టియో కలిగియుండును. ఇతనిభార్య ప్రోలాంబిక. నల్లభీముని మునిమనుమడగు గంగాధరునివఱకు రెండువంశవృక్షములందలి పేర్లును భార్యలపేర్లతోగూడ సరిగ సరిపోవుచున్నవి. రాజమహేంద్రవరశాసనమున గంగాధరునికి 'అరిగండరగండ'డను బిరుదము కలదు. అంతియ కాక అది గంగాధరుని కొడుకగు భక్తిరాజును కామరాజని పేర్కొనుచున్నది. గంగాధరునిభార్య యగు ఇరుగాంబ చంద్రవంశజుడగు కామభూపతి కూతు రగుటచేత

---

* ఉ. ఏఱువభీమ! నీ పగతు లెక్కిన కొండలు వంపిలాక్షులై
[redacted]ట్రి ఘోర వనదుర్గములన్ వనితా వియోగులై
పాఱని త్రోవలుం దినని పండ్లును నాకని గూరలుప్పగా
నేఱని కట్టెలుం గలవె యీ లవణాంబుధివేష్టితా వనిన్.
—శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్యమణిమంజరి, పుట 76. (Ed: 1913)

కావచ్చును, తాతపేర భక్తిరాజున కసలు కామరాజను పేరు కలిగియుండును. చంద్రచూడునిపై నాతనికి గల యత్యంతభక్తిమూలమున కామరాజు భక్తిరాజనామాంకితుడయ్యె ననియు, నీతనిభార్య అన్నమాంబ యనియు రాజమహేంద్రవర శాసనమున గలదు. భక్తిరాజన్నమాంబలకు కుమారుడు అన్నదేవ నోడుడు. ఇతనికి ఇరుగాంబికవలన వీరభద్రుడను కుమారుడు కలిగెను. ఇంతకంటెను మన కీవంశమునుగూర్చి యేమియు దెలియదు.

మనశాసనము భక్తిరాజాచరించిన పరాక్రమకార్యము లేవియు వెలుపుటలేదు. రాజమహేంద్రవరశాసనము ననుసరించియే మన శాసనదాతకు సంబంధించిన విషయములనేకములు తెలియుచున్నవి. భక్తిరాజను నామాంతరముగల కామరాజు తనపేర కామపురియను నొకనగరమును గట్టించెను. ఆంధ్రదేశావతంసముగ నుండిన యానగరమునకు కల్యాణమను నామాంతరము కలదు. యీనగరముననే భక్తరాజు గుంపురాండి(గుండు పురాండి) నగరప్రాంతమున తోరాటిలైన బాగ్గలాది యవననాయకులను జయించెను; ప్రాగ్దేశను పంచధారయుద్ధమున గజపతి నోడించి, కొప్పుల పతిని సింహాసన మెక్కించెను; భరణిపాటిపురి సమీపమున జరగినయుద్ధమున సింగభూతలపతిని జయించెను; పెదకొండపురిసమీపమున జరగిన యుద్ధమున డబరుఖాను ప్రముఖులైన రక్తోబలములను (మహమ్మదీయ బలములై యుండునేమో) జయించెను; సూరవరపట్టణసన్నిధానమున అన్నపోతన్నపతిని[1] నిర్జించెను.

మన శాసనమువలన తెలియవచ్చిన గ్రామముకాక భక్తరాజు పోలిదేవయ్యకోరిన పరిస్థాన ఆసుకూరు, ఆముదాలపల్లి యను రెండు గ్రామములనుకూడ దానముచేసినట్లు తెలియవచ్చుచున్నది[2]. ఇతనికి పూర్వము ముమ్మడి ప్రోలవరము (గోదావరిజిల్లా యందలి ముమ్మడి పోలవరముకావచ్చును) రాజధానిగ నుండినట్లు తెలియుచున్నది.

భక్తరాజు నూతనరాజధానిని నిర్మించి దానికి "కామపురి"యని పేరుపెట్టెను. కాని యీతని కుమారుడైన అన్నదేవుని కాలమున ముమ్మడిప్రోలవరమే మరల రాజధానిగ నుండెను[3].

1. ఇతడు కొండవీటిని పాలించిన ప్రోలయవేముని కొడుకు:—అన్నవేముని వనపల్లి తామ్రశాసనము— E. I. Vol. III, p. 59-60.

2 సీ. చపురగిరిమేరు జెలువార గుండెలం బూజగావించిన పుణ్యమూర్తి
కడిమిమై నిరుపమ్నుగండనిచే మల్లికార్జున కుత్పలం బర్థిం బడసెం
గొలని రామ...లన లింగాల.........రి మేతోడ
భక్తిరాజాఖ్యనేం బర్వతేశ్వరునకు నర్పించె జెరునాడు నామునూరు
నరుదెం ద్రపురగామికకుం కాముదాలపల్లె, రాయవేశ్యాభుజంగు వల్లాప యిచ్చె
నట్ట పౌరుష..............., పోలిదేవయ్య చెన్నారు పుణ్యమూర్తి.
—శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము, ఆశ్వా 1, ప 16.

3. M. E. R. 1912, p. 86.

అన్నదేవుని దానధర్మములను, దిగ్విజయములను వివరించునట్టి యాధారములు పెక్కులు అదృష్టవశమున మనకు లభించి యున్నవి. అందు రాజమహేంద్రవరము మ్యూజియము తామ్రశాసనమునందు ఇతని దిగ్విజయవృత్తాంతము ఈవిధముగ తెలియుచున్నది :

ఈ అన్నదేవుడు గొప్పసైన్యమునకు అధిపతియై తన కుమారుడగు వీరభద్రుని సహాయముచే తనశక్తిని ప్రోగుచేసుకొనెను (అనగా విజృంభించెను). ఇందుచే సీతని వంశములో సీతడే గొప్పవీరుడని ఇతనికి ప్రఖ్యాతి గలిగెను. తురుష్కరాజు (బహమనిరాజుగా నుండవచ్చును)తో చేరి కర్ణాటరాజుల బలమును ధ్వంసపఱచి జగ్గవాగు మొదలగు ననేకపట్టణములను స్వాధీనము చేసికొనెను. తర్వాత దాక్షారామ్యరాజులను 'అత్తిలి' సమీపమున నోడించి తనశరణుజొచ్చిన శత్రువులను అభయమిచ్చి రక్షించెను. తన భావమఱది యగు 'పన్నుండి' (పనయుండి) రాయ సాయమున తనస్నేహితుని (ఈతని పేరేదో తెలియదు) రక్షించుటకు గౌతమీ (గోదావరి) నదీతీరస్థమగు కొంకరపర్తి (కొకరపర్తి) అనుప్రదేశమునందు కన్నడరాజులను, ఇతర శత్రురాజులను పరిమార్చెను. తనకీర్తి పెంపొందుటకై, యుద్ధములో జయింపబడి తన్ను శరణుజొచ్చిన కాటయవేమవంశీయరాజులను రక్షించెను. "ఈ కాటయవేమ వంశీయు లెవరు", "వీరెట్లు అన్నదేవునిచే జయింపబడి రక్షింపబడిరి" అను ప్రశ్నలకు శ్రీయుతులు అప్పారపుగారు తగిన ఉత్తరములు నిచ్చియున్నారు.[1] భక్తిరాజు కుమారుడైన అన్నదేవుని మొదటి శాసనము శకము ౧౩౧౦ నాటిదిగా[2] తెలియవచ్చుచున్నది.

సూర్యవంశరాజగు శ్రీగ్రనశక్తియొక్క కూతురును, పైనిచెప్పబడిన పన్నుండిరాజునకు సోదరియు నగు 'ఇనుగాంబిక' యను నారీమణిని ఈ అన్నదేవుడు వివాహమాడెను. పెన్నుండి యనునాతడు ఉండిరాజు సోదరుడై యుండవచ్చును. ఈ యుండిరాజులు (ఉండిరాజు, పన్నుండి) తాము సూర్యవంశమని యు, హరితగోత్రోద్భవులమనియు చెప్పుకొనుచున్నారు. వీరు మన తెనుగుచోడులకు అవసరములందు సాయముచేసిరి. రావులపర్తి తామ్రశాసనము ననుసరించి[3] ఈయుండిరాజు బ్రాహ్మణులకు ఉండేశపురిమను నామముతో రావులపర్తి యను గ్రామమును దానముచేసెనని తెలియవచ్చుచున్నది. ఈతని రాజధాని సూరవరము —(గోదావరిజిల్లా భద్రాచలం తాలూకాలో నుండు సూరవరములు రెంటిలో నొకటి కావచ్చును)—అనియు, పై శాసనము వలననే తెలియవచ్చుచున్నది. ఈశాసనము

1. J. A. H. R. S. 1927, Vol. 1, No. 4, pp. 177-180.
2. M. E. R., 1905, No. 254.
3. M. E. R., 1917-18, C. P. No. 16., Part II, P. 173.

శకము ౧౩౦౮ నాటిది. కనుక భక్తిరాజు కాలమునాటిదే యగును. ఈశాసనమునుబట్టి మనకు తెలియవచ్చు ఉండిరాజుల వంశావళి క్రమ మిట్లు:—

సూర్యవంశము - హారితగోత్రము

దేవరాజు

|

ఉండీశ = (బి)మ్మి దేవి

|

తిమ్మరాజు = వీరమదేవి

|

ఉండిరాజు = రుద్రమదేవి (మానవ్యస గోత్రము — చాళుక్యవంశజగా నుండవచ్చును).

విశాఖపట్టణముజిల్లాలో చేరిన సింహాచలమునందు దొరికిన ఒకానొకశిలాశాసనమును బట్టి యీ వంశమందు కూనపరాజు లేక కూనభూపాలుడు అను నొక డుండినట్లు తెలియవచ్చు చున్నది. ఈ శాసనము శక ౧౩౨౫ నాటిది. ఈకాలమందే మన అన్నదేవు డుండెనను విషయముఅందరికి తెలిసినదే. పై శాసనమువలననే యీకూనభూపతి హారితకులజు డనియు, ఇతనితండ్రి చక్రవర్తిరాజని యు తెలియవచ్చుటచేత నితడు అన్నదేవుని భార్యయు, పైని చెప్పబడిన చక్రవర్తిరాజు కొమార్తెయునైన ఇరుగాంబికాదేవికి సోదరుడే యని నిశ్చయించవచ్చును. అన్నదేవుని బావ మఱదియగు పిన్నుండి (చిన్న ఉండి) యీతడు కావచ్చునేమో? అట్లు కానిచో పిన్నుండి యను సోదరు డొక డుండవలయునని నిరాక్షేపముగా చెప్పవచ్చును.

ఈ ఉండిరాజులను గూర్చి కావలసినన్ని యాధారములున్నను వీరికిని, ఈకాలముననే యీ ప్రాంతమందే గొప్ప ఖ్యాతి గాంచిన కొండవీటిరెడ్డి ప్రభువగు అన్నపోత నృపతికిని ఈ ఉండిరాజులకును ఎట్టిసంబంధము గలదో నిర్ణయించుట దుస్సాధ్యముగ నున్నది.

అన్నదేవుడు గొప్ప శివభక్తుడనియు, దేవాలయములకును బ్రాహ్మణులకును అనేక దానముల నొసంగెననియు శాసనముల[1]వలన తెలియుచున్నది. అవి ఏవనగా, ఇతడు గోముఖగిరి వీరభద్రదేవాలయమునకు స్వర్ణకవచము చేయించెను; దాక్షారామమందలి భీమేశ్వరాలయమున సువర్ణకలశములను, సువర్ణ వృషభములను చేసి యిచ్చెను; గోదావరీ తీరమందలి పట్టిసపురబ్రాహ్మణులకు గోదానము చేసెను; పిన్నసానిసంగమునుచోట ఉత్తమగండ చోడున్న దేవవర మను గ్రామమును దానముచేసెను; తన కులదైవతమగు కాశీ విశ్వేశ్వర దేవునికి అనేకగ్రామముల నొసగెను.

అన్నదేవుని కుమారుడైన వీరభద్రుడు తనతండ్రి దిగ్విజయముల సహాయ మొనర్చెనని మాత్రమే తెలియవచ్చు చున్నది

1. S. I. I., vol 5, no 145; vol 4, nos. 1347-48; M. E. R., 1905, no. 254; 1920, no. 293.

# చోడభక్తిరాజు మద్రాసు మ్యూజియము తామ్రశాసనము

## మూడవ రేకు, రెండవ ప్రక్క

౪౩

౪౫

౫౧



## ముద్రిక



గాని, తనతండ్రికి పిదప రాజ్యమేలెనా? లేదా, సామంతుడై యుండెనా యను విషయము తెలియకున్నది.

అన్నదేవుని రాజ్యకాలము శక ౧౩౧౧[1] నుండి ౧౩౩౫[2] లేక౧౩౩౮[3] అని చెప్ప వచ్చును.

శక ౧౩౩౮ కు పిదప అన్నదేవుని గూర్చి గాని, యాతనికుమారుడైన వీరభద్రునిగూర్చి గాని ఆధారములేవియు లభించలేదు.

దానము

ఇక దానమును గూర్చి విమర్శింతము. భక్తిరాజు తన దిగ్విజయయాత్రలలో నొకా నొకప్పుడు శ్రీపర్వతము (శ్రీశైలము) అను ప్రఖ్యాతిగాంచిన శివక్షేత్రమునకువచ్చి అచట నుండిన విశ్వనాథుడు లేక విశ్వేశ్వరుడను పేరు గల నైష్ఠికబ్రహ్మచారిని జూచి అతనిపై భక్తి గౌరవములు కలిగి యాతనికి శిష్యుడాయెను. ఈ విశ్వేశ్వరుని గూర్చి మనకు తెలిసిన విషయము లివి:—

ఇతడొక గొప్పవిద్వాంసుడు, పరమఋషి, నైష్ఠికబ్రహ్మచారి. ఆంధ్రదేశమందు శైవ మతస్థాపనములో కంకణబద్ధుడైన పరమాచార్యుడు. ఇతని కనేకులు శిష్యులు గలరు. ఈ శిష్యులు శైవమతస్థాపనములో నతని కనవరతము సహాయముచేసిరి. ఈవిశ్వనాథాచార్యుల గూర్చి చాళుక్యభీమేశ్వరాలయమునందలి శాసనములు పైచెప్పిన విషయములను నిర్ధారించుచున్నవి.

ఈవిశ్వనాథాచార్యులు అపరశివావతారమని యెన్నిక. ఇతడు కౌశికగోత్రోద్భవుడైన బ్రాహ్మణుడు; నైష్ఠికబ్రహ్మచారి; జితేంద్రియుడు. ఇటువంటి మహానుభావుని చూచి భక్తిరాజు అతని వశంగతుడై, శిష్యుడై యిట్టి యాచార్యునికి ఏదైన నొక దానపూర్వమగు సమ్మానము నొసంగిననే తనవంశము ప్రకాశించుననియు, దానముచేయుటయే గొప్పవంశమందు జనించినందుకు ముఖ్యప్రయోజనమనియు తలపోసి యీవిశ్వనాథాచార్యులకు కణ్వకొల్ను (కంర్వకొలను)అను అగ్రహారమును శక ౧౨౭౭ (ముని ఋషి నేత్ర చంద్ర గణితే సంవత్సరే=౭౭౨౧ అగును) కార్తిక సోమవారమునాడు దానముచేసెను. సంవత్సరముచెప్పబడలేదు. కాని యది మన్మథ సంవత్సరమునకు సరిపోవుచున్నది. దీనికి సరియైన తేది క్రీ. శ. ౧౩౫౫ అక్టోబరునెల ౯ ౨౧ ది సోమవారము.

దానమొసగిన గ్రామమునకు సరిహద్దులు:-

తూర్పున పెద్దపుట్ట, ఆగ్నేయమున చింతాజొలపల్లము, దక్షిణమున వాంగు (వాగు), నైరృతికి మేడితాపయు (మేడిచెట్టుగల ఉన్నత ప్రదేశము) నందికంభమును-(అనగా నంది స్తంభము) పడమర గనుమేరు, (కనుమ

1. M. E. R, 1905, no. 254.
2. S. I. I. vol. 5, no. 145,
3. J. A. H. R. S., vol. I. no. 4, p. 181.

నుండివచ్చెడి చిన్నఏఱు), ఉత్తరమున వడ్లగుంట. ఈశాన్యమున-బొమ్మెపముక్కులు.

పైనిచెప్పబడిన సరిహద్దు లేవియు ఇతర గ్రామముల పేళ్లుగా లేవు. కాని సామాన్యమైనట్టి పొలములు వాగులు ఊరివారు గుర్తెరుగునట్టి కొన్నిచిహ్నములుగా నున్నవి. కాబట్టి యిటువంటివాటి నేల నిర్దేశించెననగా సామాన్యప్రజలకు దానముచేసిన స్థలము తెలియుట కొఱకే. ఇందువలననే శాసనములో "ప్రథిత సీమానం"అని పేర్కొని యున్నాడు. 'ప్రథిత' అనుటకు బాగుగా తెలియబడిన అని అర్థము.

శాసనముకడపట "స్వదత్తాం పరదత్తాం వా", "సామాన్యోయం ధర్మసేతు ర్నృపాణాం" అను మొదలగు మామూలు శ్లోకములు గలవు.

## మూలము*

మొదటి రేకు : రెండవ ప్రక్క

1. దేవ [ః] శ్వేతవరాహో మాఘ[1] పాతాలా ద్యో ఘనసంనిభాం । అసవగోఽతి సంచి
2. ం స్యా దంష్ట్రా యోదనహ స్మహీం।[౧*] పార్వతీపరమేశానౌ జగతాఃప
3. తరావపి । సుపుత్రౌ గోప మన్యేతే యోయం పాపా ద్గజాననః। [౨*]
4. సురక్షిత సుధా భాతి యస్యై చాంద్రమస్యా[2] కళా।హావిషే దుగ్ధదో
5. హా గా రగ్ధ్వ[3]హోత్రీ వ యజ్వనా। [౩*]రాజన్యకస్యాత్మనిధానక
6. స్య ప్రతాప సత్కీర్తిరాగు(ణో)ణోదయాయ। ఉష్ణం చ శీతం
7. చ మహార్ణవాంతౌ భాస్వత్సుధాంశూ విజయం విధతాం[4]।[౪*]సూ
8. య్యార్ణవంశే మహీశానా మాద్యో మను రజాయత।భూమ
9. యీూం నావ మారోప్య మత్స్యాత్మా యమజూగుపత్ ।[౫*]వి
10. జిత్య తపసా భర్గ్గం గంగా తన్మౌళిభూషణం।

---

* అసలురేకులనుండి.

1. "మాఘ్" లో రెండవయక్షరమైన "ఘ్" "మా" కు ఎగువ వ్రాయబడినది.
2. "చాంద్రమసీ" అని చదువవలెను.
3. "అగ్నిహోత్రీ" అని
4. "విధత్తాం" అని.

రెండవ రేకు : మొదటి ప్రక్క

11. యేనాకృష్య భువం నీతా స తద్వంశ్యో భగీరథః। [౬*]అపిప్రథం ని[5]
12. మం వంశ మిక్ష్వాకుప్రముఖా నృపాః। యద్విక్రమేణ శక్రస్య
13. స్వారాజ్యం ప్రాజ్యతా మగాత్। [౭*] ఆరూఢశక్రవృషభస్సకకు
14. త్స్థభూపో మాంధాతృతేంద్రకులిశః చ రఘుః ప్రవీరః। రామః చ బద్ధ
15. జలనిధి దశకంఠహంతా తద్వంశజా ఇతి తతః కిము వర్ణనీయం[6]।[౮*]
16. అరికాలస్తతో జాతః కరికాలస్తతో భవేత్[7]। అతిచిత్రైః చరిత్రైః స్వైః
17. ప్రాణిజా నత్యశేత యః।[౯*]అస్మా[8] సీద్గాంగతో మై రనుదినమవనీపా
18. లహస్తక్రమాత్తైః కావేరీసేతుబంధే నిఖిలనరపతిస్సగ్రహీం దగ్రవేష్టైః।
19. అస్తంభీన్యోభ్యజరాజప్రహిత నృపచితే భాజనం భా[బా]స్థపీ
20. య్యం పాదాంగుష్టేన భా[9]లే విలసిత మభిదత్పల్లవేంద్రస్య నేత్రం। [౧౦*]
21. కరికాలాన్వయోద్భూతైః నల్లభీమపురోగమైః। సురాజభిః చిరం

రెండవ రేకు : రెండవ ప్రక్క

22. కాలం మహీయ మమహీయత।[౧౧*]దూ[10]హత్తనారాయణదామ
23. భూపాల్లక్ష్మీ[శ్రీ]పతేసోమనృపాలకో భూత్। సామంతభూపాలకరాం
24. బుజానాం భా[11]లేషు యః కుట్మ[12]లతాం అకార్షీత్।[౧౨*]తస్మాత్పురా
25. బికారాజానే రభూద్గంగా(నృ)పరో నృపః। ప్రత్యూష ఏ సురవిప్రాణాం
26. భాస్వాన్నన్యకల్పికో భవేత్[13] [౧౩*]తస్య సోమాన్వయోద్భూత కామ
27 భూపతేనాథవా। భార్యాసీద్గుగాంబా ర్యా సోదర్యా వేంగ
28. భూపతేః। [౧౪*]గంగాధరత్వేంగతే రముష్యాం శ్రీ భక్తిరాజః క్షి
29. తికల్పభూజః। ప్రసంనవిశ్వేశ్వర దేవభక్తః ప్రశాస్తి (నృ) రా
30. జ్యం నృపవర్గపూజ్యః।[౧౫*]గండభేరుండబిరుదమాహవేష్వభిపిక్ష్య
31. యం। వైరిసింహాః పలాయంతే విహాయ స్వామహంకృతిం।[౧౬*]

---

5. "అపిప్రపన్నై" అని.
6. "వర్ణనీయం" అని.
7. "భవత్" అని.
8. "అస్మాసీత్" అని.
9. "భాలే" అని.
10. "సోహంత్త" అని.
11. "భాలేషు" అని.
12. "కుడ్మలతాం" అని.
13. "—భవత్" అని.

మూడవరేకు : మొదటిప్రక్క

32. రాయవేశ్యాభుజంగత్వం యుక్త మస్యైవ భూపతేః। మానముత్సృజ్య రా
33. జానస్సేవంతే యదముం ముదా।[౧౭*]కందర్పసూనుం కలికామధేనుం
34. శ్రీవిశ్వనాథం యశసాం[14]నిధానం।దిశో జిగీషుర్విచరం దదర్శ శ్రీ
35. పర్వతైకాయతనం స రాజా॥[౧౮*] అథాపరమివేశానం కౌశికం బ్రహ్మ
36. చారిణం।ప్రణిపత్య స భక్తిశ్రీ దృఢభక్తిరజాయత।[౧౯*]శాకే మున్యృషినే
37. త్రచంద్రగణితే సంవత్సరే స్మిన్ మహాకార్తిక్యాం శశివా
38. రభాజి విమలశ్రీః వోడభక్తీశ్వరః।గ్రామం ప్రాదిత నైష్ఠికాయ
39. యమినే విశ్వేశ్వరా నూతులం సాష్టైశ్వర్యక మష్టభోగసహితం
40. శ్రీకంప్వకొల్నుం ముదా।[౨౦*] అస్య సీమానః।తూర్పున పెద్దపు
41. ట్ట ఆగ్నేయాన చింతాజోఉపల్లి మున్నా దక్షిణానకు వాంగు
42. నైఋతికి మేడితాపాను సందికంభమున్నా పడమటికిం గ

మూడవరేకు : రెండవప్రక్క

43. నుమేటూ ఉత్తరానకు వట్లకుంట ఈశాన్యానకు బొంగము
44. పముక్కలు పొలమేరలు।ఏవం ప్రథితసీమానం గ్రామం దత్వా
45. మహీపతిః।పాత్రప్రదానత[15] స్వస్య వంశ్యాన(వ్వంశ్యా) సమన్వతి।[౨౧*].
46. శ్రీకప్వకొల్ని[16]నామగ్రామస్యాస్య ప్రదానవిఖ్యాత్యై।శాసనమి
47. దమాకల్పం ప్రకల్పితాం భక్తిభూప [17]వితీర్ణం[18]।[౨౨*] స్వదత్తాం ప
48. రదత్తాం వా యో హరేత వసుంధరాం।షష్టివర్షసహస్రా
49. ణి విష్ఠాయాం జాయతే క్రిమిః।[౨౩*] సామాన్యోయం ధర్మసేతుర్నృ
50. ణాం[ం*] కాలేకాలే పాలనీయో[19]భవద్భిః।సర్వానేతాన్భావినః పార్థివేంద్రా
51. న్భూయో భూయో యాచతే రామచంద్రః।[౨౪*]

14. "యశసాం" అని.
15. "ప్రదానతః" అని.
16. "కంప్వకొల్ను" అని.
17. ఈయూరూర శ్లోకములో కడపటిచరణమున ఒకమాత్ర తక్కువగా యుండుటచేత "భక్తిభూప వితీర్ణం" అనుదానిని "భక్తిభూప(సు) వితీర్ణం"అని మార్చిన సరిపోవును.
18. "వితీర్ణం" అని.
19. "పాలనీయో" అని.

## అనువాదము

౧. శ్వేతవరాహావతారుడైన విష్ణువు నన్ను రక్షించుగాక. ఎవడు మేనుమువలె నల్లగానుండు భూదేవిని తన కసవర్ణ యని తలచి కోరలచేత ఉద్వహించెనో ('అసవర్ణ' అనగా ఇతరజాతిలో జనించినది. 'ఉదవహాన్' అనగా పెండ్లిచేసుకొనెను. ఈ రెండు పదముల ప్రయోగములనుబట్టి భూదేవి తనకు విజాతీయ యని పాణిగ్రహణముచేయక దంష్ట్రితో ఉద్వహించెను అని తెలియవచ్చుమన్నది)

౨. ఏపుత్రునిచే తాము సుపుత్రవంతులమని జగత్పితరులగు పార్వతీపరమేశ్వరులు తలంచుచున్నారో, అట్టి గజాననుడు (నన్ను) బ్రోచుగాక.

౩. యాజ్వచేత హవిస్సుకొఱకు పిదుకబడిన పాలుగల హోమధేనువువలె, సురలచే పానము చేయబడిన అమృతాంశముగల సూక్ష్మమైన చంద్రకళ ప్రకాశించుచున్నది.

౪. ఉష్ణరశ్మిగల సూర్యుడును, శీతరశ్మిగల చంద్రుడును ఆత్మగ్లానము లేక ఆత్మగౌరవముగల రాజులకు సత్కీర్తివృద్ధికై విజయము నిత్తురుగాక.

౫. సూర్యవంశపు రాజులలో మొదటివాడు మనువు. వీనిని ప్రళయమందు మత్స్యరూపియయిన విష్ణువు భూమియనెడు పడవయందెక్కించి రక్షించెను.

౬. ఈవంశమందు జనించినవాడు భగీరథుడు. ఆతడు తపస్సుచే శివుని జయించి (సంతోషపరచి) శివుని శిరస్సునందు గల గంగను భూమికి తెచ్చెను.

౭. ఎవరి విక్రమముచే ఇంద్రునియొక్క ఆధిపత్యము వృద్ధిచెందెనో, అట్టి ఇక్ష్వాకువు మున్నగు రాజులు ఈవంశమును ప్రఖ్యాపించిరి.

౮. ఈవంశమును ఎక్కువగా వర్ణించ నక్కరలేదు. ఈవంశములో క్రింద చెప్పబోవువారు జనించి రనిన జాలును.—

(౧) కకుత్‍స్థుడు-ఇంద్రుని వృషభముగా చేసుకొని స్వారిచేసినవాడు.

(౨) రఘువు-ఇంద్రునియొక్క వజ్రాయుధమును మొక్కపోవునట్లు చేసినవాడు.

(3) రాముడు-సేతుబంధముచేసి దశకంఠుని సంహరించినవాడు.

౯. అరికాలుడు తర్వాత జనించెను. అతనికి పిదప కరికాలుడు పుట్టెను. ఈకరికాలుడు తన విచిత్రచరిత్రములచే పూర్వరాజులను తిరస్కరించెను.

౧౦. ఈతడు ప్రతిదినమును సామంతరాజులచే హస్తక్రమముగా తీసికొనిరాబడు గంగాజలముచే స్నానము చేసెను. కావేరి నదికి సేతువుకట్టుటకు (కావేరిలో నిరుపక్కల ప్రవాహ మతిశయిల్లగా) సకలసామంతులను నియోగించినాడు. తర్వాత భోజరాజుచే భయభక్తులతో పంపబడిన కానుక నామోదించినాడు. త్రిలోచనపల్లవునియొక్క ఫాలనేత్రమును (వీనికి మూడుకన్నులు గలవు) శ్రమచెందక తనకాలి బొటనవ్రేలిచే భేదించెను.

౧౧. కరికాలవంశోద్భవు లైన నల్ల భీముడు మొదలగు మంచిరాజులచేత నీభూమి పరిపాలింపబడి అభివృద్ధిపొందెను.

౧౨. దోహ_త్తనారాయణుడను నామాంతరము గల లక్ష్మీపతియైన దామభూపునికి సోమనృపాలుడు పుట్టెను. ఆసోమనృపాలుడు సామంతరాజులను వారి చేతులను నొసట తామరమొగ్గలవలెనుంచుకొనునట్లుగాచేసెను (అనగా అంజలిచేసిరని భావము).

౧౩. సూరాంబికాపతియైన యాతనికి (సోమనృపాలునికి) గంగాధరుడు పుట్టెను. ఎవనిచే దేవబ్రాహ్మణులకు సూర్యుడు వికల్పమయ్యెనో (అనగా సూర్యునివలె నీతడుండుట వలన ప్రజలకు యథార్థసూర్యునియెడ వికల్పము కలిగెనని యర్థము).

౧౪. చంద్రవంశోద్భవుడైన కామభూపుని కొమార్తెయు, వేంగభూపతికి సోదరియు, పూజ్యయునగు ఇరుగాంబాదేవి యను, నారీమణి యతనికి భార్య యయ్యెను.

౧౫. ఆమెయందు గంగాధరునికి, జగత్తునకు కల్పవృక్షమువంటివాడును, శివభక్తుడును, నృపులచే పూజింపబడినవాడును నగు శ్రీభక్తిరాజు పుట్టెను.

౧౬. గండభేరుండ(పౌరాణికపక్షి, సింహశత్రువు) బిరుదాంచితు డగు భక్తిరాజును యుద్ధములో చూచి శత్రుసింహములు తమ యహంకారమును వదలి పరుగిడినవి.

౧౭. వీనికి రాయ (జ) వేశ్యాభుజంగ యను బిరుదము (రాజ్య మనెడు వేశ్యకు విటునివంటివాడు) యుక్తము. ఏలనగా, సామంతు లందరు సిగ్గును వదలి (తమస్థితిని వదలి) సంతోషముగా నితనిని సేవించుచున్నారు కదా!

౧౮. ఈ రాజు దిగ్విజయమొనర్చుచు శ్రీపర్వతమునకు వచ్చి అచ్చట శ్రీపర్వతమే ముఖ్యస్థానముగా గలవాడును, కీర్తి కారణుడును, మన్మథపుత్రుడును, (అందమైనవాడు), కలిలో కామధేనువువంటివాడును నగు శ్రీవిశ్వనాథుని దర్శించెను.

౧౯. పదప భక్తీశుడు శివతుల్యుడును, కౌశికవంశజాతుడును, బ్రహ్మచారియును నగు ఇతనికి నమస్కరించి ఇతనియెడ దృఢభక్తి గలవా డాయెను.

౨౦. శక ౧౨౮౭ కార్తిక సోమవారమునాడు నిష్కళంకకీర్తిగల భోషభక్తీశ్వరుడు నైష్ఠికబ్రహ్మచారియు, జితేంద్రియుడు నైన విశ్వేశ్వరునికి అష్టైశ్వర్యాష్టభోగసహితముగా కణ్డ్వకోల్పు అనుగ్రామమును సంతోషముతో నొసంగెను.

పంక్తులు ౪౦-౪౪ వరకు యీగ్రామమునకు సరిహద్దులు.

౨౧. ఇట్లు ప్రసిద్ధములైన సరిహద్దులుగల గ్రామమునిచ్చి తనసత్పాత్రదానముచే స్వవంశీయుల నప్పుడే, ఆవంశములో పుట్టుట కర్హత గలవారని తలచెను.

౨౨. కణ్ణ్వకొల్ని గ్రామమును దానము చేయుటచే కలిగిన కీర్తిప్రసారణమువలన భక్తి భూపదత్తమగు నీశాసనముకల్పమువఱకు వృద్ధి చెందునుగాక!

౨౩, ౨౪. మామూలుశ్లోకము లగుటచే వీటి కిచట అర్థవివరణము చేయలేదు. అన్ని శాసనములలోను ఈశ్లోకములు వివరింపబడి యున్నవి.

---

## బండివాడు

మంచిపాక పార్వతీశ్వర శాస్త్రిగారు

('మామేకం శరణం వ్రజ' - భగవద్గీత)

ఓ బండినాయుడా, ఓ బండినాయుడా!
ఆనందపురికి నీ బండి కడతావా?
కడతాను మా బాబు కడతాను మాతండ్రి
ఆనందపురికి నా బండి కడతాను.

ఆఊరికెప్పుడూ పోలేదురా నేను
త్రోవ తెలుసును నీకు మంచిత్రోవేనా?
త్రోవ తెలుసును నాకు, మాది ఆఊరేను
త్రోవమంచిదగాదు, నాటుత్రోవండీ;
నాటుత్రోవనునీవు తోలగలవా బండి,
బండియెద్దుల నీవి బలము గలవేనా?
బండిలో ఏముంది? ఎడ్లలో ఏముంది?
బండినాయునిచేతి బలములో ఉంది.

ఈగాలివానలో, ఈచీకటప్పుడు
గట్టుపుట్టలుదాటి, కడకు పోగలమా?
గాలివానైతేమి, గట్టుపుట్టయితేమి
చీకటైతేమి, మీచిత్త మొస్తేను

పోకతప్పదు నేను, తొందరైయున్నాది
పోవడానికి నాకు భయము వేస్తుంది;
మీకేమి భయమండి, నేబండితోలితే
బండినాయుని నమ్మి బయలుదేరండి,
వరకమెరకలలోను పడిదెబ్బ తినకుండ,
ఒడుకుదొడుకులుకాచి, బండితోల్తావా?
మీభారమంతాను నామీదపడవేసి,
బండిలోకూర్చోండి, నన్ను నమ్మండి;

నీమాటవింటేను నిను నమ్మబుద్ధయ్యె
అద్దేమి నావద్ద పుచ్చుకొంటావు?
ఆనందపురిచేరి ఆమాట చూతాము,
అద్దె కేమండి మీ చిత్తముంటేను;
నీవు కోరినదంత నీకు నే నిస్తాను
నిను నమ్మిబండిలో కూరుచుంటాను;
అరగడియలోపల ఆనందపురిచేర్తు
భయమేమి లేదండి బండియెక్కండి.

---

# సమ దృష్టి

జి. జాషువగారు

ఖద్దరుబట్ట గట్టుకొని, కన్నుల నీరము జిందిపార, నీ
ముద్దుకుమాళ్లతోఁ జెరకుఁ బోయెదవేటికి తల్లి? పూర్వపుం
బెద్దఱికంబుఁ దెచ్చుకొని పిల్లలతో సుఖయింతు నందువా?
వద్దు వృథావ్యథల్, భరతభామిని! వింధ్యధరాధరస్తనీ!

పూర్వకాలచరిత్రముల నిద్రితములైన శుభదినంబులు లెక్క జూచుకొనుచు
భూగర్భమున రత్నములలోనఁ గలసిన వీరులపేరులు బెట్టుకొనుచు
చెదపుర్వుపొట్టలో జీర్ణించిపోయిన వాఙ్మయంబునకు వివాదపడుచు
గజవాహనములపై గజనీకిఁబోయిన పసిఁడికి గుండెలు బాదుకొనుచు
పొట్టనింపుల నాటకంబులఁజరించు-కొడుకులకు స్వేచ్ఛ లేదని కుందె దేల?
స్వేచ్ఛ లేకేమి? సోదర ద్వేషమునకు-తలఁచుకొనవేమి? నట్టింటి కలకలంబు.

కలమునఁ గీర్తిశేషులకుఁ గాయము లీయ సమర్థులైన, బ్ర
హ్మలు, కవిరాజు లట్టిదుల కన్నము లేదుగదమ్మ! దేశభా
షలు విలపించుచున్నవి విజాత్యభిమానము కందళించె, నో
చలిమలమేల్మసుంగు దొరసాని! కుమారుల దిద్దుకోగదే!

విమలతపంబునం బురిటి బెబ్బులి కంటి కహింస నేర్పు సం
యములను గన్నదానవు గదా? జననీ! భవదీయపుణ్యగ
ర్భమున, నగస్త్యసోదరులు భ్రాతృవిరోధులు బుట్టిరేలనే?
యమరనదీదళత్కమలహార! యచంచలధర్మగామినీ!

సమవర్తిప్రియసూను నేత్రయుగళిన్ సందీపితంబైన ధ
ర్మము తూర్యధ్వనిఁబోలి భారతకథామధ్యంబునన్ మ్రోయు నా
సమభావం బిపు డేది? స్వార్థయుతవాచారూపముం దాల్చెనో
సమశీతోష్ణసుఖప్రదాయిని! యహింసాలోచనోద్భాసినీ!

చక్కనికవితకులమే - యెక్కువతక్కువలు నిర్ణయించిన-చో నిఁ
కెక్కడిధర్మము? తల్లీ! - దిక్కుంజరవేదికాప్రతిష్ఠితగాత్రీ!

---






# గజేంద్రుడు

తలిశెట్టి రామారావుగారు, B. A., B. L.

ఏనుగు లెప్పుడును మందలుగ నడవులందు సంచరించుచుండును. ప్రతిమందకును బలిష్ఠమైన యొకయేనుగు నాయకుడుగ నుండి తాను జెప్పినటుల తక్కినయేనుగులను ద్రిప్పుకొనుచు వాటికెట్టి యుపాయమును రాకుండునటులు గాపాడుచుండును. పూర్వ మిటియేనుగొకటి దాహము దీర్చుకొనుటకును, విలాసముకొరకును నీటియందు దిగ నందు గల మొసలి యొకటి ఆగజముయొక్క కాలును బట్టుకొనెను. ఏనుగు బలము కలదైనను, నీటియందు మొసలికి బల మెక్కువ కనుక నెంత ప్రయత్నించియు నామొసలిని విడిపించుకొని పైకి రాలేకపోయెను. ఎట్టి యాపదనుండియైనను రక్షింపగల భక్తత్రాణపరాయణుడు దేవుడు కనుక నాగజరాజు సర్వేశ్వరుని ప్రార్థింప మొదలిడెను. ఆమొరను దేవుడు విని, యొక భక్తు డాపత్తునం దున్నాడని గ్రహించి యతిత్వరితముగ నచ్చోటునకు వచ్చి తన చక్రముతో నామూర్ఖమకరమును జంపి యేనుగును రక్షించెను. ఈకథ నెరుగని హిందువుడుండడు. భక్తుడైన గజేంద్రుని ప్రార్థనపద్యములను చదువని, వినని మనుజు డుండడు. జంతువగు నేనుగైనను భక్తిగలదయి మోక్షమును బొందగల దనుటవలన హిందువులకుగల భూతదయ వ్యక్త మగుచున్నది. వేదాంతార్థమును గూడ నీకథకు గల్పించుటవలన నన్ని తరగతులవారి నిది రంజింప గలుగుచున్నది. ఈగజేంద్రమోక్షమును దెలియజేయు చక్కని శిల్పచిత్ర మారవశతాబ్దమున నిర్మింపబడిన ఝూన్సీజిల్లాయందలి దేవగడ దేవాలయమున గానవచ్చుచున్నది. బౌద్ధమతము హిందూదేశమున క్షీణించి హిందూమతము ప్రాముఖ్యము వహించిన పిమ్మట నీ హిందూపౌరాణికగాథ చిత్రరచనయందును, శిల్పరచనయందును విశేషముగ వినియోగింపబడెను. రాజపుత్రయుగమునాటివి గజేంద్రమోక్షమును తెలియ జేయున వనేకసుందరచిత్రములు కలవు.

మన మాదిదేవునిగ బూజించువినాయకుడు గజాననుడు. వినాయకచతుర్థిని ప్రతి హిందువుడును బాల్యమున పాలించి యావ్రతకథను వినియుండును. కళానియమములతో నలరారు సుందరములైన వినాయకుని విగ్ర

హము లానాడు లెక్కకు మిక్కిలిగ హిందూ దేశమునం దంతటను కానవచ్చును కాని యవి యన్నియు త్వరలో గంగ గలియును. ప్రజల మతముకొరకు ముఖ్యముగ వినియోగింపబడిన యీకళ హిందూదేశమున వ్యక్తులపై నెప్పుడు నాధారపడియుండలేదు. చిత్రకారుని యావేశము కళకు ముఖ్యమైనను తన యానందము కొరకు మాత్రము మానసోద్రేకమును భారతీయచిత్రకారుడు వ్యక్తపరచుట యరుదు. ఇట్టి పండుగులకొరకును, దేవాలయములను కట్టునప్పుడును ఆతడు ఉపయోగపడుటకొరకు విగ్రహములను సృజించుచుండునే కాని యవి తరువాత నేమగునో యనుచింత యాతనికి లేదు. ఇందువలన భారతీయచిత్రకళ యాయా కాలపు ప్రజల నమ్మకములను వ్యక్తపరచుచు వచ్చెనే కాని యెవరో యొక గొప్ప చిత్రకారునకు లోబడి క్రొత్తమార్గమును త్రొక్కలేదు. చిత్రకారుడు ప్రతిభావంతుడైన యెడల తాను నివసించిన యుగమునకు గావలసినట్టి కళాశైలికి పన్నెమాత్రము దెచ్చినను ప్రావీణ్యమును వ్యక్తంపరచును కాని యుగము యొక్క సంప్రదాయములను దాటజాలడు. భారతీయ శిల్ప, చిత్రకళల విశేషములలో నిదియొకటి. వినాయక విగ్రహములవంటివి కళానిర్మాణములుగ దాచతగ్గవని తలచుట, వాటి నాశనమునకువగచుట పాశ్చాత్యులరచనలందు చూచుచున్నాము. కాని యీవిగ్రహములు మనకు సామాన్యములగుటచే వాటియవసరము తీరినవెంటనే పారవేయుచుందుము. అక్కరకురాని నిర్మాణములు హిందువు లెరుగరు. పూర్వకాలపు చిత్రకారులపేరు లేచిత్రములందును కానరాకపోవుటకివి కొన్ని కారణములు.

మనము నివసించు ప్రపంచమును నిలువబెట్టుచున్న వష్టదిగ్గజము లను నమ్మకము కలదు.

బౌద్ధజైనమతములు హిందూదేశమున బుట్టి, హిందూమతమున కంగములుగ బెరిగిన వగుటచేతను, మొదటి మతప్రచారకులును, ఆయామతములను స్వీకరించినవారును హిందువు లగుటవలనను, ఆయామతములు హిందూ సంప్రదాయములను విశేషముగ విడువలేదు. బౌద్ధమతజాతకకథలు పురాణకథలవలె నుండును. వీరు మతప్రచారమునకు హైందవ చిత్రశిల్పకళలను బోషించిరి. ఇట్టి సంపర్కములను జేర్కొనుటకు లెక్కకు మిక్కిలిగ గలవు. కాన బౌద్ధులును, జైనులును హిందువులకు ప్రియమైన దేవతలను భక్తితో జూచుట వింత కాదు.

బౌద్ధమతజాతకకథలలో షడ్దంతజాతక మొకటి కలదు. ఆకాలమున హిమాలయ పర్వతములందు సంచరించుచుండిన గజరాజు తన్ను పూర్వజన్మమున నవమానపరచెనని భావించి యాదంతిని బట్టి తెమ్మనియు, దాని దంతములు వింతకాంతుల నీనుచుండుటవలన వాటిని సేకరింపవలెననియు కాశీమహారాణి తన సేవకుల కాజ్ఞాపించెను. కాని వేటకాండ్రా

దంతములను దీయజాలకపోయిరి. గజరాజు బోధిసత్త్వుడగుటచే శాంతమును వహించి తన దంతములను తానే తీసి యాసేవకుల కర్పించుటకు పూనుకొనెను. ఈవార్త నారాణి విని, దంతములను చూచి, తాను చేసిన యపరాధమును గ్రహించి, విషాదముతో మరణించెను. ఈకథను తెలియజేయు మహాచిత్ర మొకటి అజంత పదునేడవ గుహాయందు గలదు. దుఃఖపూరితయై మరణించు సమయమున దన భర్తపై జేరబడియున్న రాణి, ఆమె కుపచారములను జేయుచున్న పరిచారికలు, ఏనుగును బట్టి తెచ్చిన మృగయులు, వారివెంట వచ్చిన యేనుగులు నద్భుతముగ



జిత్రింపబడెను. అజంతచిత్రమది యన్నజాలును—వేరుగ బాగడుట యనవసరము. కాని యిందుగల యేనుగుల సమూహము చూడదగ్గది. ముందున్న గజరాజుయొక్క శాంతధైర్యములు, వెంబడించి వచ్చిన యేనుగుల విషాదము నత్యంతనిపుణముగ నామహాచిత్రకారుడు చిత్రించెను. రచన యెంత స్వాభావికముగ నున్నదో పాఠకులకు విశదము.

బౌద్ధయుగమున తొలుదొల్త బౌద్ధవిగ్రహ మెచ్చటను లేక యుండెను. బుద్ధుని దేవునిగ నారాధించుట భావ్యమని బౌద్ధమతస్థులకు తోచినప్పటికిని విగ్రహారాధన నిషేధింపబడెను కాన కొన్ని చిహ్నములవలన బుద్ధభగవానుని శిల్పచిత్రములందు సూచించుచుండిరి. బుద్ధుని జన్మమును తెలియజేయుటకేనుగు నిట్టి చిహ్నముగ నుపయోగపరచిరి.

మతమునకు సంబంధించిన నమ్మకములలో గజము లింతటి ప్రాముఖ్యమును వహించియున్నప్పుడు ప్రజలకు వీటియందు గౌరవభావ ముండుటయందు వింతలేదు. ప్రజలయందు గౌరవము కలుగుటవలననే వీటికి స్థానము కలిగియుండవచ్చును. ఏనుగు పెద్దజంతువు. దీనిశాంత మద్వితీయము. దీనిసౌందర్యము వింతయైనది. దీనినడకతో సొగసైన స్త్రీల నడకను కవులు పోల్చియున్నారు. రాజులు వీటిని గౌరవమైన వాహనములుగ నెంచి యనేకవిధముల నలంకరింపించెదరు. పైన జెప్పినటుల ప్రజల నమ్మకములను, వారిచిత్తవృత్తులను మన్నించి యుగధర్మము నాచరించిన హైందవచిత్రకార

యేనుగులను చక్కగ చిత్రించియు, మలచియు తనహిందూత్వమును వ్యక్తపరచుట స్వాభావికము. ఏనుగు విగ్రహముల నిన్నివిధముల నింతసుందరముగ నేదేశముననైనను రచియించుట యెరుగము. ఇట్టి స్థానము నలంకరించుట కేనుగన్నివిధముల నర్హత కలది.

స్వర్గమును బాలించునట్టియు, భోగముల ననుభవించుటకు పేర్గన్నట్టియు నింద్రుని వాహన మైరావతమను ఏనుగు. భారతీయులు చాల జంతువుల కిట్టి దైవత్వము నారోపించి యున్నారు. కాళీమహాదేవి వాహనములు కనుక పులికిని, సింహమునకును గౌరవస్థానములు కలవు. రామచంద్రునకు సహాయము చేసినవి కనుక కోతు లాదరమును వడయుచున్నవి. గరుత్మంతుడు విష్ణువుయొక్క వాహనము. నెమలి సరస్వతీ కుమారస్వాముల వాహనము. దైవత్వము లేకపోయిననైనను జంతువులు, పక్షులు మొదలగునవి హిందువులకు పవిత్రములైనవి. ఇట్టి సానుభూతియున్న దేశమున దైవత్వ మారోపింపబడిన యేనుగుయొక్క చిత్తవృత్తులను గౌరవించి భారతీయ చిత్రకారుడు చిత్రించుటయందు వింత లేదు.



అజంతయందు గల యీ చిత్రమును జూడుడు. ఇచ్చట దనకు ప్రియమైన తామర కొలనియం దెంత యానందముగ నీ గజము విహరించుచున్నదో! అజంతగుహలవద్ద నిలువబడి యెదుటిలోయలోని వనముపైపు చూచిన యెడల చల్లని నీళ్లప్రవాహ మొకటి కానవచ్చును. అచ్చట సేదదీర్చుకొనుటకు, నానందముతో విహరించుటకు వచ్చిన గజము లజంత చిత్రకారులకు పరిచితములు. చెవులతో తాపిగ వినరుకొనుచున్నట్టియు, నీళ్లను బీల్చి మరల విడుచుచు జలక్రీడలాడుచున్నట్టియు, తదితరవిలాసములందు నిమగ్నములైయున్నట్టియు గజముల నీచిత్రకారులు ప్రేమతోను, గౌరవముతోను జూచుచుండిరి. ఈచిత్రకారుల ననుకరించిన బాఘ్‌విహారపు చిత్రకారులును గజములను చాల చక్కగ చిత్రించిరి. (చూ. వ్యాసము చివరిచిత్రము).

సుప్రసిద్ధమైన సాంచీ స్తూపమునకు గల ద్వారములం దేనుగుల శిల్ప చిత్రములు చక్కనివి కలవు. ద్వారముపై గల మూడు తోరణములను సుందరములైన యేనుగులు మోయుచున్నటుల గలదు. మూడవతోరణముపైనగూడ హస్తివిగ్రహములున్నవి. తూర్పుద్వారపు దిగువతోరణమున స్తూపము నారాధించుచున్నటుల, నుత్తరద్వారమున మహాబోధివృక్షమును గౌరవించుచున్నటుల నేనుగులు కలవు. ఇచ్చటి విగ్రహము లన్నియు మహాసుందరములు. హిందువుల శిల్పచిత్రములందు గల గజలక్ష్మి నీ బౌద్ధశిల్పచిత్రములు జ్ఞప్తికి దెచ్చును.

రెండవ శతాబ్దమున నిర్మింపబడిన బరుహుతు స్థూపమునందలి యీశిల్పచిత్ర మాహ్లాదకరముగ నున్నది. కొన్ని కోతు లేనుగ తోకను, తుండమును, తలను చిత్రముగ త్రాళ్లతో బంధించి, దైనీని గొనిపోవుచున్నటుల నిందు గలదు. ఆనందముతో నొక కపి మద్దెలవాయించ, నింకొకటి బూర నూదుచు తమ విజయమును చాటుచున్నవి. మూడు వానరములు కర్రలను బట్టుకొని, "పారిపోయత్నించిన జాగ్రత!" అనునటుల నడచుచున్నవి. మిగిలిన త్రాడును, అంకుశములను బట్టుకొని మరియొకటి గలదు. హిందూచిత్రరచనయందు హాస్యము కానరా దనువారికీ చిత్రము ప్రత్యుత్తరముగ నున్నది.

అనాదినుండియు మన చిత్రకారులు ప్రతి సుందరవస్తువు నలంకారముగ దమ చిత్రములందు వినియోగపరచియున్నారు. స్త్రీలు, ముత్యములు, తామరలు మొదలగు పుష్పములు, హంసలు మొదలగు పక్షులు—ఇట్టివన్నియు తోరణములుగ గాని, వేరువిధముగగాని తరుచు కానరాగలవు. జంతువులలో సౌందర్యమునకు బేర్గన్న గజములను గూడ వీరిటుల నుపయోగపరిచిరి. లోకమున నలంకారముగలజంతు వలంకారముకొరకునిర్మింపబడని వీరి చిత్రముల నేల యలంకరింపరాదు? క్రీ. పూ. మూడవశతాబ్దమున నిర్మింపబడిన గయప్రాంతపు బరాబరుకొండలందుగల లోమసు ఋషియొక్క గుహాద్వారము మీద నేనుగుల తోరణ మొకటి చక్కనిది కలదు. రెండువేల సంవత్సరములకు పూర్వ



మునుండియు శిల్పమునందు దంతి ప్రాముఖ్యమును వహించెననుటకీ చిత్రము నిదర్శనము. ఇట్టి తోరణములు హిందూదేశమునందంతటను నిర్మింపబడిన యనేక దేవాలయములందు గలవు. శిల్పి సింహాచలమని పేరుపడిన యాంధ్రదేశమునగల శ్రీసింహాచల దేవాలయమునందు మలచబడిన సుందరమైన యేనుగులాంధ్రులకు పరిచితములు. పండ్రెండవ శతాబ్దియందు హాలెబీడునందు నిర్మింపబడి, శిల్పరచనకు పేరుపడిన హొయిసలేశ్వర దేవాలయమునగల యేనుగుల తోరణములు చూచి



మరచినవా రుండరు. శిల్పరచన యద్భుతాలంకారమును చేకూర్పగల దని యీదేవాలయమును, కోణార్కమున బాడుపడియున్న సూర్యని దేవాలయమును లోకమునకు చాటుచున్నవి. హొయిసలేశ్వర దేవాలయపు తూర్పుభాగమునగల సుందరశిల్పతోరణములలో దిగువనున్న తోరణభాగము నెత్తి యీచిత్తరువును వ్రాసితిని. ఈ యేనుగు లెంత ముద్దులమూటగట్టుచున్నవో పాఠకులకు సుగోచరము. ఇట్టిగున్న యేనుగులను చూచి యానందింపనివా రెవరు?

హిందువు లలంకారప్రియులు. కాన స్త్రీపురుషులనే గాక జంతువులనుగూడ వీ రలంకరించుచుండిరి. ఇట్టి భూషణము లలంకారములలో నలంకారములుగ నుపయోగపడెను. ఈచిత్రమున నేనుగుల యలంకారములవంటివి రాజదర్బారులం దుత్సవసమయములం దిప్పటికిని వినియోగపడుచున్న యేనుగులను చూచినవారికి పరిచితములు. మువ్వలు, గంటలు మ్రోయుచుండ నిట్టి యేనుగులు వరుసగ బోవుట కనులపండువుగ నుండును. ఇట్టి దృశ్యములు తరుచుగ గానవచ్చు మైసూరునందు నిర్మింపబడిన యీ దేవాలయమున నేనుగు లిటుల చిత్రితమైయుండుట సహజము.

కోణార్కమునందు గల పెద్ద యేనుగువిగ్రహము లిటులనే యలంకృతములై





యున్నవి. ఇవియన్నియు పెద్దవగుటచే నిట్టిశిల్పముల నోపికతో నిర్మించిన మహాశిల్పులకు చేతులెత్తి నమస్కారము చేయవలె ననిపించును. ఏనుగులను నిర్మించుటయే కాక వాటి యలంకారములనుగూడ మలచుట కెంత శ్రమ కావలెనో పాఠకులే యూహింతురుగాక. అలంకారములు లేకపోయిన నిట్టిపెద్దవిగ్రహము కైలాసదేవాలయమున గలదు. కోణార్కమునందలి యేనుగులకంటె నిది యెక్కువ ప్రకృతి ననుసరించి యున్నది. కొండను మీదినుంచి త్రవ్వి, యందు గల పెద్దరాతియందు కైలాసదేవాలయ మంతయు చెక్కబడియుండుటచే నంతటి యేనుగు విగ్రహ ముండుట యద్భుతమైన విషయము. భారతీయశిల్పి శిల్పబ్రహ్మ యనుటయం దుత్ప్రేక్ష లేదు. మామల్లపురమునందును పెద్దయాకారమున నతి స్వాభావికముగ నొక యేనుగు మలచబడెను. ఇదియు నతిసుందరముగ నున్నది. భారతశిల్పి సృజించిన యేహస్తి బాగుండలేదు?

పొడుగుపాటి స్తంభములపై నొకటి కాని, నాలుగు కాని సింహములను నెలకొల్పుట మన పూర్వుల యాచారమైయుండెను. యుద్ధమున చేకూరిన జయము మొదలగు చరిత్రఘటనలను స్థిరముగ లోకమునకు జాటుట కిట్టి స్తంభములను నిర్మించుచుండిరి. సింహమును స్థాపించుట యాచారమైనను, ఏనుగులయెడల భారతీయులకుగల గౌరవమును జూపుటకో యనునటుల సంకీశ స్తంభముపై నొకగున్న యేనుగును నిల్పిరి. ఇది సుందరవిగ్రహమైనను తుండము విరిగిపోవుటచే రూపము చెడియున్నది.

హిందూదేశమునందే కాక హిందూచిత్రరచనా సంప్రదాయములు వ్యాపించిన యన్ని దేశములందును గజముల కిట్టిగౌరవమే కలిగెను. బరుహుతు చిత్రమును పాఠకు లిదివరకు జూచియున్నారు. తొమ్మిదవ శతాబ్దియందు కాంబోడియాలో అంకోరునందు నిర్మింపబడిన మహాదేవాలయముల ప్రాకారములపై నేనుగుల చిత్రములు కలవు. ప్రాకారము చిన్నరాళ్లతో గట్టబడినను అది యలంకారరహితముగ నుండుట యాశిల్పులకు మనస్కరించినది కాదు. ఏనుగులపై నెక్కి వేటజేయుచున్నటుల నీయేనుగులను చక్కగ మలచి యా మోటురాళ్లకైనను సొగసును చేకూర్చిరి. (పైపుటలోని చిత్రమును జూడుడు.)



మొగలు చిత్రములందునుగూడ గజములనేకములు కలవు. తమనూతన దేశముయొక్క సంప్రదాయముల నా మొగలాయీలు మన్నించవలసివచ్చెను. జహాంగీరు చక్రవర్తి పోషణలో వ్రాయబడిన చిత్రములం దేనుగుల వేట, ఏనుగుల పోరాటము మొదలైనవి చాల సుందరముగ నున్నవి. లిపిచిత్రములందును వీరు గజాకారమును విడువరైరి.* పదునెనిమిదవ శతాబ్దమున చిత్రింపబడిన యీ చిత్రము లాహోరుదుర్గమున గలదు. రంగుల పెంకులమర్చుటవలన నిది యేర్పడెను.

రాజపుత్రులు హిందువు లగుటచే తమచిత్తగువులం దేనుగులకు మంచిస్థానమిడిరి. నవనారీకుంజరము* మొదలగు రాజపుత్ర చిత్రములు దీనికి ప్రబలమైన నిదర్శనములు. జయపూరు, అయోధ్య మొదలగు రాజదర్బారులందు మన్ననలను బడసినట్టియు, అరణ్యప్రదేశమగు కంగ్రాయందు బెరిగినట్టియు రాజపుత్ర చిత్రకారు లేనుగులను ప్రేమింపనియెడల నిక ప్రేమించువా రెవరు?

సారనాథునం దీహాస్తి చిత్రము కలదు. ముందుభాగమంతయు నేనుగుగ, వెనుకభాగము





* చూ. "భారతీయ చిత్రకళ", ఆంధ్రగ్రంథమాల, చెన్నపురి.

చేపగ నుండుటకు కారణము గోచరము కాలేదు. సముద్రమథనమున నైరావతము పుట్టెను కాన నేనుగు జన్మస్థానము సముద్రమని సూచించుట కీచిత్రకారు డిటుల రచించె నేమో!

ఏనుగుల కిట్టిగౌరవముకల హిందూ దేశమును సూచించుచిహ్నముగ నేనుగురూపము నుపయోగించుట సమంజసముగ నున్నది. ఈ దేశమున వేనకువేలుగ గల సుప్రసిద్ధదేవాలయములలో బెంచుమించుగ నన్నిటియందు నేనుగువిగ్రహము లుండును. ఏనుగు లేక పోయినను హిందూదేవాలయములం దన్నిటియందును గజాననుని ప్రతిమ యుండక తీరదు.

ఇందు ప్రచురించిన చిత్రములు రేఖామాత్రము లగుటచే నా నిర్మాణముల సొగసు పూర్తిగ దెలియకపోయినను రచనావిధానము మాత్రము తెలియగలదు.



(పుట ౧౩౨ చూడుడు)

# జీవయాత్ర

అంబటిపూడి నరసింహశర్మగారు

౧

ఇదిగో! యీపథాసక్త పయనింతునా-నితాంతతీక్ష్ణాగ్రకంటకతతులు-అదిగో
ఆవల బోదునా-దుస్సహాప్రభూత
వేదనల గూర్చు పాషాణవితతి-కాక
నాపృథువిశాలమైన మార్గాంతరమున
బోదునా-గమ్యసీమకు బోవ దేమొ
ముందు కేగుదునా-నూయి-మునుపటటుల
వెన్కకే బోదునా-గోయి-వెరవు లేదు
ఎటులబోదు నీపాపపృథ్వీతలాన.

౨

పైకిబోవగ సోపానపంక్తిలేదు
నడుగునకు బోవ మార్గ మెయ్యెడను లేదు.
దిశల బోవగ దిక్కులే తెలియబడవు
లోకము లవన్ని యున్నా-రుచీకటులను
మూతవడిపోయె నెటుపోదు నీతలాన.

౩

ఈ చిఱుతయేటిలోపాద మిడుదునా-ప్రభూతపాతాళమున క్రుంగిపోవునేమొ
ఆవనాంతరమున జేర నా-మహోగ్ర
కాలసర్పాలు పైబడి కరచునేమొ
ఆనునుపురాతిపై పాద మూనియుందు
నా-యడుగుజార్చి క్రిందికి ద్రోయునేమొ
అంతయుగ జూడగను సంశయాస్పదమ్ము
అంతమే లేనియట్టి అనంతభూమి
కాలు నిలుపగ తావు నిక్కముగ లేదు.



## ప్రాచ్యనాట్యకళ : శ్రీ వాసుదేవన్ గారు

శ్రీయుత సి. యన్. వాసుదేవనుగారు భారతీయచిత్రసంగీతకళలను భక్తిశ్రద్ధలతో నుపాసించు విద్యాప్రియులు. ఈయన కోయంబత్తూరు జిల్లాలోని పొల్లాచియందు జన్మించిరి. పాఠశాల విడిచిన తరువాత వీరు బొంబాయి నగరమున 'జె. జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్సు' అను కళాలయమున జేరుటకై పోయిరి. అచ్చట వీరు మూడు సంవత్సరములు నమూనాల (Modelling), వర్ణలేపనము అభ్యసించి, (చెన్నపురి) అడయారులో, నేషనల్ థియొసాఫికల్ స్కూలునకు వచ్చివేసిరి. ఇచ్చట వీరిని డా. జె. హెచ్. కజిన్సుగారు భారతీయచిత్రకళ నభ్యసింప ప్రోత్సహించిరి. అంత వీరు బందరు జాతీయకళాశాలకు పోయి, శ్రీ ప్రమోద కుమార ఛటర్జీగారి క్రింద కొంతకాలము వ్యాసంగము చేసిరి. కాని, వీరికి అధ్యాపకుని యెడ పూర్ణమగు సంతుష్టి కుదురలేదు.

పిదప వీరు అడయారు కళాశాలకు తిరిగి వచ్చి కొన్ని యేండ్లు సొంతముగా కృషిసల్పిరి. ఈలోగా దివ్యజ్ఞానసమాజమున తటస్థించిన జావానాట్యవేత్తలకడ జావానాట్యము నభ్యసించు నవకాశము వీరికి లభించినది. దానితో వీరికొక క్రొత్తజీవనము చేపడినది; వీరి సృష్టిపరత్వము క్రొత్తమార్గము పట్టినది; భావజాలము లయమయచలనములలో వ్యక్తికాంచినది.

శ్రీ వాసుదేవనుగ ప్రేమికస్కాని విగ్రహపుష్టియు, గాంధర్వనిసర్గమగు హృదయమును సహజసంపదలు. వీరి కొక ఖిన్నమును లేదు; ఒక్కొకపుడు స్వయముగనే పదునలు కూర్చుకొని, తాము వ్యాఖ్యానింపబోవు గీతముల అంతరర్థమును సంపూర్ణముగ వ్యక్తీకరింప ననువుపరుచుకొనుచుందురు.

శ్రీ రవీంద్రనాథుడు కలకత్తాయందు తనసంఘములో తనగీతములు కొన్నిటి నభినయింపవలసినదని వీరి నాహ్వానించినాడు. మొట్టమొదటినాడే వీరు మంచికీర్తి తెచ్చుకొనిరి. శ్రీ వాసుదేవనుగారు నేటి ఉత్తములగు నాట్యసాధకులలో నొకరని చిత్రకళాచార్యులగు శ్రీ అవనీంద్రనాథటాగూరుగారి అభిప్రాయము.

వీరిపుడు అడయారు జాతీయదివ్యజ్ఞాన విద్యాలయమందు కళాధ్యాపకులు. చిత్రలేఖ

నము నేర్పుటయే కాక వీరు విద్యార్థులను నాట్యరంగమునకు తయారుచేయుచుందురు. చెన్నపురియందు తమసంఘముతో కొన్నిప్రదర్శనములు కావించి వీరు ప్రజలమెప్పును బడసిరి.

ఈసంచికయందు ప్రకటితములైన ఛాయాచిత్రములు ఈ కళానిపుణునిగూర్చియు, ఈయన సాధనాసాఫల్యమును గూర్చియు కొంత పరిచయ మొసగగలవు. —వి. ఆర్. చిత్ర.

---

## చిత్తూరు శ్రీరామవిలాస సభ



చిత్రము ౧

శ్రీ జంగా వెంకట సుబ్బయ్యాగారు

'మేనక' - ('విశ్వామిత్ర' యందు)



చిత్రము ౨

శ్రీ జి. శ్రీనివాసాచార్యులుగారు

'శునశ్శేపుడు' - ('విశ్వామిత్ర' యందు)




## హిందూమత రహస్యములు

ప్రపంచములో క్రైస్తవమతము, బౌద్ధమతము, జైనమతము, జొరాష్ట్రియమతము, మహమ్మదీయ మతము అని వివిధమతములకెల్ల ఒక్కొక్క జాతి మతనామ ముండగా మన హిందువుల మతమునకు హిందూమత మని వ్యవహారములో లేదు. మన పూర్వు లాచరించిన మతము నకు సనాతనధర్మమని పేరు. దీని నొక ప్రవక్త గాని దేవునిపుత్రుడు గాని స్థాపింపలేదు. సర్వజ్ఞులును దూర ద్రష్టలును అగు ఋషులు మానవస్వభావమును గనిపెట్టి సర్వకాల సర్వదేశసమ్మతములగు ధర్మములను నిర్ణయించి ఆధర్మములనే అందఱును ఆచరింపదగు నని సూచించిరి. సనాతనధర్మము అహింస, సత్యము, త్యాగము మొదలగు సాధారణధర్మములపై ఆధారపడియున్నది. తక్కిన మత ప్రచారకులవలె మనపూర్వులు అందఱును ఒకేమార్గము ననుసరింపవలయునని శాసింపరైరి. అహింస మొదలగు ధర్మములలో మన కిష్టమైన ధర్మము నాచరించిన చాలు ననిరి.

ఇతరమతములకును మన హిందూమతమునకును ఎంతయో భేద మున్నది. బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయ మతములు తమ ప్రవక్త లానాడేమి చెప్పిరో దానిని నేటి కిని ఆచరింపవలెనని బోధించుచున్నవి. ప్రకృతి శాస్త్ర జ్ఞాన మభివృద్ధి యైనకొలదిని బైబిలులోని వాక్యములను కొన్నింటిని అనాదరణభావముతో చూడవలసి వచ్చెను. కేవలము అజ్ఞానాంధకారములో మునిగియున్నయూదు లకు 'జీసస్' నేనే మీకు శరణ్యమని చెప్పిన,తగినది కాని హేతువాదన ప్రబలిన ఈకాలములో ఆమాటలు చెల్లు నా? మన హిందూమతధర్మము ఒకచట్టమువంటిది కాదు. పూర్వ మేరీతిగ నుండెనో మనవ్యవస్థలను ఇప్పుడుకూడ అట్లుంచక దేశకాలానుగుణముగా మూలసూత్రములను విశేషము మార్పుచేయకయే నడుపుకొనవచ్చును. మన మతము సత్యాన్వేషణముపై ఆధారపడి యున్నది.

మహమ్మదీయ క్రైస్తవమతావలంబకులు భగవం తుని దయాసాగరుడని వర్ణించినను అతనికి పక్షపాత మున్నట్లు మనకు తోచును. ఆమతములలో భగవంతుడు తనభక్తులనే ప్రేమించి తక్కినవారిని నిరసించునట్లు ఒక నమ్మకము గలదు. మన హిందువుల భావనాప్రకారము అతని కట్టి పక్షపాతములు లేవు. ఈ విషయమే శ్రీకృ ష్ణుడు భగవద్గీతలో 'న మే ద్వేష్యోఽస్తి న ప్రియః' అని చెప్పియున్నాడు.

సనాతనధర్మము సత్యాన్వేషణముపై ఆధారపడి యుండుటచేతనే హిందువులు మతావేశులు గాక పర మతసహనమున కలవాటుపడిరి. ఇతర మతములవారు తమప్రవక్తలు చెప్పినవాక్యములలోని సత్యమును గుర్తింప లేక పరమతములపై దండయాత్రలు సలుపుటయే గాక దేవుని పేరిట వందలకొలది సంవత్సరములు యుద్ధములు చేసిరి. ప్రపంచమున కత్తిగట్టి పోరాడని మతము మన హిందూమతమే యని చెప్పసాహసింపగలము. మన పూర్వులు 'ఎటుల ఆకాశమునుండి పడిననీరు సముద్ర మును చేరునో అటులనే సర్వదేవనమస్కారము ఒకే దేవునికి చేరు'నని గ్రహించిరి. ఇట్టి యుద్దేశము కలవా

రగుటచేతనే పరమతములలోని గుణములను గ్రహించి ఎవరిమతము వారవలంబించిన చాలును; 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' అని మనకు వారు బోధింపగలిగిరి.

ధర్మము కుంగంటి అధర్మము ప్రబలినపుడు భగవంతుడు ధర్మసంరక్షణార్థము అవతారము లెత్తుచుండునని మనపూర్వులు గ్రహించిరి. కేవలము దశావతారములే గాక శంకర రామానుజాది మతస్థాపకులు సహితము దేవదూతలని మన కొక నమ్మకము గలదు. హిందూదేశమున మతాచరణము తగ్గి వివిధమతములవారు మామా మతములు గొప్పవని కలహమునకు బూనినపుడు 'మతమే మనకు పరమావధి కాదు, అది భగవంతుని వెదకికొనుటకుపాయము. సాధనారూపముచేత సర్వమతములును సమానములే. నీకు తెలిసిన ధర్మములను పరిపూర్ణముగ నాచరింపుము' అని రామకృష్ణపరమహంస కొలది సంవత్సరముల క్రిందనే బోధించినాడు. ఈమహాపురుషునిగూడ భగవదవతారముని నమ్మవచ్చును. ఈతని ప్రియ శిష్యుడగు వివేకానందస్వామి సనాతనధర్మములను హిందువులే కాక విదేశీయులు సహితము ఆచరింపవచ్చునని మన హిందూమతమునకు వైశాల్యము కల్పించెను.

ప్రస్తుతకాలమున మతమనుపేరిట మనసంఘములో ననేకదురాచారము లున్నవి. ఒకప్పుడు మన కౌన్నత్యము గల్పించిన వ్యవస్థలు నేడు నామమాత్రావశిష్టములై యున్నవి. ఇట్టినే మన హిందూమతసహజగుణములని పొరపాటుపడరాదు. అందువలన మన హిందూమతముపై నిరసనభావము మాపక సాధ్యమైనంతవరకు సంస్కరింప బూనుకొనవలయును. దేవాలయములలో భోగముమేళములు జరపుట, మాదుసారులు భుజించిన గయావళిని తీర్థములలో పూజించుట, ఎనుబదేండ్ల వృద్ధుని వివాహమునకు సమ్మతించుట, మొదలగువానిని క్రమక్రమముగా మానవలయును. వివిధసంఘములు తమ్ము తాము కట్టుబాటు చేసికొనవలెను. దురాచారములను మాన్పుటకు కొందఱు బుద్ధిమంతులు త్యాగవంతులై నిలబడవలెను. వివిధాభిప్రాయములు కలవారు ఒకటిగా చేరి కొన్ని ఏర్పాట్లు చేసికొని కార్యాచరణములోనికి దిగుటయే గాక భావిసంతతివారిని నూతన భావపూరితులను చేయవలయును. అట్లు మనము చేయగలిగినపుడే మనసంఘము మఖీవృద్ధికి రాగలదు.

—వీరేశ్వర దీక్షితులు.

---

## మాధవాచార్యులే విద్యారణ్యులు

స్వధర్మప్రకాశిని ప్రజోత్పత్తి సం. చైత్ర వైశాఖమాస సంచికలందు సంపాదకు లిట్లు వ్రాయుచున్నారు:—

ఈ జ్యేష్ఠ శు ౧౩ శుక్రవారము (29-5-81) శ్రీ విద్యారణ్యులవారి యారాధనము. ఈ మహాను భావుని సిద్ధంతితిథి (పుట్టినరోజు) ఏదియో మనకు తెలియదు.

సర్వజ్ఞులును, సకలశ్రౌతభాష్యనిర్మాతలును, విద్యానగరసామ్రాజ్యసంస్థాపకులును అగు శ్రీమన్మాధవాచార్యులను గూర్చియు, సర్వవిషయములందు తత్వద్రష్టలును, వేదమజన్ములును అగు సాయణాచార్య భోగనాథుల పాండిత్యమును గూర్చియు ప్రకృత మీ వ్యాసమునం దేమియు విశేషించి వ్రాయుటలేదు. విదేశీయులగు మ్లేచ్ఛులచేతను, జైనజంగమాదివేద బాహ్యమతములవారిచేతను కలుషిత మొనర్పబడుచున్న సనాతనహిందూమతమును ఉద్ధరించుటకొఱకు తాను స్వయముగ సకలశాస్త్రపారంగతుండగుటచేత అర్హులయిన పండితుల కందఱకు తగిన ఆశ్రయ మొసంగి సకలవిద్యాస్థానములందు సుబోధము లగు గ్రంథములం దానొనర్చి మూర్ఖకోటిని నిర్మింపజేసి, తన సహోదరుని చేత వేదభాష్యాదిగ్రంథముల రచింపజేసి, ఉత్తర హిందూస్థానము విదేశీయులును, విమతస్థులును అగు మ్లేచ్ఛులచేత ఆక్రమింపబడి సనాతనధర్మమునుండి ప్రచ్యుతిని పొందినట్లే దక్షిణహిందూస్థానము కూడ అట్టి దుర్దశకు లోను గాకుండుటకయి విద్యానగరసామ్రాజ్యమును స్థాపించి తన్మూలమున భరతఖండమున, వైదిక

ధర్మమును కాపాడిన అవతారపురుషునిగా మనము మాధవ విద్యారణ్యులను భావింపవలయును.

పాశ్చాత్యులగు ఇతిహాసవిమర్శకు లగువార లెప్పుడు అలౌకికప్రతిభావిశేషము గల శంకరాచార్యాదిమహానుభావు లొనర్చిన గ్రంథములను, దిగ్విజయాది కృత్యములను గాంచి ఒక సాధారణవ్యక్తి ఇంతటి పనిని చేయఁజాలఁడని తాము నిశ్చయించుకొని శంకరాచార్య లనేకులనియు, భాష్యకర్త యొక్కఁడనియు, దిగ్విజయ మొనర్చినది మఱొక్కరనియు, వేదాంతప్రకరణగ్రంథముల నొనర్చినది మఱొక్కరనియు, చెప్పినట్లే శ్రీమన్మాధవాచార్యులనుగూర్చియు మాధవాచార్యులు వేఱనియు, విద్యారణ్యస్వాము లనువారు వేఱనియు కొందఱు చరిత్రకారు లనుచున్నారు. మాధవాచార్యుని గ్రంథములం దెచ్చటను విద్యారణ్యుఁడను నామము తన కున్నట్లుగాని విద్యారణ్యుని గ్రంథములం దెచ్చటను తనకు మాధవాచార్యనామ మున్నట్లుగాని సూచింపఁబడియుండలేదు. కావున ఇరువురు ఒకరేయను లోకప్రతీతి అజ్ఞానమూలకము గాని ప్రామాణికము గాదని యనుచున్నారు.

మొన్నమొన్న కలకత్తాలో నందులాలుదేగారిచేత ప్రకటింపఁబడుచున్న 'హిస్టారికల్ క్వార్టర్లీ' అను గొప్ప పత్రికయందీవిషయమై గొప్పవ్యాసము వ్రాయఁబడియున్నది. మాధవాచార్యులు విద్యారణ్యులు ఒక్కరు కారనియు, ఇరువురు వేఱువేఱు పురుషులనియు ఆవ్యాసము వ్రాసిన విమర్శకుని యభిప్రాయము కాని చిరకాలమునుండి పండితపామరవిభేదము లేక అందఱిచేతను విశ్వసింపఁబడుచున్న మాధవవిద్యారణ్యైక్యము భ్రమప్రమాదజుష్టము కాదనియు, ప్రామాణికమేయనియు మే మీలఘువ్యాసమునందు నిర్ణయింపనున్నారము. మేము ప్రకటింపఁదలఁచిన విద్యారణ్యచరిత్రయందు ఈవిషయమై విశేషించి వ్రాసియున్నారము కావున ఇచట అతిసంగ్రహముగనే నిరూపింతుము.—

మాధవాచార్యుఁడుగా నున్నప్పుడు వ్రాసిన గ్రంథములం దెచ్చటో తాను విద్యారణ్యుఁ డనుపేర యత్యాశ్రమము స్వీకరింపఁగలనని ఎన్నియో సంవత్సరములకు ముందుగా తలంచుటకే యవకాశము లేదు. కావున మాధవాచార్యగ్రంథములందు విద్యారణ్యనామము నుదాహరించి తానే విద్యారణ్యుఁడనని చెప్పుకొనుట అసంభవము కనుక ఆవిషయ ముండుటకే వీలు లేదు.

విద్యారణ్యుఁ డయి వ్రాసిన గ్రంథములందు తాను పూర్వాశ్రమమునందు మాధవాచార్యుఁడనని చెప్పుకొనుట సన్న్యాసాశ్రమసంప్రదాయవిరుద్ధము. పృచ్ఛకులగువారలు యతీశ్వరుని పూర్వాశ్రమనామధామాదికమును గూర్చి ప్రశ్నించుటయు, స్వయముగా సన్న్యాసాశ్రమి తన పూర్వాశ్రమదేశవాసములను గూర్చి ఇతరులతోఁ జెప్పుటయు స్మృతులందు నిషిద్ధమయియున్నవి. కనుక మాధవవిద్యారణ్యనామములతోఁగల గ్రంథములందీనామద్వయమునకు చేరిన వార లొక్కరే యను శంకోక్తిపూర్వకప్రమాణము మనకుఁ గనంబడఁజాలదు.

౧. విద్యారణ్యకృతమని తలంపఁబడుచున్న 'జీవన్ముక్తివివేక' గ్రంథటీకయందు ఇటుల వ్రాయఁబడి యున్నది:—

శ్లో. ఏతేషాంతు సమాచారాః
ప్రోక్తాః పారాశరస్మృతౌ,
వ్యాఖ్యానేఽస్మాభి రత్రాఽయం
సంగ్రహేణ వివిచ్యతే.

దీనివలన పరాశరస్మృతివ్యాఖ్యాత మాధవుఁడను విషయము తద్వ్యాఖ్యానమునకుఁ గల పరాశరమాధవీయనామముతోనే మన మెఱుంగుచున్నారము గదా! జీవన్ముక్తివివేకకారుఁడు మేము పరాశరస్మృతియందు ఈవిషయమును గుఱించి వ్రాసినామని చెప్పుటచేత ఉభయులు ఒక్కరేయని మాత్రము తెలియవచ్చుచున్నది.

౨. నృసింహసూరి తన 'తిథిప్రదీపిక'యను గ్రంథమునందు కాలనిర్ణయము విద్యారణ్యులు మున్నగువారిచేత వ్రాయఁబడినదని ఇట్లు వ్రాసి యున్నాఁడు:—

శ్లో. అనంతాచార్యవర్యేణ మంత్రిణా సూచిసుశనా,
విద్యారణ్యయతీంద్రాద్యైః నిర్ణీతః కాలనిర్ణయః.
అవిశ్వేషీకృతస్తైశ్చ మను దిష్ట్యా క్రియాః క్రియాః,
తమహంసస్ఫుటంవక్ష్యే ధ్యాత్వా గురుపదాంబుజమ్.

కాలనిర్ణయము మాధవాచార్యకృతమను విషయము సుప్రసిద్ధము.

నృసింహసూరి "మాధవాచార్యుఁడును, విద్యారణ్యుఁడును ఒక్కరే" యని తలంచుచున్నటుల దృఢమగుచున్నది.

౩. అహోబిలపండితుఁడు 'మాధవీయధాతువృత్తిని' విద్యారణ్యకృతమని యిట్లు వ్రాసియున్నాఁడు:—

శ్లో. వేదానాం భాష్యకర్తా వివృతమునివచో
ధాతువృత్తే ర్విధాతా
ప్రోద్యద్విద్యానగర్యాం హరిహరనృపతే
స్సార్వభౌమత్వదాయీ,
వాణీనీలాహివేణీ సరసిజనిలయా
కింకరీతి ప్రసిద్ధా
విద్యారణ్యోఽగ్రగణ్యోఽభవ దఖిలగురు
శ్శంకరో వీతశంకః.

౪. 'వీరమిత్రోదయ' మను ధర్మశాస్త్రనిబంధన గ్రంథకర్త యగు మిత్రమిశ్రుఁడు పరాశరస్మృతివ్యాఖ్యాత విద్యారణ్యుఁడని తనగ్రంథమునం దిట్లు చెప్పియున్నాఁడు:—

"వ్యాఖ్యాతంచేదం శంఖవచనం విద్యారణ్యశ్రీచరణైః పరాశరస్మృతిటీకాయాం పైతృకద్రవ్యవిభాగకాలే 'స్వధృతాలంకారాదికమపి కన్యాప్రాప్నో' తీత్యాహ శంఖ ఇతి."

—వీరమిత్రోదయము, పుటలు. ౫౮౩, ౬౩౨.

"విద్యారణ్యశ్రీచరణోక్తం ప్రాగ్విలిఖితం తస్మాన్నిరింద్రియా ఇత్యాది శ్రుతి వ్యాఖ్యానేతు స్త్రీణాం దాయగ్రహణప్రతిషేధత్వ మేవాఽస్యాభ్యుపేతేర్నాఽస్తి ఇతి." పరాశరమాధవీయము, వాల్యూ. ౧౩, పుట ౫౩౮.

౫. ప్రయోగరత్నమాల, ఆపస్తంబాధ్వర తంత్రవ్యాఖ్య, చౌండపాచార్యకృతము, ఈ గ్రంథమునందు 'వేదవ్యాఖ్యాత విద్యారణ్యస్వామి' యని యిట్లు గలదు: ఇతఁడు విద్యారణ్యుని తర్వాత సుమారు ౫౦ సం. కాలమువాఁడు:—

శ్లో. నమో విరించివిష్ణీశభేదేన పరమాత్మనః,
సర్గస్థితివినాశానాం వ్యక్తయేఽవ్యక్తమూర్తయే.
పదవాక్యప్రమాణానాం పారదృశ్వా మహామతిః,
సాంఖ్యయోగరహస్యజ్ఞో బ్రహ్మవిద్యాపరాయణః,
వేదార్థవిశదీకర్తా వేదవేదాంగపారవిత్,
విద్యారణ్యయతిః జ్ఞాత్వా శ్రౌతస్మార్తక్రియాపరైః,
శ్రీచౌండపార్యప్రముఖైః విద్వద్భిర్బ్రాహ్మణోత్తమైః,
వ్యాచష్ట్వాధ్వగతంత్రత్వం సమంత్రార్థమితిస్ఫుటమ్,
ప్రార్థితో బహుశ శ్శ్రౌతం విశదీకర్తు ముద్యతః,
కల్పసూత్రే ష్వనేకేషు సర్వత్రతు సమన్వయాత్,
ఆపస్తంబాచార్యసూత్రం ప్రధానం ప్రచురంత్వితి,
తత్సూత్రమేవ వ్యాచష్టేహ స్తోద్గాతృప్రసంగతః,
కరపూరితపర్యాశః శ్రీమాన్ హరిహరేశ్వరః,
శశ్వదా కామితా నాబ్ధిభువం నానానృపాశ్రయాం,
వ్యధాదపి పురాణాని మహాదానాని షోడశ,
తస్మాదభూ ద్భూరిధామా యువబుక్కమహీపతిః,
తిప్పాంబానామ తస్యాసీ ద్రాజ్ఞీ గుణగరీయసీ,
తస్మాదస్మాత్ సమభవ ద్భూపతిః శ్రీభువఃపతిః,
శర్మబ్రహ్మధ్వనీనేన కవి శ్యేన కృతీ కృతః,
సకదాచి ద్భూపతీంద్రః పాలయన్ ధర్మతః ప్రజాః,
సంప్రార్థితో ద్విజైః శ్రౌతం విశదీకర్తు ముద్యతః,
విచార్య విదుషాం మధ్యే చౌండపార్య మదీదిశత్,
వ్యాచష్ట్వాధ్వరతంత్రంత్వం సమంత్రార్థమితిస్ఫుటమ్,
కింస్తుమశ్చౌండపాచార్యం జాతం తత్ర మహాకులే,
వసిష్ఠారంధతీముఖ్యా యత్కులే గృహమేధినః,
విశిష్టవాసిష్ఠకులే చిన్నయార్య స్సతాంమతః,
కామాంబా గృహిణీ తస్య భారద్వాజకులేఽజని,
అర్యాదివాతో మిథునా దుద్భవన్నిహితా స్సుతాః,
చౌండపార్యాదిత్యదేవ మంచపార్యాభిధాస్త్రయః.

* * *

ఇతి శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీర హరిహర మహారాజ సామ్రాజ్యధురంధర ప్రతాపవీర యువబుక్క భూపాల శ్రీరోదార్ణవపూర్ణచంద్రస్య రాజ వ్యాసవాల్మీకేః కర్మబ్రహ్మాధ్వనీనస్య శ్రీవీరభూపతి భూమిపాలస్య మంత్రిణా చిన్నయార్యనందనేన ఆదిత్య దేవమంత్రపార్యాగ్రజన్మనా చౌండపాచార్యేణ విలిఖితాయాం ఆపస్తంబీయాధ్వరతంత్రవ్యాఖ్యాయాం ప్రయోగరత్నమాలాయాం పరిభాషాపరిచ్ఛేదః

శ్లో. కర్మబ్రహ్మాధ్వనీనస్య మంత్రీభూపతిభూపతేః,
వ్యాచష్టే చౌండపాచార్యః ప్రకృతేఽదగ్నిప్రాగ్నిమే.

౬. మైసూరు ఆర్కియాలజికలు రిపోర్టు ౧౯౦౮ సం. పేరా ౫౮ లో కంపహరిహరునిచేత క్రీ ౧౩౮౬ సంవత్సరమునందు శ్రీవిద్యారణ్యులవారి సమక్షమునందు వేదభాష్యకరణమునందు సహాయ మొనర్చినట్టి—

(౧) నారాయణ వాజపేయ యాజి

(౨) నరహరి సోమయాజి

(3) పండరిదీక్షితులు

అను ముగ్గురు పండితులకు భూదానమొసంగఁబడినటుల గలదు. విద్యారణ్యులవారు పూర్వాశ్రమమునందు వేదభాష్యకర్త యగుటచేతనే వారియెదుట నీభూదాన మిచ్చుట సబబుగ నుండవచ్చునని ఊహింపఁబడుచున్నది. కంపహరిహరుని పుత్రుఁడు ఆరాపరగణాకు రాజప్రతినిధియు, గవర్నరును అగు చిక్కరాయఁడు క్రీ. ౧౩౮౧ శకమునందు వైశాసనమునందుఁ గల నారాయణవాజపేయయాజి మున్నగు ముగ్గురకు ౬౧, ౪౦, ౫౦ వరహాల వార్షికాదాయముగల భూమి నొసంగినటుల శృంగేరియందుఁ గల మఠ్ఠొకశాసనమువలన తెలియుచున్నది. (మా. ఎపి. కర్ణా, శృంగేరి. ౩౪.)

పై ప్రమాణములవలన విద్యారణ్యులున్నూ మాధవాచార్యులున్నూ ఒక్కరేయను విషయము విద్యారణ్య సమకాలికులును, తదనంతరకాలికులును అగు పండితుల చేత గ్రంథములందుకూడ పేర్కొనఁబడి యున్నది. కావున మనము నిస్సంశయముగ నమ్మవచ్చును.

---

## అచంట రామలింగేశ్వరాలయము



శిథిలమైన యీ పురాణదేవాలయమును కొచ్చెర్లకోట జమీందారు వంశము వారు మరమ్మతు చేయుచున్నారు. ఈ యాలయము చెంత నున్న తటాకమున నొకమట్టిదిబ్బ కలదు. అచ్చట వసిష్ఠుడు తపస్సుచేయుచుండెనని యైతిహ్యము.

---

టైప్రైటరులో చిత్రింపబడిన చిత్రముల నమూనాలు




‘, —’ రెండుచిహ్నములుమాత్ర ముపయోగింపబడినవి. వీనిని దయారుచేయ నొకటిన్నరఘంటకాలమయ్యెను.

చిత్రకారుడు: శ్రీ ముద్దా విశ్వనాథముగారు, కవితాసమితి.

# ప్రేమసందేశము

## 1. ప్రేమ

సుప్రసిద్ధ ఫ్రెంచి లేఖకుడు, 'పాల్ రిచార్డు.'

జీవించుట ప్రేమించుటకే.

ప్రేమా భావము, ఆత్మాభావము.

అనంత ప్రేమయే అనంతాత్మ.

* * *

వ్యక్తిజీవనమునకు, ప్రేమ కొలతపాత్ర.

పెరుగుట అధికముగ ప్రేమించుటకు.

అధికముగ ప్రేమించువాడు అధికోన్నతుడు.

* * *

ప్రేమ జీవితపుటాత్మ.

ఆనందము ప్రేమకు ఆత్మ.

సౌఖ్యప్రేమ ప్రేమసౌఖ్యముచే గాని తీరదు.

* * *

క్షీణించెడి ప్రేమ ప్రేమ కాదు.

నేరారోపణ మొనర్చెడు ప్రేమ ప్రేమ కాదు.

ప్రేమ తనప్రకాశము నెల్లెడల గనుచుండును.

* * *

నిర్బంధించెడి ప్రేమ ప్రేమ కాదు.

ప్రేమ దేనిని స్వీకరించదు—సర్వమును కలిగియుండును.

* * *

లెక్కించెడి ప్రేమ ప్రేమ కాదు.

దుఃఖించెడు ప్రేమ ప్రేమ కాదు.

ప్రేమ అపజయము నెరుగదు.

* * *

ప్రేమ ఆత్మపుటపారత.

ప్రేమ భగవంతుడు—భగవంతుడే ప్రేమింపగలడు.

ప్రతివ్యక్తియు తాను భగవంతుడైనంతవరకు, భగవంతుడు తనలో నున్నంతవరకు, ప్రేమింపగలడు.

* * *

ప్రేమకు బయటి భాగమున మరణ మావరించియున్నది.

* * *

ఏదేనొక యస్తిత్వముగు ప్రేమప్రభావమువలన గాని, ఏదియు జీవింపదు.

ప్రతి ప్రపంచమును ప్రేమకు కేంద్రము. ఈ ప్రేమ నిర్బంధింపబడి యుండుటచే, స్వేచ్ఛకొరకు యత్నించుచుండును.

ప్రతిప్రపంచమునను ఒక హృదయము కొట్టుకొనుచుండును.

* * *

అహంకారము ప్రపంచములను దుమ్మొనర్చినది. ప్రేమ హృదయము దానికి ఆకృతి నొసగినది.

ప్రేమ అహంకారముతో నిట్లన్నది—"నీయిచ్చవచ్చిన నరకము సృజించుకొనుము నే నచ్చటికి వచ్చెదను."

కఠినతమమగు నరకమున అధికతమమగు ప్రేమ కలదు.

* * *

అహంకారము ప్రేమకు దగ్గరత్రోవ.

అహంకారి ఆకృతి పోషకుడు.

అహంకారము అహంకారికి కారాగృహాధికారి.

* * *

అహంకారము ప్రకృతికి రక్షణనొసగును. అది లేనిచో బాటసారి గుంపులో కలసినట్లు, ప్రతిజీవియు మిగిలినవారిలో మిశ్రమమైపోవును.

ప్రతిజీవియందలి త్యాగాగ్నియే ఈశ్వరుడు.

* * *

తన్ను తాను త్యజించుట మరల భగవంతు డగుట.

నీయథార్థరూపమును పొందుటకు గల ప్రతిబంధకములను త్యజించినపుడే నిన్ను నీవు త్యజింపగలవు.

ఆత్మను త్యజింపకుము. ఆత్మేతరముల త్యజింపుము.

* * *

అహంకారవిముక్తుడ వగుట నీవిధి కాదు. గ్రుడ్డులోనుండి పిల్ల బయటికి వచ్చినట్లు, దానినుండి విడివడుట నీహక్కు.

* * *

## 2. ప్రేమించిన వారినే ప్రేమించుచో—

ప్రేమించినవారిని ప్రేమించుట ఒక్కొక్కసారి దొడ్డ విషయము.

నిన్ను ప్రేమించనివారిని నీవు ప్రేమించుటయే తరచు జరుగుచున్నది.

ప్రేమించనివారిని జూచి జాలిపడవలెను. ప్రేమించు వారిని గాంచి భయపడవలెను.

* * *

ప్రేమయని పిలువబడుచున్నది భోగము.

భోగాగ్ని అగ్నిభోగము.

అహంకారపు సమిధ లేనిది ప్రేమాగ్ని రగుల్కొనదు.

* * *

రెండహంకారములు కలసినప్పుడు దానిని మనుజులు ప్రేమ యందురు.

అహంకారముగల యాతడు తరచు "నేను ప్రేమించుచున్నా"ననుచుండును.

"పరహిత"మనగా తలక్రిందైన అహంకారము

* * *

పొంచియున్న అహంకారము "ప్రేమ".

కబళింపగోరుట ప్రేమపు ప్రథమాకృతిగ నుండెను.

సజీవులను భక్షించుట మానవుని భూతదయకు చిహ్నము.

* * *

ప్రేమ ద్వేషమునకు పొరుగింటనే యుండును.

ప్రేమ ద్వేషమునకు రెండవవైపు—రెండును ఒకవస్తువుతోనె చేయబడినవి.

ఒక్కొక్కప్పుడు ప్రేమకంటె ద్వేషమె అన్యోన్యముగ నుండును.

* * *

వియోగము నొందలేకపోవుటచే ద్వేషముకలుగుచున్నది.

సంయోగము నొందగల్గుటచే ప్రేమ జనించుచున్నది.

* * *

## 3. శత్రుల ప్రేమింపుము

ఒకమనుజుని ద్వేషించుట మానవత్వమును మోసగించుట.

ఒకనిని ద్వేషించుట అతనిదుశ్చేష్టలకు సహాయపడినంత దుర్మార్గము.

నీవు శత్రుల ప్రేమింపుము—నీకు శత్రువు లుండరు.

* * *

శత్రుని ప్రేమించుటయన అతని జయించుట.

నీ వాతని ప్రేమించుచో నిన్ను ద్వేషించున దెవరు? అతడు నిన్నింకేమి చేయగలడు?

ఒకానొకప్పటి నీ ప్రబలశత్రువు ఇప్పుడు నీకు గాఢ మిత్రుడు కాలేదా?

* * *

నీవిరోధులను మిత్రులకంటె జాగ్రత్తగ నేరుకొనుము.

స్నేహితుడుగ ఆహ్వానింపదగినవానినె విరోధిగ అంగీకరింపుము.

నీవు ప్రేమింపగల్గిన వానితోనె పోరాడుము.

* * *

ఆహా! శత్రుని గల్గియుండుట యెంత సౌఖ్యదాయకము!
శత్రువు ఈశ్వర ప్రసాదితుడు.

ఈశ్వరుడు శత్రురూపముననే తన దివ్యసాహాయ్యము నొసగుచున్నాడు.

* * *

శత్రునిలోగూడ 'దివ్యమిత్రము'ను గుర్తించుము.

## 4. దుర్మార్గుల నిరోధింపకుము

బలవంతులె నిరోధింపకుండుటకు సమర్థులు.

నీతిబోధకుడు బలహీనుల నోరిమిగ నుండ కోరును.

వైద్యుడు బీదవానికి, భాగ్యవంతుని పథ్యము చెప్పినట్లున్న దిది.

* * *

దుర్మార్గుల నీవు నిరోధింపనిచో, భగవంతుడే వారిని నాశముచేయక తప్పదు.

ఈశ్వరుని అగ్నికణములను వైరి మస్తకమున నుంచుట నే మనుజులం మంచితన మందురు.

భగవదనుజ్ఞ యైనచో వైరీ! నన్ను చంపుము. కాని నీయంత నీవు చంపినచో నీకు మరణము నిశ్చయము.

*           *           *

దుర్మార్గుని సంస్కరించుట అతనిని కరుణించుట.

దూషించువానిని దూషణతోనే మరణింపనిమ్ము. అతని వాదనకు అడ్డుచెప్పకుము.

నీపై అబద్ధ సాక్ష్యముచెప్పు వానిని ఏమియు ననవలదు— అది వానిని రక్షింపవచ్చును.

*           *           *

నన్ను దేవనిగ దూషించువాడె నాకు మంచిస్నేహితుడు. అతడు నాలోపముల నేరెను జల్లెడ.

5. "విమర్శింపకుము..........."

మనుజుని విమర్శించుట దేవుని విమర్శించుటయె.

దేవుడు తనదేవత్వమును ప్రతిమనుజునిలో కడు స్వల్పముగ నుంచినాడు. ఇక మనుజుని కోపపడిన ప్రయోజన మేమి?

*           *           *

మరియొకరి నాక్షేపించుట తన్ను తా నగౌరవపరచుకొనుట.

విమర్శించుట పరా అన్యాయ మొనర్చుట.

పాపమును నిరసించినచో పాపమునకంటె పతితుడ వగుదువు.

*           *           *

'కారణము' విమర్శించును. 'జ్ఞానము' గమనించును.

ఎక్కువ విమర్శించుట, తక్కువగ గ్రహించుట. విమర్శించుట జ్ఞానమును పోగొట్టుకొనుట.

*           *           *

మనుజుని లోపలి భాగమును విమర్శింపవలెను. పైభాగము కాదు.

నీకున్న లోపమును విమర్శించుట కష్టము. నీకు లేని దానిని విమర్శించుట సంభవము.

నిన్ను నీవే విమర్శించుకొనుము.

*           *           *

ప్రేమ లేనిచో న్యాయము లేదు.

ప్రతిసంఘమునను దానికి తగిన నేరస్థు లున్నారు.

తనవంతు నేర మింతవరకు నొవర్పనివా డందరికంటె అపాయకరమగు నేరస్థుడు.

*           *           *

కాలము న్యాయాధిపతుల కంటె నేరస్థులనె తరచు నిర్దోషులుగ నిర్ణయించుచున్నది.

'న్యాయాధిపతి'—తాను మరణశిక్ష విధింపబడి, ఇతరులకు శిక్ష చెప్పువాడు.

'విచారణ'—ముద్దాయిలు, న్యాయాధిపతులు ఎవరు ముందు వచ్చెదరో తేల్చుకొనుట కాడెడి ఆట.

*           *           *

నేరము ననుకరించెడు శిక్ష దానిని సమర్థించును.

చట్టసమ్మతమగు మరణశిక్ష అక్రమహత్యలకు పునాది.

ఒక్క నేరస్థునిపై విధింపబడిన మరణశిక్షకు ఫలితముగ, యుద్ధములలో వేలకువేలు నిరపరాధులకు మరణశిక్ష విధింపబడుచున్నది.

6. "చంపరాదు"

ఎట్టి పరిస్థితులలోనైనను, ఏనెపముననూ, ఎన్నడు— చంపరాదు.

ఒకమానవుని చంపుట తనలోని మానవత్వమును చంపుకొనుట.

కెయిన్ వలెనె, కెయిన్ పుత్రకు లందరును ఈప్రపంచమున నుండ నవర్హులు.

ప్రభుత్వము జీతము నొసగని సైనికులను దొంగ లందురు.

"ఖాకీ"రంగు దుస్తులలో నెంత యధికముగ జంపిన నంత గౌరవము.

చక్కని దుస్తులు 'చక్కని' హంతకుల జేయవు.

* * *

హత్య ఎన్నడును వీరలక్షణము కాదు.

సమూహముగ చంపుట, ఒక్కొక్కరినిగ చంపుటకంటె గౌరవప్రదము కాదు.

ఒకరి ఆజ్ఞచే చంపుట కెట్టింపు పిరికితనము.

* * *

"జీవితము"—ఒకరి నొకరు చంపుకొనుట కీయబడిన వ్యవధి.

"నాగరకత"—మారణ యంత్రసంపత్తిచే, కొద్దిమందికి లభించెడి హోదా.

"అనాగరకత"—మారణ యంత్రముల నవీనముగ నుంప లేకపోవుట.

* * *

బ్రదుకుట, చంపుటకు.

అందరిలోనను జీవించుచున్నట్లు భావించువాడె నిరపరాధి.

ఎన్నడును చావనివాడే, చంప హక్కు గలవాడు.

* * *

సమగ్ర ప్రేమకు హత్యయే లేదు.

సమగ్ర ప్రేమకు మరణమే లేదు.

—వడ్లమూడి గోపాలకృష్ణమూర్తి

---

## ౧

### పల్లవి

విడుదలో - విడుదలో - విడుదలో

### అనుపల్లవి

అందరును ఆంధ్రులో-అందరును ఆర్యులో

### చరణములు

౧. మాలలకును మాదిగెలకును
ఎరుక లేనాదులకును
ఆదిమాంధ్రు లైనవారి
కందరికిని విడుదలో వి.

౨. తాగ నీళ్ల బావులూ
తానమాడే చెరువులూ
చాపకూళ్ల సత్రములూ
సామివారి పూజలూ వి.

3. అందరెమ్మ పాలు యిచ్చి
అందరెయ్య బువ్వపెట్టి
కల్లిబొల్లి భేదములకు
కారణముల దెల్పరో వి.

౪. కట్టెలన్ని మట్టివాయె
కట్టెలోది దేవుడాయె
కట్టెకట్టె నడుమ మనకు
వట్టిభేద మెట్టనో వి.

౫. నీవు నేను నీళ్లు నిప్పు
చెట్టు పుట్ట గట్టు మిట్ట
చేపజెల్ల దేవుడయితె
చెప్పరాని దేవడురో వి.

౬. అంటరాని దేవుడంట
అంటవచ్చె దేవుడంట
చదువుకున్న వాండ్లకంటె
చాకలోండ్లె మేలురో వి.

౭. అందరినొసట పొద్దుపొడిచె
అందరినొస్ట పొద్దుగూకె
ఎల్లవారికంటె నీవు
ఎక్కువేల చెప్పరో వి.

౮. నిన్ను గొడితె పాలుగారి
నన్ను గొడితె నీళ్లుగారి
గొప్పకొద్ది రకము లిందు
కలవొ లేవొ దెల్పరో వి.

౯ ముప్పైకోట్ల దేవతలతొ
ముచ్చటయిన పున్నెభూమి
బానిసత్వ మనెడి పాడు
పంటలేల పండురో వి.

---






శ్రీమతి పి. మందాకినీబాయిగారు

దక్షిణభారత హిందీప్రచారసంఘమువారి పరీక్షలలో సర్వోత్తమ మగు 'రాష్ట్రభాషావిశారద' పరీక్షయందు జయముగాంచిన యువతి.

---




## రఘువంశము

క్రౌనుసైజు, పు ౧౬౩, వెల రు. ౦-౧౨-౦.

కాళిదాసమహాకవికృతమగు రఘువంశకావ్యము నందలి తొలితొమ్మిదిసర్గముల కిది యాంధ్రగద్యానువాదము. నేడు నెల్లూరుమండలమున గల కవులలో పేరుగన్న శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగా రనువాదకులు. కలానిధిగ్రంథమాలయందు ద్వితీయకుసుమముగ నీగ్రంథము ప్రకటితమయినది. శాస్త్రిగారు మూలమున కుద్దిగ నుండునట్లు నేరుపుతో దీని ననువదించినారు. రచనము ప్రౌఢమధురమయి ధారాళముగ తీగలు సాగుచున్నది. అనువాదకులు మల్లినాథుని వ్యాఖ్యానమున గల విశేషాంశములను చెక్కించి వివరించినారు. మూలమునందలి ప్రాచీనదేశనదీనగరాదుల నేటి నామములను, స్థలములను సూచించినారు. ఈవివరణాదు లనువాదము విలువను పొడిగించుచున్నవి. ఈగ్రంథము స్కూలు ఫైనలు తరగతి విద్యార్థు లవశ్యపఠనీయగ్రంథముగ జదువ దగినది. పాఠ్యగ్రంథనిర్ణాయకసంఘమువా రీగ్రంథము విలువను గుర్తింతురు గాక!

గ్రంథమునుండి మచ్చున కొంత:—

"అం దొకవంక గజబృంహితమువంటిధ్వని కాఁగా సాక్షేటాభిలాషియగు నావిలుకాఁడు శబ్దపాతియగు నిశితభల్లము నావంకకు విడిచెను. క్షత్రియుల కట్టిపని నిషిద్ధమని యెఱిఁగియు దశరథుఁడు ధర్మమార్గము నుల్లంఘించెను. ఎంతటి ప్రాజ్ఞులైనను రజోనిమీలితులైనచో నపమార్గమునం దడుగు వెట్టుదురుగదా! అతఁ డట్లు బాణము ను వదలుటయే తడవుగా నాచాయనుండి 'హా! తండ్రీ!' యను నాక్రందనము వినఁబడెను. ఆ యార్తధ్వని వినఁ బడినంతనే పంక్తిరథుఁడు విషణ్ణుఁడై పరువెత్తి యందందు వెదుక నొక ప్రబ్బలిపొదకు సమీపమున నొక చిన్నవాఁడు, నీటికడవఁ జేతఁబట్టుకొని శరఘాతమునఁ దన్నుకొనుచుఁ బడియుండుట కనుపట్టెను. ఆ సుకుమారునిఁ జూచినంతనే దశరథుని హృదయము సంతాపమున ప్రస్వి బాకునఁ బొడిచినట్లు నొచ్చెను. ఉత్తమవంశజుఁ డగు నా నృపతి, గుఱ్ఱమునుండి దుమికి 'నాయనా! నీ వేకుల మువాఁడ' వని యా కుఱ్ఱవాని నడుగఁగా నాతఁడు చేతికడవ నూఁతగఁగొని కూరుచుండి, శక్తిలేమిచే మాటలు తడఁబడఁగా, 'అయ్యా! నేను ద్విజేతరుఁడను. తపస్వితనయుఁడను. దయచేసి నాశరీరమునుండి యీశరమును గదలింపకయే నన్ను అంధులగు నా తల్లిదండ్రుల కడఁ జేర్పు' మనెను. దశరథుఁ డాపసివానిని, వాని తల్లిదండ్రులకడఁ జేర్చి, తా నజ్ఞానవశమునఁ జేసినతప్పును వారితోఁ జెప్పుకొనెను. ఆమునిదంపతులు పట్టరాని దుఃఖమున మిక్కిలి విలపించి, దశరథునిచేతనే యాశరము నూడఁదీయింపఁగా నా కుమారుఁడు మృతినందెను."

---

## మహాభారతయుద్ధకాలము

### (The Age Of Mahabharata War)

క్రౌనుసైజు ౧౦౨ పుటలు. వెల రు ౧.

గ్రంథకర్త: నడింపల్లి జగన్నాథరావుగారు, బి. ఏ., బి. యల్. వకీలు, నరసారావుపేట.

ప్రాచీనభారతదేశచరిత్రము భారతయుద్ధకాలముతో ప్రారంభమగుచున్నది. ఆకాలము వివాదగ్రస్తమయి పలువురచే పలుతెగల పేర్కొనబడినది. భారతము, పురాణములు, మహమ్మదీయచరిత్రకారుడగు

త్రిపురానికధనము, నేపాళ రాజవంశావళి, గ్రహగతి, అయనగతి మున్నగువానిని పురస్కరించుకొని వివాదములకు మూలములగు ప్రమాణములను సయుక్తికముగ ఖండించి భారతీయుద్ధకాలము క్రీ. పూ. ౩౧౩౮ అని గ్రంథకర్త సిద్ధాంతీకరించినారు. ఇక నశోకుని శాసనములను, ఆంధ్రరాజులయు తత్సమకాలీనులగు నితరరాజవంశజులయు శాసనాదులు పేరుకొను కాలముల కీకాలము సరిపోవు నేని యీ సిద్ధాంతము సుప్రతిష్ఠితము కాగలదు. గ్రంథకర్త యిందుకు పూనుకొని తన అమూల్యపరిశ్రమను సార్థకము చేసికొనును గాక! ఈ గ్రంథ మాంగ్లమున గలదు.

---

## వీరేశలింగసంస్మృతి

క్రౌను సైజు. ౧౬౦ పుటలు. వెల: రు ౧-౮-౦.

గ్రంథకర్త: రాయసం వెంకటశివుడు గారు, యం. ఏ., యల్. టి., గుంటూరు.

ఆంధ్రగద్యవాఙ్మయజనకకర్తయు, గొప్ప సంఘసంస్కర్తయు నగు 'వీరేశలింగమహాశయుని "జీవిత చరిత్రము" రచింపవలెనని చిరకాలమునుండి గ్రంథకర్త కుండిన 'యాశయము' నేడీ గ్రంథరూపమును దాల్చినది. గ్రంథకర్తకడ నుండిన కొన్ని సంవత్సరముల స్వీయదినచర్య పుస్తకములు, వీరేశలింగము పంతులు గారు వ్రాసిన జాబులు, పంతులుగారు, గ్రంథకర్త కలసి, ప్రత్యేకించి కొనసాగించిన 'సత్యసంవర్ధని', 'జనానాపత్రిక'ల సంపుటములు, గ్రంథకర్త యుపన్యాసములు, వ్యాసములు, గ్రంథకర్తస్వానుభవము మున్నగునవి గ్రంథసవిషయముల కాధారములు. పంతులుగారితోడ చిరకాలసాహచర్యము, వారియెడ భక్త్యాదరములు గల గ్రంథకర్త పంతులుగారి స్వభావాదులయందు గుణములవలెనే దోషములను పరికించి యిందు నిర్భయముగా ప్రకటించినాడు. తాము శ్రీపంతులుగారి యాగ్రహమునకు పాత్రులగుటను దెలిపినారు. గ్రంథకర్త సత్యప్రియత కీగ్రంథము నిదర్శనము. 'ఏకక్రియా ద్వ్యర్థకరీ' యను న్యాయముబడి నీ గ్రంథమున శ్రీపంతులుగారి జీవితకధనముతోపాటు గ్రంథకర్త జీవితకధనమును గలదు. వీరేశలింగమహాశయుల గురించిన వాఙ్మయమున కిది యొక యమూల్యమగు క్రొత్తకూర్పు. ఆంధ్రలోకసమాదరపాత్రమగు నీ గ్రంథమున రచనము సుగమముగ నున్నది. మహాపురుష జీవితచరిత్ర మగుటచే నిది ఉన్నతపాఠశాలల విద్యార్థులకును పాఠ్యగ్రంథముగ స్వీకరింపబడినది.

---

## వావిళ్ల వాచకపుస్తకము

క్రౌను సైజు, పు. ౧౩౧. వెల రు ౦-౬-౦.

గ్రంథకర్త: జయంతి గంగన్నగారు, బి. ఏ., యల్. టి.

ఈ పేరున నయిదు తరగతుల వాచకములు వెలువడి యిదివరకే ప్రచారమున నున్నవి. ఇదియాఱవది. వెనుకటివానియందువలెనే బాలురకు దేశభక్తి, చరిత్రము, నీతి, విజ్ఞానము మున్నగువానియందింత ప్రవేశము లభించి వానిపయి నభిరుచి పొడముట కుపకరించు విషయములే యిందును గలవు. రచనము సుగ్రహముగ నున్నది. ఈ వరుసవాచకములు పాఠ్యగ్రంథనిర్ణాయకసంఘమువారి యామోదమును బడసినవి. ఇక పాఠశాలాధికారులే వీని పఠనమువలని లాభమును తమతమ పాఠశాలలయందలి చిన్ని విద్యార్థులు పొందుట కనకాశము నొసంగవలసినవారు. ఇందచటచట వాక్యములు కొన్ని యన్వయము కుదురకున్నవి. కొన్ని పేలవముగ నున్నవి. భాషాప్రవేశమునకు ప్రధానగ్రంథములగు నిట్టి వాచకములయం దిట్టి లోపములు లేకుండ గ్రంథకర్తలు చూచుకొనవలెను.

విలాసము: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

---

## రసాభరణము

భోజరాజీయమును, ఛందోదర్పణమును రచించిన అనంతామాత్యుని దీకృతి. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు దీనిని క్రొత్తగ ప్రకటించినారు. (పరిషత్పత్రిక నుండి

పునర్ముద్రితము — ౧౯౩౧. ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ. వెల : ౦-౮-౦.)

ఇది కేవలము రసమునుగూర్చిన గ్రంథము. ప్రథమాశ్వాసమున స్థాయిభావములను, శిల్లక్షణలక్ష్యములను, విభావానుభావసాత్త్వికసంచారి భావలక్షణములను వివరించి నవరసములకు నుదాహరణములను జూపినాఁడు కవి. అంతటితో తక్కిన రసములు నిష్క్రమింప, శృంగారము మాత్రమే ప్రపంచిత మొనర్చి యీ గ్రంథము తనకు 'రసాభరణ'త్వము సాధించుకోఁజూచినది. ఇది క్రీ. శ. ౧౪౩౫ సంవత్సరమున దేవాంకిత మొనర్పఁబడినది.

సంస్కృతభూయిష్ఠతలో బిగింపక, సంస్కృతి వెలయు నక్కనిశైలితో, సరసభావరచనతో, విషయము సుబోధమగునట్లు నిర్వహించినాఁడు కవి యీకృతి.

విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావు గారు (F. A. R. S., P. O. L.) తమ సవిమర్శనము భూమికతో ఈసంపుటము నలంకరించినారు.

ప్రకాశకులు తమప్రతిని చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందలి రెండు ప్రతులతో సరిచూపించితిమన్నారు. పిదప 'ఇందలిపాఠభేదములు చెన్నపురి...... భాండాగార ప్రతినుండి గ్రహింపఁబడిన' వన్నారు. ఒక్కప్రతినుండి కాదు, రెండు ప్రతులనుండియు నీఁబడినవి; కాని కొన్నిమాత్రమే.

'తెలరన్ ధైర్యము మనమునఁ
గలిగినయది ధీరనాయికానాము యగున్,
వెలయను ధైర్యము చాలని
నలినవిలోచన యధీరనామక యయ్యెన్.'

(పుట ౩౮)

అనుపద్యమున, 'వెలయను' నకు 'వెలయఁగ' అనియు, 'అధీరనామక'కు 'అధీరనాయిక' అనియు పాఠభేదములు. ముద్రితపాఠము ప్రా. భాండాగార ప్రతుల రెంటను లేను. 'అధీరానామక' అని యుండఁదగుదానికి 'అధీరనామక' అన్నపాఠముకంటె, 'అధీరనాయిక' అన్న యొప్పగుపాఠమునే స్వీకరించిన బాగుండెడిది. ఇట్టివి యిదకు పాఠభేదములుగ నైన సూచింపలేదు.

'తలరం ధైర్యము' అనుచో 'తలరు'నకు శబ్దరత్నాకరమున ౧. చలించు; ౨. చింతించు; ౩. కలఁగు; ౪. సంభ్రమించు; ౫. ఒప్పు—అని అర్థము లిచ్చి, ఐదవ అర్థమునకు అడిదము సూరకవి 'కవిజనరంజనము'నుండి ప్రయోగము చూపి, 'ఈ యర్థము'నకు నితరగ్రంథముల యందు ప్రయోగము కనఁబడ లేదు' అని వ్రాసియున్నది. ఇపుడీ 'రసాభరణము'న ఒకప్రయోగము దొరకినదన్నమాట. ఒక ప్రతియందు 'తరలనిధైర్యము' అని యున్నది. 'తలరని ధైర్యము' కావచ్చునేమో!

'మురహరుని యురఃస్థలి సు
స్థిరమై యువ్విభుసముల్లసిత దరహసిత
స్ఫురిత వదనామృతాదులఁ
బొరయుచు సుఖియించులక్ష్మిఁ బోల్తురె వనితల్.'

(పు. ౩౫.)

ఇట ప్రా. భాం. ప్రతులలో

'......రదనామృతాదులఁ, బొరయుచు సుఖియించులక్ష్మిఁ బొ[బో]ల్దురె యువిదల్'

అని కాగితపు ప్రతియందును,

'...లక్ష్మిఁ బోల్దురె వనితల్'

అని తాటాకుప్రతియందును గలదు. పాఠభేదము సూచింపకపోవుట యటుండ, సంస్కరణపరత్వదృష్టితోఁ జూచినను, 'పోల్దురె' యన్నది స్వీకరింపఁ దగియుండెను. 'పోలుచు' ధాతువు అకర్మకము. అది సకర్మకమై, 'పోలు' అనుర్థము నిచ్చినచో కాని యిది యిందు పొసఁగదు. అట్టి అధికారము దానికి పొసఁగదు.

౪౧ వ పుటయందు—

'...సాధించు వీన నఖిల జగంబుల్'

అనుచో, 'అఖిలజగంబున్' అని కాగితపుప్రతి. ('అఖిల జనంబుల్' అని తాటాకుప్రతి. 'అఖిల జనములన్' అని దీని సరియగు పాఠము కావచ్చును)

'కన్నులకోకమునకు గుఱి
చన్నులు చూతమున కరుణసరసిజమునకుం

కెన్నఁగ నరమది దిరిసెము
నున్నతము స్తకము...'

అనుపద్యమున 'దిరిసెము, నున్నతము స్తకము' అనుచో పరియగు అన్వయమే లేదు. 'శిరమున కున్నతము స్తకము' అను కాగితపు ప్రతి పాఠము అన్వయదృష్టిచే ఒప్పుచున్నది. దిరిసెమున కెంత యధికార మున్నదో శిరము నకు నంత యున్నది, ఇచ్చట తెలియుటకు. ఏలయన, పై పద్యమున నిచ్చిన

'చూత మశోకంబును జల
జాతము నీలోత్పలము నెసఁగు విరవాదిం
జేతోజాతుని బాణములు...'

అన్న జాబితాలో ఈ రెండును లేవు; వీని వచ్చినను విర వాదిస్థానముననే. దిరిసెము పడినప్పుడు శిరమునే స్వీక రింపఁ జెల్లును; అథవా పాఠభేదముగనైన నది సూచింపఁ దగును. ఇవి రెండును తప్పుపాఠములే కావచ్చును; మూఁడవపాఠము దొరక లేదు. ఒప్పిదియని రూఢిగ స్ఫురింపనపుడొకపాఠమును (అందును కొంత సమంజసతి కల దానిని మానవక్కర లేదు. అసలు పంచమశరము, మల్లెవిరి, తర్వాత అవతరించినది: పంచశరవివరణము "నవ మాలికా' అన్న (అమరకోశ) పాఠము ననుసరించి మల్లె విరినికూడ తెచ్చినాడు కవి.

'కూఁ డుడిగించు నశోకము
వాడించును మల్లెవిరి వివర్ణత చేయుం
జూడఁగఁ జూతము తలఁపులు
జోడించును దమ్మి చంపి చూపుం గలువల్.'

ఇందును

'...అవర్ణతఁ జేయుఁ,...చంపి చూపుల గెలువఁ'

అని కాగితపు ప్రతియు,

'...చంపిచూపుం గవలుఁ'

అని తాటాకుప్రతియు చెప్పుచున్నవి. 'అవర్ణత' యైనను పాఠాంతరముగ నీయవచ్చును,—తక్కినవి తప్పని బాగుగ పరిశోధించియే విడిచినారను నమ్మకము పుర స్కరించుకొని చూచినను,

ఫలశ్రుతిపద్యమున

'...కలికాలదురితములు తు
ప్పలఁ దూలను'

అనుచో,

'...తు, ప్పలఁ దూరును'

అని తాటాకుప్రతియు,

'...తు, ప్పలు దూలును'

అని కాగితపు ప్రతియును. శబ్దరత్నాకరము 'తుప్పలు దూలు' ఇచ్చుచున్నది.

ఇవి కొన్ని.

'తలఁపు నిలుప......' (పుట ౭) అన్న ఎత్తుగీతమున 'గిలుపను' 'నిలుఁపు' అని పాఠాంతర మిచ్చినారు. కాని ప్రా. భాం. ప్రతులు రెంటను 'నిలుప' అనియే యున్నది. వాని పాఠమే గ్రంథమున నిచ్చి, తమప్రతినుండియో వేఱుపాఠ మిచ్చినారేమో. మఱి యీపద్ధతి కూడ అంతట సాగ లేదు.

అన్యభిరసోదాహరణపద్యమున (పు ౬)

'......ఇ
ట్టలముగ నొక్కబట్టబయటం బదిలంబుగ నిల్పి పెక్కు రూపుల......'

అనుచో,

'ట్టలముగ నొక్కబయిటం బదిలంబుగ నిల్పియు వాని
పెక్కురూ'

అని పాఠభేదమిచ్చినారు క్రింద. ఛందోలక్షణమున కేని లొంగని దీనిని ఒక (భాండాగారపు) ప్రతియం దున్న దానిని ఉన్నట్టు చూపినారు. ఈపద్యమందలివే తక్కిన ప్రోలెడు భేదములను తప్పులని కాఁబోలు, వదలి (దీని సరి యగుపాఠము 'ఇట్టలముగ వాని నొక్కబయటం బదిలం బుగ నిల్పి......'అని యుండును.) ఈతత్పరతి ముఖ్యములగు తావులను నిరూఢమై యుండిన బాగుండెడిది.

ప్రా. భాండాగార ప్రతులసాయము తగుతీతి నుపయోగమునకు వచ్చియున్నచో, మన కింకను విపుల

ముగ వివిధపాఠములు లభించి, 'పరిశోధించితి' మన్న ప్రకాశకులమాట బాగుగా చెల్లియుండెడిది. అర్థనిర్ణయము సులభము కానియెడల భిన్నపాఠముల ఆవశ్యకత యెంతయో యుండును. కావున ప్రకాశకుల ఊహలకు చోటిచ్చియు నోసరిలిపోవక, అర్థస్ఫురణమునకు తోడుపడు మాతృకపాఠములన్నియుపాఠకునికిలభించుటయొప్పిదము.

'.....తా
నొక్కవిధంబకా మెలఁగుచుండు మహాత్ములఁ జెప్ప
నొప్పగన్. (పు. ౬.)

'...బాలకి...' (పు. ౯.)

ఇత్యాదులను సంస్కరణస్ఖాలిత్యములు కన్పట్టెడిని.

'గోవింగుఁ బొదలఁగలరు...' (పు. ౧౩.)

ఇట 'పొదుపఁగలరు' అనియే యుండఁదగు ననితోఁచును. 'పొదలు' సకర్మకముగ గోచరింపదు.

'లలిత' అనుటకు 'లపిత', 'విటుఁడు' అనుటకు 'విభుఁడు', ఇత్యాది ముద్రాప్రమాదాదులును సంస్కార్యములు.

'......నిజాచార మెడల నందినప్రేమ
త్రుటి లజ్జాత్యాగము......'

ఇట 'ప్రేమత్వర' కావచ్చును. (భాండాగార ప్రతులందును ఈ ముద్రితపాఠమే కానవచ్చును.)

'కొన్ని సందేహములును, లేఖకప్రమాదములును నెందును దిద్దలేదు. ఒకవిధముగా నీప్రతిని లోకములో విడిచినారము' అని ప్రకాశకులు తెలిపియే యున్నారు. ఈవిలువగల గ్రంథమును ప్రకటింప మొనర్చుటయే యెంతయు ప్రశస్తము. వారు ఇంకను ప్రతులు సంపాదించి వాని సాయమున రెండవముద్రణము మఱింత పరిశుద్ధముగఁ జేయింపనున్నారనుటయు ముదావహము.

ఈగ్రంథమున విశేషము లగు ప్రయోగములు కొన్ని గలవు.

కనకరము=కనికరము

బల్లవిరి=తేటతెల్లము, బట్టబయలు

విష్వలి=గ్రీష్మము (?) 7|31

తోఁగిచూపులు

పూనము మొ.

ఇందు 'విష్వలి' నిఘంటువులఁ గానరాదు. ఎల్లప్రతులందును ఈపాఠమే కలదు.

'... ... ...
పువ్వుల సెపమున మవ్వంపుఁదోఁటలఁ
బలుమారు హరిఁ గూడి మెలఁగఁగలరు,
విష్వలి ఘనమంచు వెన్నెలతోఁ దీఁగ
చప్పరంబులఁ బ్రొద్దు జరపఁగలరు...'
(పు. ౧౩.)

ఇట్లు ఋతువుల క్రమమున నడచినది వర్ణనము. ఇచట విష్వలికి గ్రీష్మమో, (ఉష్మమో, తాపమో,) అట్టి దేదియో అర్థము కావలెను. విషు + వలి — ఇట్లేర్పడి, వలికి విరోధంబు కాఁదగు (గ్రీష్మమున) వర్తించెనా?

'ఏను బ్రియముఁ జెప్పనఁ గై
కొనిరవు కూళ విద్య కుదురై ప్రేవుల్
పూనముగఁ బక్క (లుక్క) వచ్చెదు
నూనాస్త్రునిచేత నను సుదతి యదల్చెన్.'

'ఒళ్లు హూ(పూ)నమై పోతూంది' అను ఇట్టి వాడుకలో కన్పడు పదమే యిట నగపడుచున్నది. 'తక్కువ' అను అర్థమిచ్చు 'ఊనము' అను సాంస్కృతికమే యిట్లు వాడఁబడి అర్థాంతరము నందెనా? 'ప్రేవుల్' అను హలంతము పూర్వపద మగుటచే నిది అజాది (ఊనము) అగుట ఒప్పదుగదా? 'ఊనము'నకిట్టి యర్థమున ప్రమాణమును దొరకదు. 'పూ' కారాదియే యనుటకు వ్యాకరణ మొప్పదు. అసలు నిఘంటువున ఈవాడుక 'పూనము' నర్థమిచ్చు పదము మఱియేదియు కానరాదు. 'పూనము' అను నొకపదము ప్రథమమీఁద నిట్లయిన దనుటకును దొరకదు. 'హూనము' అను రూపమును గానము. 'హూణము' ఏ లోకోక్తికో, చారిత్రికవిశేషమునకో సూచకమై యిట్లవతరించునా? ఈప్రయోగ మెట్లు సమర్థమో తెలియఁ దగినది. ఈకవి

నుడికారపు ప్రేమ యిట్టి ప్రయోగములం బూఁతపూచినది కాఁబోలు.

---

# గ్రంథస్వీకారము

## I. పురాణపతివ్రతలు

క్రౌను ౫౧ పుటలు. వెల ౪ అ. ప్రకాశకులు: విజయం అండ్ కంపెనివారు, నుంగంబాకం, చెన్నపురి.

## II. మిత్రలాభము, కాకోలూకీయము

(పంచతంత్రాంతర్గతములు) క్రౌను ౭౪ పుటలు. ప్రకాశకులు: శ్రీనివాసరావుగారు, వేదవ్యాసముద్రాక్షరశాల, విజయనగరము.

ఈ పైరెండు గ్రంథములకు రచయిత: సాహిత్య విద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు. సహజ సులభమగు శైలిలో యువవిద్యార్థుల కుపయోగించురీతి నీగ్రంథములు రెండును విరచితము లైనవి.

---

## బాలతంత్రము (శిశుపోషణ-బాలరోగములు)

సంపాదకులు: వల్లూరు సుబ్బారావుగారు,
ఎ. యస్. ఎ. సి, 'భిషగ్వర',
కార్యదర్శి, ఆంధ్రవైద్యమండలి, గుంటూరు.
వెల రు. ౧-౮-౦.

---

## అనాసక్తియోగము

## (శ్రీమద్భగవద్గీతానువాదము)

అనువాదకుడు: ఎర్నేని సుబ్రహ్మణ్యము గారు, ౨౬౨ పుటలు, వెల 3 అణాలు.

గ్రంథములు దొరకుచోటు: ఏడెళ్ల శ్రీరాములు చౌదరిగారు, పశువైద్యగ్రంథనిలయము, అంగలూరు.

---



## రేఖాగణితము

## (Sankara's Telugu Geometry)

క్రౌనుసైజు, ౩౧౯ పుటలు, వెల రు ౨-౧-౦.
గ్రంథకర్త: చాగంటి భీమశంకరరావుగారు.

ప్రకాశకులు: హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము, కపిలేశ్వరపురము (తూర్పుగోదావరి).

---

## శ్రీలక్ష్మీనారాయణస్తవరాజము

క్రౌనుసైజులో ౧౧ పేజీలు, మూల్యము నాలు గణాలు. పందడి నాగదాసప్రణీతము.

కృష్ణాజిల్లాలోని దబ్బాకుపల్లియందు వేంచేసి యుండు శ్రీలక్ష్మీనారాయణుని స్తోత్రము, గేయము.

ప్రకాశకులు: పందడి శ్రీరామదాసుగారు, దబ్బాకుపల్లి, జగ్గయ్యపేటపోస్టు (కృష్ణా).

---

## అఘర్మానుతాపశతకము

క్రౌను ౩౬ పేజీలు, వెల ౦-౪-౦.

కలిమహిమవలన నిపుడు లోకమున ప్రబలియుండు బాల్యవివాహనిషేధాద్యధర్మములనుండి రక్షించుటకు భూలోకమున నవతరింప కైలాసనాథునిగురించిన స్తోత్రము, సంస్కృతశ్లోకరూపము. ఆంధ్రతాత్పర్యమును గలదు.

గ్రంథకర్త: వేమూరి నృసింహశాస్త్రిగారు, శతావధాని, బాపట్ల.

---

## పూజాత్రయము

## (స్వధర్మప్రకాశినీ్యనుబంధము)

గౌరీపూజ, తులసీపూజ, సంతానగోపాలపూజ అను పూజాత్రయము గలిగి స్త్రీలకత్యావశ్యకమగు నీ

గ్రంథము శ్రీకనుపర్తి మార్కండేయశర్మగారి ధర్మపత్ని కీర్తిశేషురాలు శ్రీమతి కనుపర్తి రామమ్మగారి యభిప్రాయానుసారము వలయువారికి ఉచితముగ నొసగ దరు.వలయువారు ఈక్రిందివిలాసమునకు వ్రాయవలయును.

కనుపర్తి మార్కండేయశర్మగారు, స్వధర్మప్రకాశినీసంపాదకులు, నెం. ౭౨, పూనమల్లిహైరోడ్డు, బృందావనము, కీలపాకుపోస్టు, మదరాసు.

## సస్యదోహదము

నేలలు నాలుగవనాలు.

గ్రంథకర్త: మందపాటి సత్యనారాయణరాజుగారు.

ప్రకాశకులు: శారదా అండుకంపెనీ,

అనకాపల్లి (విశాఖపట్టణము).

## శ్రావణగీతములు

(శ్రావణమంగళ శుక్రవారపుపాటలు)

చిన్నసైజు. వెల ౦-౭-౦.

గ్రంథకర్త: గంధం సీతాపతి శర్మగారు, పులులూరు, (via) పొన్నూరు (గుంటూరుజిల్లా).

## తిబ్బె అక్బర్‌షాహి

డెమ్మిసైజు, పు. ౧౦౧౯ కాలికోబైండు. వెల ౬-౦-౦

గ్రంథకర్త: వైద్యభూషణ హాకీం డి. రహిం తుల్లాబేగ్ సాహెబుగారు, రాజమండ్రి.

## పత్రికా స్వీకారము

### సమదర్శిని

ప్రజోత్పత్తి ఉగాది సంచిక: ౧౯౩౧-౧౯౩౨.

ఈసంచిక శ్రీవేంకటగిరిమహారాజావారి గౌరవార్థముగ ప్రచురితమైనది. డబుల్ రాయల్ సైజు: ౧౦౨ పుటలు. ఫెదర్ వెయిటుకాగితము. ఇందు నాలుగు త్రివర్ణచిత్రములు కలవు. వెల: చందాదారులకు రు ౧; ఇతరులకు ౧-౮-౦. పలువిషయముల గూర్చిన పద్యగద్యవ్యాసములు కలవు.

---

# అమృతాంజనం డిపోవారి సుప్రసిద్ధౌషధములు

## అమృతాంజనము

చక్కని డబ్బితో సహా సీసా 1-కి రు. 0 8 0

## దంతచూర్ణము

డబ్బీ 1కి వెల రు. 0 2 0; 12కి రు. 1 4 0

ఈ దంతచూర్ణముతో పండ్లు తోముట వలన చిగుళ్లు గట్టిపడును. చిగుళ్లనుండి రక్తము కాఱకుండును. నోట దుర్గంధము లేక యుండును. పండ్లుముత్యములవలె తెల్లగా నుండును. సర్వసామాన్యముగ వాడుటకు దగియున్నది.

## తామర తైలము

డబ్బీ 1కి 0 6 0. 12కి 3 8 0.

తామర ఒకవిధమైన పురుగులవలన చర్మము మీదగాని, వెండ్రుకలలోగాని, లోచర్మములోగాని, గోళ్లలోగాని పుట్టవచ్చును. పురుగులలోని భేదములబట్టి తామరలోను రెండు మూడు భేదములు గలవు.

గుర్తులు:—దురద, ఉంగరముల వంటి చుట్లు, పొక్కులు, రసి కాఱుట, వెండ్రుకలు ఊడిపోవుట మొదలగునవి కొంచెముగా లేచి శరీరమందంతట వ్యాపించి నిద్రపట్టని జిల యేర్పడును.

## మోహినీ తైలము

5 తు॥ నూనెగల సీసా 1కి రూ. 0 12 0

స్త్రీపురుషులు వాడుటకు యోగ్యమైనది.

మెదడుకు చలువజేయును, కండ్లకు చలువ జేయును, వెండ్రుకలు పెరుగును, వెండ్రుకలు రాలకుండును, వెండ్రుకలు నునుపుదేరును. మనోహరముగా నుండును, సువాసన గలిగి యుండును, తలయందు చుండును పోగొట్టును, వాసన రమ్యముగా నుండును. ముఖమునకు తేజస్సు నిచ్చును, వెండ్రుకలను చిట్లనియ్యదు అనేక సీసాలు విక్రయము.

## గజ్జికి తైలము

డబ్బీ 1-కి వెల రు. 0 4 0. వి. పి. 0 9 0

గజ్జి, చీడ శరీరమంతట వ్యాపించి ముఖ్యముగ చిన్న పిల్లలకు విశేషబాధను గలిగించుచున్నవి. ఈ తైలమును నాలుగుపూటలు రాచిన గజ్జి, చీడ, చిలుము, జిల మొదలగునవి నశించును. తప్పక పనిజేయును.

## తేలుమందు

సీసా 1కి వెల రూ. 0 8 0 వి. పి. 0 13 0

కుట్టినచోట కొంచెము మందు పోసిన, బాధ మాయమగును. మందును గలిగియున్న, తాము బాధపడక ఇతరులకు పుణ్యము గట్టుకొనవచ్చును. ప్రతియింట నుండదగినది.

## రోమహారి

డబ్బీ 1కి రు. 0 8 0 వి. పి. తో 0 13 0

ఈ భస్మమును నీటితో కలిపి పట్టించిన రోమములు రెండునిమిషములలో మొదలంట రాలిపోవును. దీనివలన చర్మము నలుపెక్కదు, మంట యుండదు. రోమములు రాలిపోవును.

## పగుళ్లకు తైలము

డబ్బీ 1-కి వెల రు. 0 6 0. వి. పి. 0 11 0

అరికాళ్లు, అఱచేతులు, చర్మము కారకమువలన శీతగాలివలన పగిలి నీరుకారుటయు, జిలపుట్టుటయు సంభవించును. ఈ తైలమును రాచిన,పగుళ్లుమాని జిల పోయి మంచి చర్మము రాగలదు.పగుళ్లనొప్పియు నయమగును. స్వల్ప క్రయము.

**అమృతాంజనము డిపో, బొంబాయి. మదరాసు.**

# సాభిప్రాయవిశేషములు

ప్రపంచ మంతయును ప్రళయావస్థకు పాల్పడుచున్న వర్తమానసందిగ్ధసమయమునందు సమస్తలోకమునకును సుఖప్రదమైన ధర్మనిర్ణయమును జేయుట దుస్తరముగ నున్నది. ప్రపంచమునందు శాంతిసౌఖ్యములను సమకూర్చుటకు శాంతికాములు వారివారి సంస్కారమున కనుగుణముగను పురుషార్థసాధనములను నిర్ణయించుచున్నారు. శాస్త్రజ్ఞులు శాస్త్రపరిశోధనలను, సాంఘికనేతలు సంఘవ్యవస్థలను, ఆర్థికపండితులు అర్థనిర్ణయములను, మతాభిమానులు మతసిద్ధాంతములను, రాజ్యాంగకోవిదులు రాజ్యాంగనిర్మాణములను, పారిశ్రామికులు పరిశ్రమవ్యాపనమును పురుషార్థమునకు సాధనములుగ నిర్ణయించుచు ధర్మనిర్ణయములను జేయుచున్నారు. ఈపండితులు చేసెడి ధర్మనిర్ణయములు సామాన్యప్రజాహృదయమునందు మహాసంక్షోభమును గలుగ జేయుచున్న విధమును సభావ్యవహారములు, వార్తాపత్రికలు విశదము చేయుచున్నవి. రాజ్యాంగములే పురుషార్థమునకు లక్ష్యమైన వర్తమానయుగమునందు పురుషార్థమునకు మూలమైన ధర్మలక్ష్యము లుప్తమై అర్థకామలక్ష్యములు విపరీతము లైనవి. విపరీతమైన భాగ్యభోగలక్ష్యములు పరమానర్థములకు మూలము లగుచున్నవి. జాతులు, సంఘములు, కుటుంబములు, వ్యక్తులు, రాజ్యాధికారులు, మతగురువులు భాగ్యభోగములకై ధనదేవత నారాధించుచు ధర్మదేవతను విస్మరించి మహాప్రళయమును గలుగజేయుచున్నారు.

ధనమూల మిదం జగత్

జగత్తు ధర్మమూల మగుటకు బదులు ధనమూల మైనది. ధనార్జనమునకై వ్యక్తులు, జాతులు సకలమును సమర్పించుచు సంక్షోభమును గలుగజేయుచున్నారు. ధర్మస్థానమును ధన మాక్రమించినది. భర్తృహరివర్ణన "సర్వే గుణాః కాంచన మాశ్రయంతి" సార్థక మైనది. పండితపామరలక్ష్య మంతయును ధర్మసంరక్షణమునందు గాకను ధనసంరక్షణమునందు వినియోగపడుచున్నది. పాశ్చాత్యరాజ్యములు ప్రపంచమునంతను నిర్మాణపదార్థములతో ముంచివేయుటకు గతించిన శతాబ్దియందు జేసిన ప్రయత్నములు విఫలము లైనను సోవియెటురుష్యా ప్రపంచమునంతను పదేండ్లలో రష్యానిర్మాణములతో ముంచివేయుటకు జేయుచున్న ప్రయత్నములు విస్మయమును గలుగ జేయుచున్నవి. యంత్రాలయములందు మానవులు బొమ్మలవలెను జేసెడి పనులు మానవధర్మమును సంకుచితము చేయుచున్న విధ మసహ్యా మైనను రుష్యా యవలంబించుచున్న మార్గము లోకమునం దంతటను జిజ్ఞాసకు

మూలమగుచున్నది. పాశ్చాత్యనిర్మాణపదార్థములు గలుగజేసిన యార్థికవిప్లవము ప్రత్యక్షముగ గోచరం బగుచున్నను రుష్యారాజ్యము నిర్మాణవిధానమునకు బూనుకొనుట మహావిప్లవమునకు మూలముగ నున్నది. ప్రపంచ మంతయును రుష్యావిధానమును ప్రతిఘటించునపుడు భావిపరిణామమును నిర్ణయించుట యసాధ్యము. వర్తమానపరిస్థితుల నుపశమింపజేయుటకు హూవరుగారు నిర్ణయించినపద్ధతి ప్రశంసాపాత్రముగ నున్నది.

హూవరుగారు, అప్పులను నిలుపుపద్ధతి

వర్తమానసంవత్సరమునందు లోకమునం దంతటను ధరలు పడిపోయినవి; పరపతి చెడినది; ధన మంతరించినది; ప్రజల కొనే శక్తి తగ్గిపోయినది. ఈ దురవస్థయందు హూవరుగారు అమెరికా అప్పుల నొకయేడాపుటకు జేసిన యేర్పాటులు ప్రపంచమునం దంతటను నామోదమును బడసినవి. గ్రేటుబ్రిటను అమెరికావలెనే తన యప్పుల నాపుట కంగీకరించినది. దుర్భరస్థితియందున్న జర్మను దేశమున కీ యేర్పాటు గుక్కను త్రిప్పుకొనుట కవకాశము నొసంగినది. ఫ్రాన్సు మాత్రము 'ససేమిరా' యని పట్టు విడువకున్నది. ఫ్రాన్సు నావహించిన జర్మను పిశాచభయము మాత్రము విడువకుండుట విచిత్రముగ నున్నది. అమెరికాపట్టుదల, ప్రపంచ పరిస్థితులు ఫ్రాన్సునకు జ్ఞానోదయము గలుగజేయవలసియున్నవి. హూవరుగారి యేర్పాటుల నన్ని దేశములును నంగీకరించుటవలనను ప్రపంచమునకు తాత్కాలికోపశమనము గలుగుట సహజము. వివిధదేశములందును 400 కోట్ల రూప్యములు వ్యాపారపరిశ్రమల నభివృద్ధి జేయుటకు వినియోగపడునపుడు భరతవర్షమునందును వ్యాపారపరిశ్రమ లభివృద్ధిని బొందుట కవకాశము లేర్పడగలవు.

భరతవర్షము-ఆర్థికస్థితి

ఆర్థికస్థితి బాగుపడుటకు స్వతంత్రదేశములకు గల యవకాశములు పారతంత్ర్యము ననుభవించెడి భరతవర్షమునకు గలుగజాలవు. మారకపురేటు 18 పెన్నులు, సైన్యవ్యయము, విదేశోద్యోగులు, అప్పులు, విదేశ వ్యాపారము భరతవర్షమున కార్థికస్వాతంత్ర్యావసరమును చెప్పక చెప్పుచున్నవి. విదేశవస్త్ర బహిష్కరణమునట్లు బ్రిటీషుప్రజలు పెట్టుచున్న మహాఘోష భారతీయుల నిస్సహాయస్థితిని సువ్యక్తము చేయుచున్నది. ఫెడరలు విధానము కార్మికస్వాతంత్ర్యమునకు కీలకముగ నున్నది. రక్షణోపాయములు పారతంత్ర్యదుఃఖవేదన ననుభవించుచున్న హిందూస్థానమునకు గావలయును గాని స్వాతంత్ర్యసౌభాగ్యము ననుభవించుచున్న గ్రేటుబ్రిటనున కవసరము లేదు. బ్రిటీషు రాజ్యాధికారు లీ సామాన్యధర్మమును గ్రహించనంతవరకును ఫెడరలువిధానమువలననుగాని, రామ్సెమాక్డొనాల్డుగారు చేయదలచిన ధనసాహాయ్యమువలననుగాని హిందూస్థానమునకు ప్రయోజనము గలుగజాలదు. హైందవులస్వాతంత్ర్యమువలన హిందూస్థానమునకే కాక గ్రేటుబ్రిటనున

